శిల్పి గ్రంథమాల - ౫౪ [illegible] కుసుమము

# యోగసూత్రసిద్ధాంతము

టంగుటూరి ప్రకాశం




౧౦ నరసింగపురం వీధి
మౌంట్ రోడ్, మద్రాసు

# విషయ సూచిక

అధిమానవుని (Superman) మానసికస్థితి అవగాహన చేసుకునే ప్రయత్నం పాశ్చాత్య మానసికశాస్త్రంలో జరగనే లేదు. యోగసూత్రము సామాన్యమానసిక స్థితితో బాటు అధిమానవమానసికప్రవృత్తినికూడా నిర్దేశించి వర్ణిస్తూ తత్ప్రాప్తి సుగమం చేస్తుంది.

ఆంధ్రంలో అనేక సంస్కృత తాత్త్విక గ్రంథాల అనువాదా లున్నా, ప్రాచీనదర్శనవిజ్ఞానం అధునాతనదృష్టితో విమర్శించి జనసామాన్యానికి సులభంగా అందించే ప్రయత్నం ఇంతవరకూ జరగలేదు. శ్రీ ప్రకాశంగారు అనుక్షణము ప్రజాసేవాతత్పరులైనా ఇంతఃపూర్వం కారాగారాల్లో లభించిన అల్పావకాశాలవల్ల భగవద్గీతాది తాత్త్విక గ్రంథాలకు సరళవ్యాఖ్యలు రచించారు. ఇంకా కొన్నిటిని సులభమైన జానుతెనుగులో సవివరంగా వ్రాశారు. యోగసూత్రసిద్ధాంతంలో పతంజలి యోగదర్శనంలోని గహనవిషయా లన్నీ క్రోడీకరించి, శాస్త్ర విషయాలకు సాధ్యమైనంత సులభశైలిలో ఆవిషయాలన్నీ జనసామాన్యానికి అందించారు. అంతేకాక బౌద్ధజైనాది సిద్ధాంతాల్లో ఉన్న తాత్త్వికవిషయాలు కూడా బాగా విపులీకరించి యోగసూత్రసిద్ధాంతాలతో కలిపి వాటి తారతమ్యపరీక్ష చేశారు. దీనివల్ల వారు ఆంధ్రలోకానికి యోగదర్శనంతో బాటు ఆయా సిద్ధాంతాల సులభ పరిచయం కూడా కలిగించినవా రైనారు.

ఈ మధ్యన మన ప్రాచీనసంస్కృతికి తగినంత గౌరవం ఇచ్చి దానిని ఇంకా గభీరంగా గ్రహించే ప్రయత్నాలు చేస్తున్నారు. శ్రీ ప్రకాశంగారు రచించిన ఈ గ్రంథం ఆంధ్రంలో అంతటా యోగసూత్రవిషయమైన జిజ్ఞాసను రేకెత్తించగలదనీ, పాతంజల యోగదర్శన సిద్ధాంతాల అవగాహనకు అత్యంత సహాయకారి కాగలదనీ ఆశిస్తున్నాము.

ఈ సందర్భంలో అడిగిన వెంటనే ఈ అత్యుత్తమ గ్రంథం మాశిల్పిగ్రంథమాలలో ప్రచురించడానికి అనుమతించిన శ్రీ ప్రకాశంగారికి మా హృదయపూర్వకమై కృతజ్ఞత నివేదించుకుంటున్నాము.

ముద్రణ దుష్కరమైన ఈ సమయంలో త్వరలో గ్రంథం ముద్రించి ఇచ్చిన సరస్వతీ ముద్రణాలయాధిపతులు శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయడుగారు చేసిన సహాకారము ప్రత్యేక స్మరణీయము.

'శిల్పి'
చెన్నపురము — శ్రీ గణపతిశాస్త్రి.
౧౦—౪—౪౮

హరిః ఓమ్

# యోగసూత్ర సిద్ధాంతము

## యోగము

పతంజలి యోగసిద్ధాంతము కేవలము మనోనిగ్రహమునకు చెందినది కాదు. దాని ముఖ్యసూత్రములు Metaphysical and Ethical Purposes. ఇది Psychological System నకే చెందినది కాదు. బౌద్ధమతముతప్ప మిగిలిన అన్ని సిద్ధాంతములకు దీనికిని ఉండే భేదమేమనగా (Psychological Problems) మనోనిగ్రహమునకు సంబంధించిన విషయములనుగురించి పతంజలిసిద్ధాంతము ఒకేదృష్టితో విడువకుండ చర్చించుచు వచ్చినది.

కొన్ని ముఖ్యాంశములను (సాక్ష్యములేకుండా) దృష్టాంతములేకుండ ఊహించవలసియుండుటచేత యోగసిద్ధాంతమునకు ఈస్థితి కలిగినది.

ఊహించబడిన సంగతులనుగురించి ముందుగా తెలుసుకొన్ననేగాని ఈసిద్ధాంతముల నిజతత్వము తెలిసికొనుట సులభము కాదు.

## యోగ సూత్ర సిద్ధాంతము

# సాంఖ్య యోగము

సాంఖ్య, యోగములనేవి కవలపిల్లలవంటివి, సాంఖ్యము, యోగము రెండుకూడా ప్రకృతి, పురుష ద్వంద్వముతో ప్రారంభించుచున్నవి.

పురుషుడు, ప్రకృతిలో ఎప్పుడు ప్రవేశించినాడు? ఏలాగు ప్రవేశించినాడు? అని చెప్పుటకు సాంఖ్యమునకే కపోయిన ప్పటికిని, ఇతర సిద్ధాంతములలోవలెనే ఇవి కూడ పురుషుడు ప్రకృతిలో గూడ కలియుకుండా ఉండే లాగుచేసి పురుషునికి స్వాతంత్ర్యమును ఇచ్చుటకు సాధ్యమేనా? అని ఊహించుచున్నవి.

సాధారణముగ మానవకోటికి ప్రకృతి పురుష సంయోగమువల్ల సుఖము లభించుచున్నదని తలచబడుచున్నప్పటికి, అసంయోగము దుఃఖముకొఱకే అని అనుభవము మీద ఆఖరుఅవస్థలో కనిపెట్టబడుచున్నది.

రెండు సిద్ధాంతములలోను ప్రకృతిబంధములోనుంచి పురుషుని విడిపించుటయే శ్రేయస్కరమైన పని, అని ఒప్పుకొనబడియున్నది.

రెండు సిద్ధాంతములలోను పురుషులు వేరువేరుగా

అనేకములుగా నున్నారని ఒప్పుకొనబడియున్నది.

రెండు సిద్ధాంతములలోను, ప్రతిపురుషుడు వేరు వేరుగా కైవల్యమును పొందుచున్నాడని ఒప్పుకొనబడి యున్నది.

విముక్తివలన కలిగేఫలము కైవల్య మనీ, విముక్తి అయినతర్వాత ఒకపురుషుని ఆత్మకును, మరియొక పురుషుని ఆత్మకును, ఎట్టిసంయోగము లేదని, రెండు సిద్ధాంతములును ఒప్పుకొనుచున్నవి.

ఈకైవల్యపదవిలో ప్రతి ఆత్మ, శుద్ధిని పొంది స్వయం ప్రకాశమును, స్వతంత్రతను ప్రకృతిలోనుంచి విడిపోవుటమూలముగా పొందుచున్నది.

విముక్తిని పొందుటకుపూర్వము, రెండు ఒకటిగా నడచుచు ద్వంద్వములను అనుభవించుచుండెడివి.

లౌకికజ్ఞానములేని వైదికులవల్ల ప్రకృతితో పురుషుడు బంధింపబడి ఏకముకావడము, జ్ఞానమును పొందడము, విడుదలనుపొందడము, అన్నికార్యములుకూడ ప్రకృతివల్లనే నడుపబడుచున్నవనియు, పురుషుడు ఆపనులు చేయుటకు శక్తిలేనివాడనియు తలచబడినది.

అయినప్పటికిని పండితులు వేఱువిధముగా తలచు చుండిరి. 'పురుషుడు, తనబంధములోనుండి విడుదలను పొందు

కోరి ప్రయత్నముచేసి అర్హతను సంపాదించుకొంటేనే గాని, సంసారబంధనములోనుంచి విమోచనము పొందజాలడు.' అని పండితుల అభిప్రాయము.

## ప్ర కృ తి బ ం ధ ము లు

ప్రకృతిచేత కట్టబడేవాళ్లు, అనేకరూపములుగా నుందురు. స్థూలరూపములో ఉండవచ్చును, సూక్ష్మరూపములో ఉండవచ్చును. ఒకప్పుడు ఆత్మ ఎంతసూక్ష్మముగా ఉండునో అంత సూక్ష్మముగా తనంతట్లు ఉండవచ్చును. అట్టిస్థితి, ఆత్మకు కైవల్యము లభించుటకు దాదాపుగా ఎక్కువ కష్టములతో కూడుకొన్న పరిస్థితులు ఏర్పడవచ్చును.

విముక్తికలుగకుండగనే విముక్తికలుగుచున్నదనే భ్రాంతిలో నుండవచ్చును. ప్రకృతి క్రమముగా మొదట, బుద్ధి, లేక మోహములోనికి మారును; పిమ్మట అహంకారములోనికి మారును; తరువాత కర్మేంద్రియములుగాను, జ్ఞానేంద్రియములుగాను మనస్సుగాను మారిపోవును.

అయిదు కర్మేంద్రియములు, అయిదు జ్ఞానేంద్రియములు మనస్సు, అహంకారము, బుద్ధి, వీటిసహాయముతో

పురుషుడు బయటివిషయములను, లోపలివిషయములను గ్రహించుటకు తగిన శక్తి కలిగేలాగు, ప్రకృతి చేయుచున్నది. అదే సమయములో సూక్ష్మరూపములోనుండే పంచతన్మాత్రలు అని పిలువబడే పంచభూతములను, స్థూల రూపములోనుండే మహాభూతములను గ్రహించేలాగు చేయుచున్నది. ఈవిధముగా ఆత్మశక్తి ప్రకృతిలో లీనమై పోవును. స్వతంత్రమనేది పూర్తిగా నశించును.

మూడుగుణములచేత చేయబడిన ప్రకృతి ఈవిధముగా పురుషుని ఆత్మను స్వాధీనముచేసికొని బంధించుచున్నది. ఈవిధముగా ఆత్మ ప్రకృతిలో కలిసిపోయి, స్వతంత్రత నశించుటచే అజ్ఞానముచేత ప్రకృతితో ఐక్యమై ప్రకృతి ఎలాగు నడిపించిన ఆలాగుననే నడచుచున్నది.

ఈవిధముగా ప్రకృతివల్ల వడకబడే నూలుత్రాళ్ళతో బంధింపబడిన ఆత్మ ఊపిరిఆడకుండా ఉండును.

## విడుదల యోగము

ఇటువంటి కష్టదశలోనున్న ఆత్మను బంధములో నుంచి విడిపించుటయే యోగముయొక్క ముఖ్యోద్దేశ్యము. విమోచనము ఒకేపర్యాయము కలుగదు. ప్రకృతి దేహము క్రమేణ దారిలోనుండే ఆటంకములన్ని

తొలగించుచు, ఆటంకములనే సాధనములుగా ఉపయోగించుచు ప్రకృతికట్టిన త్రాళ్ళను వదలివేసి, ఆత్మను వదలిపెట్టి, తన నిజస్వరూపమును పొంది ఆత్మసహాయము లేకపోవుటచేత తానుకూడ నశించుచున్నది. ఆత్మ స్వతంత్రతను పొంది కైవల్యము చేరుచున్నది.

ఇది యోగసిద్ధాంతముయొక్క నిజస్వభావము. ఇది చార్వాకసిద్ధాంతముకంటె వేరై యున్నది.

## చార్వాక సిద్ధాంతము

చార్వాకసిద్ధాంతములో దేహమే ఆత్మగా భావించ బడియున్నది. గనుక, ఆత్మకు విముక్తి అనేది లేదు. దేహముతో పాటు ఆత్మగూడ నశించుచున్నది.

## ఇంద్రియములు

బయటి విషయములను ఆకర్షించే ఇంద్రియములు ప్రకృతిలో నుండే అనేకములైన అందములను, రుచులను, భోగములను ఆత్మకు అందజేసి, భ్రాంతిని కలుగ జేయుచున్నవి. ఆత్మ విషయభోగములలో మగ్నమైపోవుచున్నది.

లోపలి ఇంద్రియములైన, మనస్సు, అహంకారము, బుద్ధి పనిచేయుటకు ప్రారంభించి, ఆత్మను పూర్తిగా బంధించి ఇటునటు కదలకుండా చేయుచున్నవి.

ఉపనిషత్తులు బోధించినట్లే, యోగసిద్ధాంతము కూడ ఆత్మను దేహముతో గాని, ఇంద్రియములతో గాని, మనస్సుతో గాని, అహంకారముతో గాని, బుద్ధితో గాని, ఐక్యము కాకుండా చేయవలెనని బోధించుచున్నది. మఱియు ప్రకృతిసంబంధమైన బంధములను తొలగించి ఆత్మను స్వాతంత్ర్యముతో కూడుకొన్నదానిగా చేయవలయునని యోగశాస్త్రము బోధించుచున్నది.

## దేహము - ఆత్మ

దేహేంద్రియములు లేకుండా, ఆత్మయేలాగు పని చేయగలదు? అవి లేనప్పుడు, ఆత్మకూడ ఎండి ఆవిరి అయిపోలేదని ఏలాగుచెప్పగలము?

అవి లేకుండా ఆత్మ ఒకటి ఉన్నదని ఏలాగు తలచగలము. చార్వాకమతములో దేహమే ఆత్మగనుక, దేహముతోగూడ ఆత్మ నశించుచుండుటచేతను, ఈ సందేహములు కలుగుటకు అవకాశములేదు.

సాంఖ్యసిద్ధాంతములో ఈ ప్రశ్నలకు జవాబు చెప్ప వలసి ఉన్నది.

## యో గ సి ద్ధాం త ము

యోగసిద్ధాంతము ఈ ఆక్షేపణలకన్నిటికిని ఈక్రింది విధముగా జవాబు చెప్పి, ఆటంకముల నన్నిటిని నివారణ చేయుచున్నది.

విషయములను తెలిసికొనుటకు తెలిసికొను పురుషు డుండవలెను. యోగసిద్ధాంతము ప్రకారము తెలుసుకొను శక్తి ఆత్మకు ఉన్నదిగాని దేహేంద్రియాదులకు లేదు. ఈవిధముగా తలంపులను, తెలుసుకొను ప్రజ్ఞాశక్తికి ఉండే భేదమును చూపించి, పిమ్మట తలంపులకు సంబంధిం చిన అనుభవము లన్నియు భ్రాంతులనియు, అనగా నిజముకావు అనియు, ప్రజ్ఞాసంబంధమైన అంతర్దృష్టి యావత్తు ఆత్మకు చెంది ఉన్నదనియు, యోగసిద్ధాంతము చెప్పుచున్నది. పైనచేయబడిన ఆక్షేపణ లన్నియు వాటి యంతట అవియే తొలగి పోవుచున్నవి.

కాని సామాన్యముగా అర్థముచేసికొనుటలో, ఆత్మకు, దేహమునకు ఉండేభేదమును తెలుసుకునే శక్తియే ఆత్మ శక్తియని తలచబడుచున్నది. అనగా, వివేకఖ్యాతియే

ఆత్మవలన తెలిసికొనబడడము అనే శక్తిగా తలంచబడు చున్నది.

ఇది సరి కాదు. బహుశః దీనికి నిజమైన అర్థము ఈక్రింది విధముగా ఉండవచ్చును.

ప్రజ్ఞ, ప్రకృతిగా వృద్ధి అయినప్పుడు, ఆత్మయొక్క నిజ స్వభావము తెలిసికొనబడుచున్నది. అంతేగాని ప్రకృతికి, ప్రజ్ఞకు, మధ్యనుండే భేదమును తెలిసికొనుట కాదు.

కాని, దీనివలన ఒక అతియోగి కష్టము సంభవించుచున్నది. విషయములకు సంబంధించిన జ్ఞానము నశించినప్పుడు ఎటువంటి జ్ఞానము మిగిలియున్నదో, అసంగతి చెప్పుట అంత సులభము కాదు.

సాంఖ్యసిద్ధాంతములో ఆత్మ, దేహముయొక్క బంధములోనుండి విడిపడుచున్నది అనియు, విడువబడి నప్పటినుండి శాశ్వతమైనదిగాను, స్వచ్ఛమైనదిగాను, స్వయంప్రకాశముతో కూడుకొన్నదిగాను, స్వతంత్రమైనదిగాను అగుచున్నదనియు చెప్పబడినది. దానినే యోగసిద్ధాంతముకూడ అంగీకరించి ఉన్నది.

అయినప్పటికి రెండుకూడ, ప్రజ్ఞాశక్తిని ఉపాధిగా మాత్రము తీసికొనలేదని, ఆత్మగానే తీసికొనినవని స్పష్ట పడుచున్నది.

వేదాంతులు, సర్వజ్ఞత్వవిషయములో చేసినట్లే సాంఖ్యులు, యోగులుకూడ చేసినారు. అట్లాగు చేసి ఉండనిచో మొదల, న్యాయ, వైశేషిక సిద్ధాంతములకుపట్టిన అవస్థయే, వీటికికూడ పట్టియుండును.

న్యాయవైశేషిక సిద్ధాంతములలో ప్రజ్ఞాశక్తిని (spirit) మనస్సును విడదీయుటచేత, ప్రజ్ఞ జాతితో సమానముగ చేయబడినది.

అట్టిస్థితి సాంఖ్యములోను, యోగములోను, సంభవించుటకు అవకాశములేదు. ఏలననగా వానిసిద్ధాంతములలో 'ప్రజ్ఞయే' అనగా బోధస్వరూపమే ఆత్మగా భావించబడియున్నది. కాని దానిని గొప్పయోగులవల్ల పొందబడే 'సర్వజ్ఞత్వముతో' సరిపోల్చుటకు సాధ్యముకాదు.

విషయభ్రాంతి నశించినతర్వాత దేహబంధములోనుంచి విడువబడిన ప్రజ్ఞ సర్వజ్ఞత్వముతో సరితూగదు. కారణమేమంటే, 'సర్వజ్ఞత్వము' బాగావృద్ధిలోనికివచ్చిన ప్రజ్ఞకు ఉపాధిగా అగుచున్నది, ప్రజ్ఞ అనేది ఆత్మయే అగుచున్నది గనక.

జైనులసిద్ధాంతములో విముక్తిని పొందిన ఆత్మలుకూడ దేహముతో కూడుకొన్నవై, సర్వజ్ఞత్వమును, ఆనంద

న్నదో అలాగుననే ఆత్మచుట్టు ఎన్నిమార్పులు కలుగు చున్నప్పటికిని, ఆత్మమాత్రము కదలకుండ అదే విధముగా నుండును. కాబట్టి యోగి అయినవాడు మనసు యొక్క చంచలత్వమును నశింపుచేయుటకు ఏకాగ్రత్వమును అభ్యసించుట, విధియైయున్నది.

## చిత్త వృత్తి రెండు విధములు

౧. క్లిష్ట - అనగా కష్టములతోను, ఆటంకముల తోను కూడుకొన్నది.

౨. అక్లిష్ట-ఆటంకములుగాని కష్టములుగాని లేనిది.

మొదటి తరగతికి చెందిన చిత్తవృత్తులు అన్ని అవిద్య లేక అజ్ఞానముతో కూడుకొన్నవై ఉన్నవి.

రెండవది ప్రజ్ఞ, లేక జ్ఞానముతో కూడుకొన్నది.

మొదటి తరగతికి చెందిన అజ్ఞానులు దేహమే ఆత్మ అనేవారును, అపరిశుభ్రమైనదానిని, రాగమును, శుభ్రమైనదానిగా నమ్మేవారును, కష్టమై దుఃఖముతో కూడుకొన్న దానిని సుఖముగా తలచేవారును, ద్వేషము, బాధతో కూడుకొన్నది అయినను, దానిలో సంతోషమును చూచువారును, నాశముతో కూడుకొన్నదానిని శాశ్వ

ఇట్టిస్ఫూర్తులు అనగా, అయిదు వాయువులు, మనస్సులో కూడ పదకొండు ఇంద్రియములు, అహంకారము, బుద్ధి మొదలైనవాటిచేత కల్పించబడు స్ఫూర్తులు. ఇట్టి స్ఫూర్తులలో కూడుకొన్న చిత్తము, కార్యచిత్తము అనబడును.

సృష్టిలో, మనుష్యులందరు ఒకేవిధముగా సంతసనీ, ఏ ఇద్దరు మనుష్యులును ఒకేవిధముగా నుండరని లోక ప్రసిద్ధమే. దీనికి కారణము పురాకృత కర్మఫలము.

పురుషుడు చేయు పుణ్యపాపకర్మముల ననుసరించి వాటికి అనుకూలమైన దేహములలో జీవుడు ప్రవేశించు చున్నాడు. యోగముయొక్క సహాయము లేనప్పుడు ధర్మాధర్మముల ననుసరించి మనుష్యుడు జన్మతరువాత జన్మము నెత్తుచున్నాడు.

కర్మచేత, కర్మఫలముచేత, జ్ఞానము తగ్గిపోయి అజ్ఞానము వృద్ధిఅగుచున్నది. కారణ మేమనగా:—

కారణచిత్తము ఇక్కడ, అక్కడ అనకుండా సర్వత్ర ఒకేకాలములో చలించుచుండును.

యోగాభ్యాసమువలన ఇట్టిచపలత్వము కొంత మందిలో ఆపుచేయుటకు సాధ్యమైనది.

సాంఖ్యసిద్ధాంతములో మాత్రము ఆవిధముగా, ఆటంక పరచుట సాధ్యముకాదు. కారణచిత్తము అన్నిచోట్ల

ఒకటేకాలములో ఉంటున్నది. అని సాంఖ్యులు ఒప్పు కొనరు.

వేఱువేఱు శరీరములలో మాత్రమే ఉంటున్నదని వారి వాదము.

కాబట్టి, చిత్తవృత్తి మొదటి ఆటంకము, మనుష్యు లందఱిలోను ఈచిత్తవృత్తి ఒకేవిధముగ ఉండదు. ఒక్కొక మనుష్యునకు ఒక్కొకచిత్తవృత్తి ఉంటున్నది

పూర్వకర్మలను బట్టియు కర్మఫలములను బట్టియు చిత్తవృత్తి మనుష్యులను అభివృద్ధిలోనికి వచ్చు నవకాశ మియ్యదు.

దేవతలుకూడ జ్ఞానమును సంపాదింపలేక మాఱల మనుష్యజన్మ మెత్తుచున్నారని చెప్పబడి ఉన్నది.

మనుష్యులందఱు ఒకటేచోట ప్రారంభించి మోక్షమును పొందుటకు ఒకటే విధమైన శిక్షణము పొంద నవసరము లేదు.

చిత్తము ప్రతిమనుష్యునిలోను వేఱువేఱుకోరికలతోను, ఆశలలోను, వారివారి కర్మననుసరించి పనిచేయుచుండును.

## వాసన

పుట్టుచు చచ్చుచు అనేక రూపములుగల శరీరములలో నుంచి పోవుచుండుటచేతను, పుణ్యకర్మలు పాపకర్మలు

మొదలైనవానితో గూడుకొని యుండుటచేతను జీవుని చిత్తము కర్మవాసనను కూడ తీసికొనిపోవుచున్నది.

## వాసనలు

ఈవాసనలు శాశ్వతమైనవి. అవి అలవాటులు, జ్ఞాపకములవంటివి కావు. దేహముతో గూడ నశించునవికావు. యోగి అయినవాడు ఈవిధముగా కంటికి కనబడునటువంటి కష్టములను, ఆటంకములను తొలగించవలసియున్నది.

పూర్వజన్మములనుంచి తీసికొనిపోబడిన వాటిని గడచిపోయిన కాలములో చేయబడిన కార్యములవల్ల పైకికనబడకుండా లోపల నిలువగా ఉంచబడిన సంస్కారములను, మరియు స్వభావసిద్ధమైన ఇతరకర్మవాసనలను, వీటినన్నిటిని అపుచేసి, వివేకజ్ఞానమును పొంది, వాటి నన్నిటిని పూర్తిగానాశముచేయుట యోగికి విధి అయియున్నది.

శ్రోత్రబంధముకలుగజేయు హృదయగ్రంథులను తొలగించుటయే యోగికర్తవ్యము.

కాబట్టి బ్రాహ్మణసిద్ధాంతములోను, బౌద్ధసిద్ధాంతములోను, జైనమత సిద్ధాంతములోను ఈవిధముగా విధించబడియున్నది.

కొన్ని ప్రాతవానిని జయప్రదముగా వశింపజేయు

చుండగా అప్పుడప్పుడే క్రొత్తగా పుట్టువానినిపోగా తల లెత్తకుండ చేయువలయును. కైవల్యమునుగాని ఆప్తతనుగాని పొందుటకు ఆశించు యోగి, ఈవిధముగా నడిచితీరవలెను.

అనేకములైన సమాధులను, భూములను గుణస్థానకములను, ప్రజ్ఞను బొందుటకు అవసరమైన పనులను యోగి చేసితీరవలెను. నిజియు యోగ్యుడైన వాడు యోగములో పొందిన స్థానమును పోగొట్టుకొని యోగభ్రష్టుడు కాకుండా ఉండుటకు జాగరూకతతో ప్రవర్తించవలెను.

చిత్తములోనుండే చంచలత్వియును ఆపుచేసి లోపల దృష్టిని పొందేలాగుచేయుట సులభమైనపని కాదు. చిత్తము అందరికి ఒకవిధముగా నుండదు. ఒకని చిత్తము పూర్తిగా కలవరపడి ఉండును. రెండవవాని చిత్తము నిలకడలేకుండా ఉండును. మొదటివాని చిత్తము క్షిప్త అనబడును; రెండవవాని చిత్తము విక్షిప్త అనబడును; మూడవవాని చిత్తము నేను, నాది, అనే అహముతో గూడుకొని ఉండును. దీనికే 'మూఢ' అనిపేరు. నాల్గవవాడు ఏకాగ్రచిత్తుడై యుండును. అయిదవవాడు విరుద్ధ స్వభావము కలిగియుండును. అనగా లోపలిబుద్ధిశక్తిచేత తనంతటతానే తెలుసుకొనేశక్తి కలిగియుండును. (Intutive tempers).

వస్తువులు కావు. అవి ప్రకృతికి చెందిన వస్తువులు. గ్రుడ్డి ప్రకృతిని అవి యన్నియు ఒక మెట్టునుంచి మఱొక మెట్టునకు తీసికొనిపోవుచున్నవి. తుదకు పురుషునితో ఐక్యమై పురుషునకు భ్రాంతికలిగేలాగు చేయుచున్నవి.

పురుషుని మీద బుద్ధి పనిచేయుచున్నది. బుద్ధిమీద పురుషుడు పనిచేయుచున్నాడు. తుదకు విషయములతో గూడుకొన్న బుద్ధితో ఐక్యమైపోవుచున్నాడు.

బుద్ధిలో పురుషుని ప్రతిబింబము ఈవిధముగా పని చేయుచున్నది. అలలతో కదలుచుండే నీటియొడ్డున నిలుచున్న పురుషుని శరీరము, ఏవిధముగా కదల నప్పటికిని అలలమీద నాట్యమాడుచున్నట్లు కనబడు చున్నదో, ఆవిధముగా ఏమియు పనిచేయక యున్న పురుషుడు (ప్రకృతితో ప్రత్యేక సంబంధములేనిపురుషుడు) తాను కర్త (Agent) అయినట్టున్ను, ప్రపంచములో జరిగే విషయము లన్నిటిని, తాను చూచుచున్నాననియు అనుభవించు చున్నాననియు, తలచు చున్నాడు. ఈ విధముగా తలచుటకు ఎప్పుడు ప్రారంభించుచున్నాడనగా- "పైకికనబడే రెండు రూపములు ప్రకృతివలనసృష్టించ బడినవి," అనుసంగతి పురుషుడు మఱచిపోయినప్పుడు వెంటనే తానుకర్త (Agent) అనిన్ని, తానేచూచు

చున్నాననిన్ని, తానే అనుభవించుచున్నాననిన్నీ తలచుచున్నాడు. ప్రకృతియే, క్రమేణ ఆత్మను బంధములోనుంచి విడిపించుచున్నదనే సిద్ధాంతమును యోగసిద్ధాంతమును ఏకీభవింపవు. ఎందుచేతనంటే ప్రయత్నములేకుండా ఆత్మ ప్రకృతిబంధములోనుంచి విడిపించుకొనజాలదు. పురుషునిలో నుండే ప్రయత్నము, 'ఆగిపోవుటకుకూడా' కొంత ప్రయత్నము కావలసియున్నది. పురుషుడు, ప్రయత్నములేకుండా తనలోనుండే ప్రయత్నమును పూర్తిగా ఆపుచేసి కైవల్యమును పొందజాలడు.

## ప్రయత్నము — యోగము

మనస్సునకుండే చంచలత్వమును ఆపుచేయుటకు ప్రయత్నమనేది లేనియెడల యోగసిద్ధాంతము అర్థము లేని సిద్ధాంతము అగుచున్నది.

యోగముయొక్క ఉద్దేశము బహుశః ఈవిధముగానే అయియుండవచ్చును.

"ప్రయత్నము చేయుచున్నామనే భ్రాంతము. దానికి ఫలము, పైకి కనుబడుచున్నదేగాని లోపల ప్రయత్నమేమియులేదు. యథార్థములో లోపలిఆత్మ ప్రయత్నముచేయుచు జీవాత్మను ప్రయత్నముచేసి, పనిసి అభి

వృద్ధిలోనికి వచ్చేలాగు చేయుచున్నది. అని మనము ఊహించవచ్చును. కాంట్ (Kant) పండితుని సిద్ధాంతములోని (Logicol ego) ఆత్మజ్ఞానమునకును, Psychological-ego కును మధ్య చూపించబడిన భేదమువంటి భేదము ఇక్కడగూడ ఉన్నది. ఆత్మజ్ఞానము (Logicol ego) ఉండుటను గురించియు, అది పని చేయుటను గురించియు అనుభవజ్ఞానమునకు, రెండింటి లోను లేదు. అనగా యోగ సిద్ధాంతములో గాని, కాంట్ సిద్ధాంతములో గాని లేదు. కాంట్ సిద్ధాంతములో (Cons ciousness) అనేది ( Logical ego ) ఆత్మ జ్ఞానమును The thing-in-itself ను రెండును కలిసి కొనినపుడు కలిగేజ్ఞానము అని చెప్పబడును. అదేవిధముగా యోగసిద్ధాంతములోగూడ, పురుషుడు ప్రకృతి కలసికొనునపుడు, పైకి మాత్రము ఒకేవిధమైనజ్ఞానము (Phenominal Knowledge) అనగా లేనిదానిని ఉన్నట్టు తెలిసికొనేశక్తి పుట్టుచున్నది. 'నేనే కర్త' అనే 'అబద్ధపుభావము' ఆత్మకు కలుగుచున్నది. 'లోపల లేక పోయినను, పైకి, ఉన్నట్లుకనుబడు అహంభావత్వము (Phenominal ego) నిజమైనదికాదు.' అనేజ్ఞానము వచ్చినయెడల అసలులోపలనుండే వస్తుపురూపము లేనిదిగా,

అనగా, ఇటువంటిదని చెప్పుటకు సాధ్యముకాని గుణ రహితమైన వస్తువుగా ఏర్పడుచున్నది.

సాంఖ్యయోగములోగూడ అదేవిధముగా ఏర్పడును.

అదేవిధముగా విషయమును తెలిసికొనేశక్తి నశించిన యెడల 'నేను, నాది.' అనేభావము నశించుచున్నది. అప్పుడు ఆత్మజ్ఞానము (Transcendental or logical condition) పుట్టుచున్నది. ఇది, సాంఖ్యయోగ సిద్ధాంతము లోను, కాంట్ సిద్ధాంతము నందుగూడా ఒప్పుకొన బడి ఉన్నది.

కాని, ఈ రెండు సిద్ధాంతములకు ఒకభేదము మాత్ర మున్నది. అది ఏదనగా, కాంట్ సిద్ధాంతములో ఆత్మ జ్ఞానము (Logical ego) తనంతటతానే తెలిసికొను చున్నదని ఒప్పుకొనదు.

సాంఖ్యయోగసిద్ధాంతము, ఆత్మజ్ఞానము స్వయం ప్రకాశమానమనీ, సర్వమును తెలిసికొనగల శక్తికలిగి యున్నదనిన్ని, చెప్పుచున్నది.

ఆత్మ, దేహబంధములోనుంచి, విడువబడినతోడనే అనుభవ జ్ఞానముకంటె వేరైనప్రకాశములో కూడు కొన్నదై, జ్ఞానము, ఉపాధిగానుండుట మానివేసి, అసలు ఆత్మజ్ఞానము అగుచున్నది.

## యోగ సూత్ర సిద్ధాంతము

శాస్త్రజ్ఞానముగల పండితులు చైతన్యస్వరూప మైన బ్రహ్మను ఎఱుగుదురు. వారు పాశ్చాత్య సిద్ధాంతము ప్రకారము అనుభవరూపముగా (ఆఖరు) చివర సత్యమునుగుఱించి కూడ యెఱుగుదురు.

## సాంఖ్య యోగ సిద్ధాంతము

౧ ఆత్మకు రూపము ఉన్నది అనే సిద్ధాంతమును నిరాకరించినది.

౨. వేదాంతులవల్లను, బౌద్ధులవల్లను చెప్పబడే మాయావాదమును అనగా మాయలో కప్పబడినది అనే సిద్ధాంతమును నిరాకరించుచున్నది.

౩. న్యాయ, వైశేషికులవల్ల చెప్పబడే ఆత్మనుగుఱించిన సిద్ధాంతమును అనగా, 'ఆత్మకు చైతన్యము లేదు, రాతితో సమానముగానుంటున్నది.' అనే సిద్ధాంతమును నిరాకరించుచున్నది. అదేవిధముగా-

౪. జైనుల సిద్ధాంతమును అనగా, 'దేహములో నుండేది మాత్రమే ఆత్మ' అని చేసే సిద్ధాంతమును నిరాకరించుచున్నది.

వీటినన్నిటిని నిరాకరించి, శంకర సిద్ధాంతములో

అనగా ఆత్మ సర్వత్రవ్యాపించి యున్నదనీ, ఆద్యంతములు లేదనీ, నాశరహితమైనదనీ చెప్పబడే సిద్ధాంతముతో ఏకీభవించుచున్నది.

జ్ఞానము కర్మ ఒకటేయను ఈ దేశములోని పండితులు ఎవరుగూడ ఒప్పుకొనరు.

యోగములో పైకి లేక గట్టిగా ఆలోచించడము ఒక విధమైన కర్మఅని ఒప్పుకొనుచున్నారు. అది ఏవిధమైన కర్మ (Activity) కాదని వాదించరు. యథార్థములో ధ్యానమును గురించి యీక్రిందివిధముగా చెప్పబడి యున్నది. "ధ్యానమనేది ఆత్మనుగురించి చెప్పడము మాని వేసి, ఆత్మకుఉండే ఉపాధులనన్నిటిని విసర్జించి, కేవలము పరమాత్మను గురించి, ధ్యానించుటయే."

దీనినిబట్టి విషయములతో సంగము, విషయములందు కోరిక పోయినప్పుడు జగత్తు, జగత్తులో వస్తువులు ఆత్మ లోనేయున్నవని తెలిసికొనబడుచున్నది.

గిఱ్ఱున తిరుగుచుండే చక్రముయొక్క మధ్యభాగము కదలకుండా ఏలాగుఉంటున్నదో అనగా, చుట్టుతిరుగు టలో, ఎన్ని మార్పులు కలుగుచున్నప్పటికిని, చక్రము యొక్క ఇరుసుభాగము కదలకుండా ఏలాగున ఉంటు

న్నదో ఆలాగుననే ఆత్మచుట్టు ఎన్నిమార్పులు కలుగు చున్నప్పటికిని, ఆత్మమాత్రము కదలకుండ అదే విధముగా నుండును. కాబట్టి యోగి అయినవాడు మనసు యొక్క చంచలత్వమును నశింపుచేయుటకు ఏకాగ్రత్వమును అభ్యసించుట, విధియైయున్నది.

## చిత్తవృత్తి రెండు విధములు

౧. క్లిష్ట - అనగా కష్టములోను, ఆటంకముల తోను కూడుకొన్నది.

౨. అక్లిష్ట-ఆటంకములుగాని కష్టములుగాని లేనిది.

మొదటి తరగతికి చెందిన చిత్తవృత్తులు అన్ని అవిద్య లేక అజ్ఞానముతో కూడుకొన్నవై ఉన్నవి.

రెండవది ప్రజ్ఞ, లేక జ్ఞానముతో కూడుకొన్నది.

మొదటి తరగతికి చెందిన అజ్ఞానులు దేహమే ఆత్మ అనేవారును, అపరిశుభ్రమైనదానిని, రాగమును, శుభ్రమైనదానిసిగా నమ్మేవారును, కష్టమై దుఃఖముతో గూడుకొన్న దానిని సుఖముగా తలచేవారును, ద్వేషము, బాధతో కూడుకొన్నది అయినను, దానిలో సంతోషమును చూచువారును, నాశముతో కూడుకొన్నదానిని శాశ్వ

తము అయినదిగాను, శాశ్వతమైనదానిని నశించేదిగాను తలచువారును అగుచున్నారు. ఇన్నివిధములైన అజ్ఞానముయొక్క ఫలితమేమనగా—

౧. దేహము అనుభవించు సుఖములు ఆత్మ అనుభవించుచున్నది. అని తలంచుట.

౨. స్నేహితులయొక్కయు, బంధువులయొక్కయు అశుభ్రమైన దేహములు శుభ్రమైనవిగా తలంచుట

౩. లాభములతో కూడుకొన్న శరీరకష్టములు నష్టకరమైనవిగా తలంచుట.

౪. మనస్సు నిరంతరముగా కలుగు మార్పులును, ఎల్లప్పుడు మారుచు, నశించుచుండు ప్రపంచమును, శాశ్వతములు అని తలంచుట.

ఈతలంపులు అన్నియు అజ్ఞానమువల్లనే కలుగుచున్నవి.

యోగి పైన చెప్పిన అజ్ఞానముతో కూడుకొన్నతలంపులు అన్నియు అబద్ధమనీ, పుణ్యాపాపములు రెండుగూడ నశింపవలసినవేఅనీ, నమ్మకము పుట్టేవరకూ, అభ్యాసము చేయవలయును. కారణమేమంటే, ఇవన్నియు పైకి కనుబడే 'నేను—నాది' అనే అహంకారమునకు చెందియున్నవి కాని, ఆత్మకు చెందినవికావు. మనోవికారములయొక్క

పై చిన్నెలను చంపినమాత్రమున ప్రయోజనము లేదు. యోగియైనవాడు వాటిని వ్రేళ్ళతోగూడ పెకలంట నణికి తగులబెట్టవలెను. ఎందుచేతనంటే, ఈ మనోవికారములు, కొన్ని సమయములలో లోపలికి అణగిపోయి కర్మవాసనారూపముతో ఉండును. మఱికొన్ని సమయములలో పాతపాపములన్నియు జతగూడి కర్మాశయములనబడును. కొన్ని సమయములలో వాటి ఉదారస్వభావము నణుదోడు అవి అటకాయింపబడి విచ్ఛిన్నమై పోవచ్చును.

కొన్ని సమయములలో తక్షణము తగ్గిపోయి మెల్ల మెల్లగా నడచును.

కొన్నిరకముల ధ్యానముచేత, చదువులచేత, తపస్సుచేత అవి మెల్లమెల్లగా నడచుట తటస్థించును. పిమ్మట కర్మవాసనల క్రిందను, పాతఫలములన్నియు ఒకచోట జమ అయి కర్మాశయములుగా ఏర్పడును.

అటువంటి వాటియందు, ఏవిధమైన ఆశ లేకుండా పూర్ణముగా నశింపుజేయుట యోగికి విధియైయున్నది.

సామాన్యమనుష్యుడు కోరికలతో కూడుకొన్నవాడై జననమరణములను కోరుచుండగా యోగియైనవాడు పునర్జన్మను ఆశించకుండడమేగాక విదేహలీనలు, అనియు ప్రకృతిలీనలు అనియు పిలువబడే దేవతారూపములను

గూడ ఆశించగూడదు. దేవతా రూపములు గూడ పుట్టుచున్నవి, నశించుచున్నవి.

ఉపనిషత్తులలో ౧. బ్రాహ్మణమతము ౨. బౌద్ధ మతము, 3. జైనమతము. ఈ మూడు మతములు గూడ ఒకే అభిప్రాయముతో నున్నవి. అనగా దేవతారూప మును పొందుట మనుష్యునికి మోక్షము గాదు.

## ఆత్మ

౧. బౌద్ధమత సిద్ధాంతము ప్రకారము, దేహము నశించినపుడు ఏమియు మిగులదు.

౨ బ్రాహ్మణమత సిద్ధాంతము ప్రకారము దేహము నశించునపుడు, ఆత్మ వెనుక మిగిలిపోవును. రెండింటికి ఉండే భేదములలో ఇది ఒకటి. వైరాగ్యము, అనగా విషయ ములందు విరక్తి. దీనివిషయమై ఎడతెగని అభ్యాసము చేయవలెను. మధ్య ఆగగూడదు. దేహము ఆత్మ కంటె వేరైనదని తెలుసుకునే జ్ఞానమునుపొందుటకు కూడ అడ్డులేని అభ్యాసము అవసరమైఉన్నది.

దానియందు పూర్తిఅయిన నమ్మకముతో చాల కాలము అభ్యాసము చేయువలయును. కనబడే వస్తువుల యందును, కనబడని వస్తువులందును ఏవిధమైన కోరికలు

లేకుండా అనగా, స్త్రీల విషయములోను, అన్నము, సిల్కు అధికారమును పొందు విషయములు మొదలైన వాటి యందు పూర్ణమైన విరక్తి కలిగి అభ్యాసము చేయ వలయును.

అభ్యాసమునుగురించి విలియం జేమ్స్‌పండితుడు, తాను రచించిన (Principles of Phylosophy) 'ప్రిన్సిపిల్స్ ఆఫ్ ఫిలాసఫీ' అనే గ్రంథములో పైన చెప్పిన విధముగా వ్రాసియున్నాడు. యోగములో కూడ అదే విధించబడి ఉన్నది. యోగ సిద్ధాంతము ప్రకారము, కామము పూర్తిగ నశించితేనేగాని పైకికనబడే ప్రపంచమంతా, ముహూర్తకాలములో కనబడకుండా పోవునది, అని బోధపడదు.

ఇంద్రియములు విషయములవైపు దికి పోగూడదు. వాటిస్వభావగుణము నశించవలెను. దీనివిషయమై ప్రయత్నము చేయుటయే 'యతమాన' మనబడును. దీనితరువాత కొన్ని విషయములలో కోరిక నశించినదిగాని కొన్ని విషయములలో కోరిక ఉన్నదనే జ్ఞానమునుపొందుట. ఇది 'వ్యతిరేక' మనబడును.

తరువాత మూడవమెట్టులో జ్ఞానేంద్రియములు విష

[illegible]ములమీద పనిచేయుట పూర్తిగానశించును. కాని మనస్సులో మాత్రము కొంచెము అభిలాష మిగిలిఉండును. ఆ కారణముచేత ఇది 'ఏకేంద్రియ' మనబడును.

మనస్సునుగురించిన శాస్త్రమునందు పండితులైన వారు ఈవిషయమును సులభముగా తెలిసికొనగలరు. అనగా అసలుకారణము పూర్తిగా నశించినప్పటికిని దానియొక్క ఫలితముగా మనస్సులో ఆతుర్దా మిగిలి ఉంటున్నది.

ఈఆతుర్దా (Anxiety) కూడ పూర్తిగానశించి నప్పుడే కనబడేవస్తువులయందును కనబడని వస్తువుల యందును కోరిక పూర్తిగానశించి అతీతుడగును.

పూర్ణమైన నిగ్రహమును చేసినవాడగును. దీనిపేరే అపరవైరాగ్యము.

దీనితరువాత పరావైరాగ్యము కలుగును. దీనితో ఆత్మజ్ఞానముపొంది స్వభావమును గుణములను దాటిన వాడు అగును.

తిరుగ భ్రాంతిలో పడకుండా, యోగభ్రష్టుడు కాకుండా ఉండినయెడల 'అవిప్లవ' అనబడును. దానితో మోక్షము కలుగును.

## యోగశాస్త్రము - వైరాగ్యము

యోగశాస్త్రములో యోగులు నాలుగు తరగతులుగా భాగింప బడినారు.

౧. ప్రాథమకాల్పిక: అనగా, క్రొత్తగా వైరాగ్యమును అభ్యాసముచేయుచు పొందేజ్ఞానమువల్ల ఇతరుల మనస్సును తెలిసికొనుటకు శక్తినిపొందినవాడు.

౨. మాధుభూమిక: అనగా జ్ఞానేంద్రియములను నిగ్రహించి పైకికనుపడుచుండే ప్రపంచమును జయించుటకు నిశ్చయించుకొన్న పురుషుడు. వీడు యోగశాస్త్రము ౧–౪౮లో ఈ క్రిందవిధముగా వర్ణింపబడి యున్నాడు.

ఎవ్వడైతే శ్రుతపాండిత్యముచేత వేదార్థము ఊహించి ధ్యానమూలముగా నిజమునుగ్రహించి (రితాంబర) ప్రజ్ఞను బొందినవాడో వాడు.

3. ప్రజ్ఞాజ్యోతి: అనగా పంచభూతములను ఇంద్రియములను నిగ్రహించి యోగశాస్త్రము ౨–౪౭ లో చెప్పినప్రకారము సాధనములను సంపాదించి వాటిమూలముగా కామక్రోధములను చంపి శాంతమనస్కుడై అతిక్రాంత భావములు కలవాడు.

మఱియు, మనస్సును పూర్తిగానిగ్రహించి కోరిక

అనుదానికి లేకుండాచేసి పునర్జన్మలేకుండా మోక్షమును పొందుటకు నిశ్చయించుకొన్నవాడు.

దేవతలయొక్క పిలుపు మొదటితరగతికిగాని, మూడవ తరగతికిగాని, నాల్గవతరగతికిగాని అన్వయించదు. ఎందుచేతనంటే, వారు స్వర్గభోగములను కోరువారుకారు. కాబట్టి దేవతలపిలుపు ౨ వ తరగతికి మాత్రమే అన్వయించును.

మూడవ తరగతివారు విశోకస్థితి దగ్గఱనుండి ప్రారంభించుచున్నారు. యోగశాస్త్రము ౧-౩౬.

౪. నాల్గవ తరగతియోగి ఏడుమెట్లలో కూడుకున్న దివ్యదృష్టి (Insight) గలవాడని యో॥ శా॥ ౨-౨౭ లో చెప్పబడినది. నాలుగు మెట్లు అయిపోయిన తర్వాత మిగిలిన మూడుమెట్లు చిత్తవిముక్తికి చెందియున్నవి. కాబట్టి అది 'అతిక్రాంత భావాన్య' అని చెప్పబడియున్నది. ఎందుకంటే విముక్తికి కారణము తెలిసిపోయినది. దానికిపైన తెలిసికొనదగినది మఱియొకటి లేదు గనుక. ఈనాలుగు తరగతులకు చెందినయోగులను ఈక్రిందచెప్పబోయే నలుగురు యోగులతో పోల్చి చూచెదము.

౧. యతమాన ౨. వ్యతిరేక 3. ఏకేంద్రియ ౪. వశీకర. మొదటిమూడింటికి పోలిక సరిపోవుట లేదు.

నాల్గవదిఅయిన వశీకరవైరాగ్యములో ప్రపంచ సుఖముల యందును స్వర్గలోక సుఖముల యందును ఆశ చివరి మెట్టుదాటిన తరువాత లేనట్లే లేకుండా ఉన్నది. (యో-శా-౧-౧౫)

వశీకరము అనేది అపరవైరాగ్యమునకు సంబంధించి నది. అదిఅన్నిటికంటె పైమెట్టు.

అపరవైరాగ్యము : అసంగముయొక్క క్రింది మెట్టు.

పరా వైరాగ్యమనగా సంగమును పూర్తిగా విసర్జించుట.

ఈస్థితిలో ఆత్మజ్ఞానముచేత స్వభావసిద్ధమైన గుణముల యొక్క పనులయెడల కూడ సర్వత్యాగము సిద్ధియై ప్రేమ, అనురాగము, క్రోధములు పూర్తిగానశింపు చేయ బడుచున్నవి.

ఈవిధముగా ఆత్మానాత్మభేదమును తెలిసికొను జ్ఞాన మువచ్చి మరల మనస్సు తిరిగిపోయి యోగభ్రష్టుడు కాకుండా ఉండినయెడల కైవల్యము లభించును.

ఒకవైపున మనస్సుయొక్క ఉద్రేకము నిగ్రహించ బడుచుండగా రెండవవైపు మనస్సుయొక్కదృష్టి విషయ

ముల మీదనుంచి క్రమేణ తిరిగిపోవుచున్నది.

విషయమునుగుర్తుపట్టుట విషయమును తెలిసికొనుటకు మూడుసంగతులు ఉండవలెను. ౧ తెలుసుకొనేవాడు (గ్రహీత) ౨ తెలుసుకొనేవిధానము (గ్రహణ) ౩ తెలుసుకొనబడేవస్తువు (గ్రాహ్య) ఒకవస్తువును చూచినవెంటనే మనసు దానిమీదకి పోవుచున్నది. పిమ్మటఆశపుట్టును. కాబట్టి మనస్సునుసరిఅయిన విషయముమీదికి పోయేలాగు చూడవలెను. మనస్సు ఏది తలచుకొంటే ఆవస్తువే అగుచున్నది.

ఎవడు బ్రహ్మను తెలుసుకొనుచున్నాడో వాడు బ్రహ్మమే అగుచున్నాడని వేదాంతులు చెప్పుచున్నారు.

యోగము ఈ విషయములో కొంతమట్టుకు మాత్రమే ఒప్పుకొనుచున్నది.

వస్తువును చూచుటలో, మనస్సును మంచివస్తువుతో నింపినయెడల, మనసు స్వరూపశూన్యమై, మంచివస్తువు మీద నిలుచుచున్నది. (అర్థమాత్ర నిర్భాస)

మనస్సును, బౌద్ధులలో బుద్ధునిమీదను, జైనులలో జినునిమీదను, హిందువులలో ఈశ్వరునిమీదను, నిలిపిన

యెడల శీఘ్రముగా విముక్తినిచెందగలదనుచున్నారు. అదేవిధముగా ఉపనిషత్తులు, కలలులేని నిద్రను, గూర్చి చెప్పుచున్నవి. ఆత్మసంయోగముతో పోల్చినయెడల, యోగము అంతదూరము పోదుగాని క్రొత్త యోగికి నిద్రమీద కలలమీద మనస్సును నిలుపమని బోధించుచున్నది. కారణమేమంటే మనోవికారములు శీఘ్రముగా నశించుచున్నవి. అదేవిధముగా, మనస్సును ఏవిషయములమీద నైనను నిలుపుటకు సాధ్యమగును. కాని, ఆత్మమీద మనసు నిలుపసాధ్యముకాదు. కారణమేమంటే ఆత్మ, తెలిసికొనేవస్తువుగాని, తెలిసికొనబడే వస్తువు కాదు.

దేవుడు, దేవతలు, తెలిసికొనబడే వస్తువులు కావచ్చునుగాని, ఆత్మమాత్రము కాదు. కారణము, ఆత్మ తెలిసికొనబడిన వెంటనే ద్వంద్వము నశించి ఒకటే కేవలి అగుచున్నది గనుక.

## భేదము

వేదాంతములో జీవాత్మ పరమాత్మను కలసికొనిన వెంటనే మోక్షము కలుగును.

యోగములో జీవాత్మ పరమాత్మను తెలిసికొనకూడదు.

కారణము, పరమాత్మ తెలుసుకొనే వస్తువేగాని తెలిసికొనబడే వస్తువు కాదు.

జీవాత్మ, తనమనస్సును ఏవస్తువుమీదనైన నిలుపవచ్చునుగాని పరమాత్మమీద నిలుపకూడదు. వేదాంతము జీవాత్మ పరమాత్మల సంయోగమును గుఱించి బోధించుచున్నది; గనుక యోగము దానినిగుఱించి ప్రయత్నము చేయదు. ఇది మఱియొకచోట వ్రాసియున్నాము.

## యోగములో ముక్తిమార్గము

ఆత్మ తనను జయించుటకు ప్రకృతి, (స్వభావము) (Nature) మూలముగానే ప్రయత్నముచేయుచున్నది. ప్రకృతియొక్క విషయముల మూలముగానే, ఆత్మ, తనను జయించుటకు ప్రయత్నము చేయుచున్నది.

ఈజయము చిత్తముయొక్క జ్ఞానముమీద ఆధారపడియున్నది.

చిత్తములో పలువిధములైన జ్ఞానములున్నవి. ఇవి

వివిధ విషయములను ఆకర్షించడము మీద ఆధారపడి ఉన్నవి.

కాబట్టి, మనసు ఎల్లప్పుడు ప్రకృతిలోనుంచి పుట్టి మహాభూతములకు సంబంధించిన విషయములమీదనే పడుచున్నది.

## అనేక జ్ఞానములు

బౌద్ధమతములో చెప్పబడిన జ్ఞానములే, అనగా ౧. మనోజ్ఞానము, ౨. చిత్తజ్ఞానము, ౩. వేదనజ్ఞానము. ౪. విజ్ఞానజ్ఞానము. ౫. సన్నజ్ఞానము మొదలైనవి. యోగములలో కూడ ఆమోదింపబడి యున్నది.

యోగములో వీటికి సంబంధించిన జ్ఞానము 'సవితర్క సమాధి' అని చెప్పబడుచున్నది. దీనిలో, మనస్సులో నున్న భావములు, విషయములను గురించి మనస్సు మీద కలిగిన అభిప్రాయములు.

ఒకవస్తురూపము అనగా ఒక ఆవు, లేక ఒకజాడీగా ఏర్పడి నిలకడగా నుండును. ఈ మెట్టులో నున్నపుడు చూడడమువల్ల కలిగే విషయజ్ఞానము శబ్దముగాని, పేరు గాని, అర్థముగాని మనస్సునకు అంది, ఆవస్తువు ఇట్టిది.

అని మనస్సుమీద నాటుకొనిపోవుచున్నది. ఈవిధముగా ఇది మనస్సునకు విషయమునకు రెండింటికి చెందిన సమాచారము అగుచున్నది.

ఈవిధముగా తెలిసికొనుటలో, తెలిసికొనునది తెలిసికొనబడునది అనే ద్వంద్వము స్పష్టముగా నిలిచిఉన్నది.

శ్రోత్రేంద్రియములతో కనిపెట్టబడే విషయములలో, శబ్దము, అర్థము, మొదలైనవి అవసరములేకుండా విషయమును నేరుగా తెలిసికొనుటకు తగినజ్ఞానము కలిగినప్పుడు అది నిర్వితర్కసమాధి అనబడును.

మాటలవల్ల తరుచుగా వస్తువుయొక్క యధార్థమును కనిపెట్టుట సాధ్యముకాదు. ఒక్కొకసారి మాటలవల్ల భ్రాంతి కలుగవచ్చును.

'లేదు, కాదు' అనేమాటలవల్ల, మనోవికల్పము కలుగవచ్చును; కాబట్టి, మాటలమూలముగాను, శబ్దమువల్లగాను, అర్థముమూలముగాను, పేరుమూలముగాను, వస్తువులు తెలిసికొనుటకంటె, సాక్షాత్తుగా తెలిసికొనుట, అవసరమైఉన్నది. అనగా పుట్టినబిడ్డలు, లేక, చెవుడు, మూగబిడ్డలు వస్తువులను ఏలాగు చూచి గ్రహించుచున్నారో ఆలాగే తెలిసికొనుట అవసరమైయున్నది. ఈ స్థితిని (మెట్టును) పొందినపుడు సవితర్కసమాధి దాటి

పోయి నిర్వితర్కసమాధి పెట్టు వచ్చును. అప్పుడు విషయ ములను గురించిన జ్ఞానము అతిక్రమించును.

## యోగి — తన్మాత్రలు

యోగియైనవాడు విషయజ్ఞానమును దాటి తన్మాత్రలు, అనగా పంచభూతములయొక్క సూక్ష్మరూపముల నిజమును, సారమును తెలిసికొనుట అవసరమై ఉన్నది.

పైనచెప్పిన అసలువిషయములలోవలెనే తన్మాత్రల విషయములో గూడ మాటలు, శబ్దము, అర్థము, మొదలైన సాధనములను వదలివేసి, నేరుగా సూక్ష్మరూపములను తెలుసుకొనేజ్ఞానము పొందుట అవసరమై ఉన్నది.

## సవిచార — నిర్విచార సమాధులు

అసలువిషయములను తెలిసికొనుటకు సవితర్కసమాధి — అనగా శబ్దము మొదలైన సాధనములతో కూడుకొన్న స్థితి — సవిచారసమాధి అని చెప్పబడినది. తన్మాత్రల విషయములో, అదేవిధముగా ఆస్థితి సవిచార స్థితి అని చెప్పబడుచున్నది.

దీనిని దాటిపోయి, నేరుగా తెలిసికొనేస్థితి నిర్విచార

స్థితి అని చెప్పబడుచున్నది.

నిర్విచారసమాధి మామూలు తన్మాత్రల అనుభవము నకు సంబంధించియున్నది. సవిచారసమాధి అన్నచో తన్మాత్రల ఉనికిని శబ్దాది సాధనముల తెలిసికొనుటకు సంబంధించినది.

కాని, యోగులుమాత్రము వారుచేయు ధ్యానము మూలమున బొందిన గొప్ప శక్తివలన సూక్ష్మరూపము లలో నుండు అణువులనుకూడ చిన్నగా తెలిసికొనగలరు.

కొన్ని అణువులు కలిసినగాని మనుష్యునికంటికి కన బడవు. కాని యోగివిషయము అట్లుకాదు. మానుజునికంటికి సాధారణగా కనబడని సూక్ష్మరూపములోనున్న అణు వును యోగి సులభముగా తెలిసికొనుశక్తి కలిగియున్నాడు. అణువులను చూచినట్లే ఆకాశమును (ఖాళీస్థలమును) కాలమును, గాలిని, మనస్సునుగూడ యోగులు తెలిసి కొనగలరు.

## కాంట్ సిద్ధాంతము

కాంట్ (Intuition) స్వభావ సిద్ధముగా వెంటనే కనుగొనగలశక్తిని, చూచినవిషయములనే తెలిసికొనే జ్ఞానమునకును మధ్యనుండే భేదమును గురించి చెప్పి

యున్నాడు. అనగా మొదటిదానిలో (Intuition) స్వయంగా తెలుసుకొనుచున్నాడు. రెండవదానిలో ఊహామూలమున తెలుసుకొనుచున్నాడు.

అదే భేదము ఈ యోగములోగూడ చూపించి యున్నారు.

అసలు, విషయములు, సూక్ష్మశరీరములు (తన్మాత్రలు) రెండుగూడ యోగి సూటిగా తెలిసికొనుచున్నాడు. నిర్విచారసమాధిలో, యోగి సూక్ష్మశరీరములనుగూడ, సూటిగా తెలిసికొనేజ్ఞానమును యోగశక్తివల్ల పొందు చున్నాడు.

## సానంద సమాధి

నిర్విచార సమాధికంటె శ్రేష్ఠమైనది సానందసమాధి. యోగి, నిర్విచారసమాధి అను మెట్టుకంటె ఉత్తమమైన సానందసమాధి అను మెట్టును పొందుటకు ప్రయత్నము చేయవలెను.

విషయములు, వాటితన్మాత్రలు, అన్నిటికంటె ఎక్కువ అయినవి కావనీ, వాటికి పై మెట్లు ఉన్నవనీ తెలిసికొనిన తోడనే, యోగి అయినవాడు, అంతకుపూర్వము తెలిసికొనిన సూక్ష్మరూపములకంటె, ఎక్కువ సూక్ష్మమైన

రూపములు, ప్రకృతికి ఉన్నయెడల, వానివానిని తెలిసి కొని వానిద్వారా ఆత్మను తెలిసికొనుటకు ప్రయత్నము చేయవలెను.

## సూక్ష్మ శరీరములు

సూక్ష్మశరీరములలో జ్ఞానేంద్రియములుతప్ప రజస్సు తమోగుణములు ఎక్కువగానున్న సమస్తమును చేరియున్నట్లు సాధారణముగా తలచనగును. దీనినిబట్టి జ్ఞానేంద్రియములు వేఱుగానున్నట్లు తేలుచున్నది.

## జ్ఞానేంద్రియములు

౧. జ్ఞానేంద్రియములు — అహంకారములోనుంచి సత్వగుణబుద్ధియొక్క సహాయముచేత పుట్టుచున్నవి. అని (సాంఖ్యకారిక శ్లోక ౨౨ - ౨౮) ఒకసిద్ధాంత మేర్పడి ఉన్నది.

౨. మరిఒకసిద్ధాంతముప్రకారము బుద్ధిలోనుంచియే సూటిగా తన్మాత్రలు, మహాభూతములు, అహంకారము (తెలుసుకొనేభాగము) జ్ఞానేంద్రియములును పుట్టి స్వాతంత్రముగా నడుచుచున్నవి. ఇది రెండవది. విజ్ఞానభిక్షువు సిద్ధాంతము.

ఈవిషయము రాధాకృష్ణ ఇండియన్‌ఫిలాసఫీ ౨౬౯ పేజీ అడుగునోటు లో ఉన్నది.

సానందసమాధిలో బుద్ధితప్ప పైన చెప్పగా మిగిలిన వాటి నన్నింటిని యోగి, లోపలచూచుటకు సాధ్యమగును. మఱియు—

సవితర్క సమాధిలోను, సవిచారసమాధిలోను తెలిసే విషయముతో ఐక్యముకలిగినట్లు సానందసమాధిలో గ్రహణతో అనగా జ్ఞానసాధనముతో ఐక్యము కలుగు చున్నది.

సానందసమాధిలోని ఐక్యము సాస్మితాసమాధిలోనికి తీసికొని పోవుచున్నది. మఱియు సానందసమాధిలో విషయముల తెలుసుకొనే జ్ఞానమునకంటె వేరైన జ్ఞానమును పొందుటకు సాధ్యమగుచున్నది. ఆత్మశక్తివల్లనే ఈశక్తి కలుగుచున్నది. అనగా మనస్సు, ప్రపంచవిషయములకు సంబంధములేకుండ, తనకుండే జ్ఞానసంబంధమైన శక్తులమీదనే, దృష్టిని నిలువుకొనుటకు సాధ్యమై ఉన్నదని స్పష్టపడుచున్నది. దీనివల్లకూడ 'ఆనందము' అనే మాట స్పష్టముగా అర్థము అగుటలేదు, కాని—వాచస్పతి మిశ్రుడు విభాగించిన మూడుసమాధులలో, రెండవది, మనస్సుయొక్క జ్ఞానశక్తినిగుఱించి చెప్పుచున్నదనియు,

గ్రహణ అనుభూతులకు జ్ఞానేంద్రియములు అని అర్థము చేయక మనస్సులోని 'తలంపు' అని అర్థము చేయవలెనని స్పష్టమగుచున్నది.

యోగి, పైన చెప్పినదానికంటె ఇంకా పై మెట్టుకు పోవలసిఉన్నది. అనగా, విషయములను, మనస్సుయొక్క తలంపులను, దాటినవాడై ఆత్మమీదనే మనస్సును నిలుపవలసియున్నది.

## ఆత్మజ్ఞానము

ఇంతకుపూర్వము, ఆత్మజ్ఞానము (Self-consciousness) అంటే పైకికనుపడుచుండు విషయములకు సంబంధించినట్టిదే అని చెప్పియున్నాము. ఎందుచేత ననగా, పురుషుని ప్రతిబింబము బుద్ధిలో చూడబడుచున్నది. దానివలన భ్రాంతితో గూడుకొన్న అబద్ధపు ఆత్మజ్ఞానము, ఆదిలోనే ప్రకృతిలో పుట్టుచున్నది. అనగా బుద్ధి లేక మహత్ (మోహము) అనేది పుట్టుచున్నది.

బుద్ధిలో రజోగుణము, తమోగుణము, అణగుబడిన పుడు సత్వగుణబలముచేత ప్రకృతియొక్క స్వభావము బుద్ధికి అద్దముమోస్తరుగా కనబడుచున్నది. ఆ కారణము

చేత ఆత్మను 'నేను - నాది' అనే భ్రాంతిలోనుంచి తప్పించుకొనుట కష్టమగుచున్నది.

## బుద్ధి - అహంకారము

బుద్ధి, అహంకారము లనే రెండుతత్వములు తెలుసుకొనేశక్తి, ప్రేమ, మొదలైన గుణములను పుట్టించుచున్నవి. వాటికి, ప్రపంచవిషయములను తెలిసికొనుటకు ఇంద్రియముల సహాయము అవసరమైనప్పటికిని అవి లేకుండానే భావములను, సుఖమును, ప్రత్యేకహక్కులు ఉన్నవనే గ్రాహ్యమును, వాటంతటఅవే కలుగజేయుటకు శక్తికలిగియున్నవి బుద్ధి, ప్రకృతికి తెలుసుకొనేశక్తి కలుగజేయుచున్నది. ఆశక్తి లేనియెడల ప్రకృతి, పైకికనుపడకుండా అవ్యక్తముగా నుండును.

సాధారణముగా సమస్తమును తెలుసుకొనేశక్తిని ప్రకృతికి బుద్ధి యిచ్చియుండగా, అహంకారమనేది, ఆ శక్తికి ప్రతిమనుష్యునిలోను ప్రత్యేకముగా, 'నేను - నాది' అనేభావమును కలుగజేయుచున్నది. దానిమూలకముగా ప్రత్యేకహక్కులను (Ownerships)కలుగజేయుచున్నది. సాస్మితానసమాధిలో ఆత్మ, ప్రతిమనుష్యునియొక్క

తెలుసుకొనేశక్తి మీదను చేసే పనులమీదను మనస్సు నిలిచేలాగు చేయుచున్నది. ఈ సమాధి మెట్టునుగూడ దాటేలాగు చేయుటకొఅకే అది ఆలాగు చేయుచున్నది.

పురుషుని గుఱుతుపట్టుటకూడ, పైకి కనబడే రూప మునుబట్టి కనిపెట్టుచున్నట్లును, ఆలాగు చేయుటకూడ ప్రకృతి పురుషులు కలియుటచేత ననియు, బుద్ధి అహం కారములనే సాధనములగుండా ప్రకృతి, పురుషుని విగ్రహమును పుట్టించుచు, దానితోటి ఐక్యభావమును కలిగించుచున్నది.

ఇది అన్నిటిలోను కష్టమైనమెట్టు. ఎందుచేతనంటే, అసలు ఆత్మతోటి ఐక్యతకు చాలా దగ్గఱగా వచ్చియున్న ది. ఇదే ఆత్మతోటి ఐక్యమా? అనేభ్రాంతిని కలుగజేయు చున్నది. భ్రాంతిచేత కొందఱు, ఇదే ఆఖరుమెట్టు అనిన్ని, ఇదే జీవాత్మ, పరమాత్మల సంయోగమనిన్ని తలచుచున్నారు. కాని అది సత్యముకాదు.

యోగసూత్రములలో, రెండుతగగతుల మనుష్యులను గుఱించి చెప్పబడి యున్నది.

౧ విదేహాలీనులు, ౨ ప్రకృతిలీనులు, అని, ఇద్దఱు కూడ భావప్రత్యయసంఘమునకు చెందియున్నారు.

## భావ ప్రత్యయులు

భావప్రత్యయులు అనగా మనవలె దేహేంద్రియాదులు లేకుండ పుట్టినవారు. మఱియు మోక్షమునకు అడ్డుగా నుండే అజ్ఞానమును త్రోసివేయుటకు తగినశక్తిని స్వభావ సిద్ధముగా కలిగియుండేవారు. యో. సూ. ౧. ౧౯

## యోగి

యోగి ఉపాయప్రత్యయుడు. అనగా సరియైన యుపాయములను, సాధనములను ఉపయోగించి, ఆత్మకు, ఆత్మకానిదానికిని ఉండేభేదమును కనిపెట్టగలవాడు. యో. శా. వ్యాసభాష్యము ౧-౨౦

ఈతడు పైనచెప్పిన రెండుతరగతుల మనుష్యులకంటె తక్కువవాడు కాడు. ఎందుచేతనంటే, పై రెండుతరగతుల వల్ల అవలంబించబడిన సానంద, సాస్మితాసమాధులు రెండింటిని అతిక్రమించి పైమెట్టుకుపోయి ముక్తిని సంపాదించుటకు శక్తికలిగి యుంటున్నాడు.

## సన్యాసము, తపస్సు

సన్యసించినమాత్రమున, తపస్సు చేసినంతమాత్రమున ప్రయోజనములేదు. యోగియైనవాడు పూర్ణమైన లోపలి

దృష్టిని పొంది, ఆత్మకును, బయటనుండే ప్రపంచమునకును, ఉండేభేదమును తెలిసికొని, తనస్వాతంత్ర్యతను పొందుటకు శక్తిని కలిగియుండవలెను. మఱియు, దేవతలు, కొండలు ఇతరప్రతిష్ఠలు చిక్కుకొనకుండా, ఉపాయముతో పనిచేసికొనవలెను.

బుద్ధిగుండా సంపాదించే లోపలిజ్ఞానమువల్ల మాత్రము, లోపలనుండే ఆత్మను తెలిసికొనుట సాధ్యముకాదని, యోగి యెఱిగియుండవలెను. అనుభవములో, బుద్ధియొక్క నశతనుబట్టి, ఆత్మఉన్నదని ఊహించవచ్చునేగాని, వేఱుగా చూచుటకుగాని, తెలుసుకొనుటకుగాని సాధ్యముకాదు.

## నన్ను - నేను

నన్ను, లేక, చూడబడు విషయమునుగాని, తెలిసికొనవచ్చును, కాని.

నేను, లేక, తెలిసికొనేఆత్మను కనిపెట్టజాలము. బుద్ధిని,అహంకారమును తనలో అంతర్భాతము చేసికొంటే నేగాని తెలిసికొనేఆత్మ తెలిసికొనబడే ఆత్మ ఎన్నటికిని కాజాలదు.

వస్తువుల చివరలు కలిసికొనేగుణమును కలిగియుండు న్నవి.

లోపలిజ్ఞానమునకు సంబంధించినమట్టుకు (Behaviourists)బిహేవియరిస్టులను, పాతంజలీయులును ఒకేఅభిప్రాయమును కలిగియున్నారు. ఎందుకంటే, ఆత్మజ్ఞానమును పొందుటకు, లోపలిజ్ఞానము (Introspective Knowledge) యొక్క సహాయము అవసరములేదని, ఇద్దరును ఒప్పుకొనుచున్నారు. కాని బిహేవియరిస్టులు ఆత్మ అనలేలేదు అనివాదించేవారు. పాతంజలీయులు, ఆత్మఉన్నదని ఒప్పుకొనుచు 'దానిని తెలిసికొనుటకు మఱియొకవిధమైన జ్ఞానము సాధనముగా నుండవలెను.' అని చెప్పుచున్నారు.

సవితర్కసమాధి తరువాత మనము చర్చించుచున్న సంగతులు సామాన్యమనుష్యునకుబోధపడువిషయములు కావు. సామాన్యమనుష్యునకు, తన్మాత్రలు లేక సూక్ష్మరూపములను గుఱించిగాని, జ్ఞానేంద్రియములను గుఱించిగాని, రజస్తమోగుణములను అణగద్రొక్కి సత్వగుణమునువృద్ధిచేసియున్న బుద్ధిని గుఱించికాని, ఏమియు తెలియదు.

## సంప్రజ్ఞాత సమాధి

కాబట్టి పైన చెప్పిన నాలుగువిధ సమాధులు 'సంప్రజ్ఞాతసమాధి' అని పిలువబడినపుడు ఆపేరువల్ల మనము ఈక్రిందివిధముగా అర్థము చేసికొనవలెను.

జ్ఞానములో తెలుసుకొనువాడు, తెలుసుకొనబడువాడు, అనేద్వంద్వము ఉన్నదనీ, తెలుసుకొనబడు వస్తువు, స్థూలములోనుంచి సూక్ష్మములోనికి మారుచున్నప్పటికిని, మనస్సునకు సంబంధించిన సంగతులు తెలుసుకొనేవాడు, మనోనిగ్రహము చేయుటలో క్రొత్తవాడు ఐనప్పటికిని, పైన చెప్పిన ద్వంద్వము ఉన్నదనియే మనము అర్థము చేసికొనవలెను.

## యోగము — బౌద్ధధ్యానసిద్ధాంతము

యోగసిద్ధాంతమును, బౌద్ధధ్యానసిద్ధాంతముతో పోల్చిచూచెదము. పరీక్షించి చూచినపుడు మనస్సుకు శిక్షణనిచ్చు, అభ్యాసముచేయు విషయములో, రెండును, ఒకేపద్ధతిని అవలంబించినట్లు కనబడుచున్నవి. అంతేగాక 'సానంద' అనేమాట బౌద్ధసిద్ధాంతములో నుండియే యోగములోనికి తీసుకొన్నట్లు కనబడుచున్నది.

అనుపాదసుత్త'లో ఈక్రిందివిధముగా చెప్పబడియున్నది. 'భిక్షులు కోరికలను విసర్జించి, చెడుభావములను వదలి మొదటిధ్యానములో ప్రవేశించి, అందులోనే ఉంటున్నారు.'

ఏకాంతముగా ఉండుటచేత, మనస్సుకు నిలకడకలిగి ఒకవిధమైన సంతోషము మొదటి ధ్యానములో కలుగును.

కలియుట, మనస్సునకుతగులుట, చూచుట, కదలుట, గ్రహించేశక్తి కలుగుట, కోరిక, ఎన్నుకొనుట, ప్రయత్నము, మనస్సులో బాగామననించుట, నిర్లక్ష్యభావము, మనోనిగ్రహము ఇవియన్నియు బాగుగా అవగాహన అగును. మరిన్ని ఇవి అన్నియు వరుసగా పుట్టునపుడు తెలిసికొనబడుచున్నవి. నిలిచియున్నపుడు అర్థముచేసికొనుచున్నవి. అవి విడిచి వెళ్ళిపొయ్యేటప్పుడు తెలిసికొనబడుచున్నవి.

ఇటువంటివే ఇతరచోట్లగూడ చెప్పబడి ఉన్నవి.

## సరియైననిగ్రహము, లేక, ధ్యానము

కోరికలనువిసర్జించి చెడుభావములు లేకుండా ఉన్నప్పుడు, మొదటిధ్యానములో ప్రవేశించి, ఉంటున్నాడు.

మనస్సును దానిమీద నుంచి నిలిపినపుడు, అది 'సవితర్క-సవిచార' మనబడును. ఏకాంతముగా ఈ ధ్యానము చేయబడినపుడు, మనస్సు కరుణతోను, సంతోషము తోను నిండుచున్నది.

మొదటిధ్యానము తగ్గిపోయినపుడు రెండవధ్యానములో ప్రవేశించి దానిలో ఉంటున్నాడు. దీనితో, నోపలి మనస్సునకు, శాంతికలుగుచున్నది. ధ్యానములో మనస్సు, నిగ్రహింపబడుటచేత, రెండవదానిమీద, ఆధార పడకుండా ఉండుట, కరుణ, సంతోషములతో కూడి ఉండుట కలుగుచున్నవి. పిమ్మట కరుణను తృప్తిపొం దించుటచేత సమత్వముతో కూడుకొన్న మనస్సు గలవా డై శరీరములో ఒకవిధమగు సంతోషమును, ఈవిధము గా అనుభవించుచున్నాడు.

"నిర్మలమైన మనస్సు గలవాడు, సుఖముగా నుంటు న్నాడు. అనివీనినిగూర్చి ఆర్యులు చెప్పియున్నారు."

ఈలాగు చెప్పుచు మూడవధ్యానములో ప్రవేశించు చున్నాడు.

పిమ్మట, (సుఖదుఃఖములను విసర్జించి) నాల్గవధ్యాన ములో ప్రవేశించుచున్నాడు. దీనిలో స్వచ్ఛమైన వైరా గ్యముతో కూడుకొన్న మనస్సు గలవాడై, సుఖదుఃఖ

ములను వదలినవాడై ఆనందించుచున్నాడు.

## బౌద్ధము - యోగము

౧. బౌద్ధసిద్ధాంతములోను, యోగములోను కూడ "నేను — నాది: అనే అశాశ్వతమైన భావము నశించ వలయును." అని చెప్పబడియున్నది.

౨. 'నేను-నాది' అనేతలంపు, ఒకేధారగా ప్రవహింప చేయానిని, ఆపుచేయవలయునని రెండుసిద్ధాంతములును ఒప్పుకొనుచున్నవి.

ఆత్మను తెలుసుకొనేమెట్టుకు వచ్చేటప్పటికి, పైన చూపించినట్లుభేదము కనబడుచున్నది.

౩. బౌద్ధులు- 'నేను, నాది' అనేభావము నశించిన తర్వాత, నిర్వాణమును పొందుచున్నాడు! - అన్నారు.

యోగము, దీనితో ఆఖరుఅయినది.

ఇప్పుడు అసంప్రజ్ఞాతసమాధిని గురించి ఆలోచించెదము.

అసంప్రజ్ఞాతసమాధి, అనగా తెలిసికొనబడే విషయము, పట్టి సంస్కారము మాత్రమే అగుచున్నది. అప్పుడు తెలుసుకొనబడేవాడు, అనేభేదజ్ఞానము నశించు చున్నది. యో॥సూ॥ ౧. ౧౮. ౫౦.

## ఆత్మ - అభివృద్ధి

యోగసూత్రములలో, ఆత్మయొక్క, పెఱుగుటను గుఱించి, వృద్ధిని గుఱించిన సూచనలు అక్కడక్కడ ఉన్నవి. కాని, ఈవిషయమై, బుద్ధునియొక్క బోధనను ఆలోచింపవలెను.

## బుద్ధుని బోధ

చనిపోవుటకుపూర్వము ఈవిధముగా శిష్యులకు బోధించినాడు:—

"అదృష్టవంతుడు మొదటిధ్యానము పిమ్మట రెండవ ధ్యానము, తరువాత మూడవధ్యానము, అవతల నాల్గవ ధ్యానమును పూర్తి చేయుచున్నాడు. నాల్గవధ్యానములో నుంచి లేచి ఆకాశములో ప్రవేశించుచున్నాడు. దీనిలో నుంచి ఏమియు లేకపోవడము (Nothingness) లో ప్రవేశించుచున్నాడు. దీనిలోనుంచి లేచి, చూడకపోవ డము, చూడడములో ప్రవేశించుచున్నాడు, దీనిలోనుంచి లేచి చూడడము, మొదలైనవన్నియు నశించి, శాంతస్థితిని పొందుచున్నాడు."

## విశుద్ధమగ్గ – నిర్వాణము

'విశుద్ధమగ్గ,' అనే గ్రంథములో ౧. పునర్జన్మ లేక ఉండడమును గురించియు, ౨. నిర్వాణమును, పొందడమును గురించియు, వివరముగా చెప్పబడియున్నది.

ఇప్పుడు ఈగొప్పసిద్ధాంతములను గురించిన చర్చఆపి, మనోనిగ్రహమునకు సంబంధించిన సామాన్యవిషయములను చర్చించెదము.

# మనస్సు వ్యాపారములు

మనస్సుయొక్క వ్యాపారమును పూర్తిగా ఆపుచేసి మనోనిగ్రహము కలుగుటకు కావలసిన సాధనములను గురించి యోగసూత్రములలో ఈక్రింది విధముగా చెప్పబడి యున్నది.

దీనికి ఉండే ఆటంకములు, వాటిని తొలగించుటకు కావలసిన సాధనములు, వీనిని గురించి మన మిప్పుడు చర్చించుచున్నాము.

యోగములోను, బౌద్ధమతములోనుగూడ, మనస్సు నిలకడ కలుగజేయుటలో యోగికి ౧. సరియైన కాలము, ౨. సరియైనస్థలము ౩. ఇతరవిషయములు ముఖ్యావసరములని చెప్పబడి యున్నది.

శ్వేతాశ్వతరోపనిషత్తులోను, మైత్రయాగిఉపనిషత్తులోను, కఠోపనిషత్తులోను, భగవద్గీతలోను సాంఖ్య — యోగములు, ఏవైపునకు మొగ్గిఉండేదిన్ని చెప్పబడి యున్నది.

కాని యోగాభ్యాసమునకు సంబంధించిన కొన్ని లక్షణా

ములు, ఉపనిషత్తులకంటె, పూర్వకాలమునుంచిగూడ ఉండేవి.

ధ్యానము, నిగ్రహమునకు సంబంధించిన కొన్ని పద్ధతులు, యోగసూత్రములు స్థిరపడకపూర్వమునుంచి గూడ, చాలకాలముకిందనుండియు ఉండెను. (దాస్‌గుప్త యోగఫిలాసఫీ పే – ౪౨.)

## ఆటంకములు

నిగ్రహమునకు ఆటంకములు, అనేక తరగతులుగా ఏర్పడియున్నవి. ౧. జాడ్యము, ౨. సోమరితనము. స్తిమితము లేక ఉండుట.

మనస్సు కదలుటకు పడకపోతే, దానిని సోమరి తనము అందురు.

మనస్సు కదలుటకు శక్తి లేకపోతే దాని పేరుస్త్యానము కాబట్టి, ఒకే దృష్టిమీాదనిలుపుటకు, శక్తికితోడు, ఇష్టము గూడ ఉండవలెను, రెండింటిలో ఏదిలేకపోయినను, యోగికి, ఆటంకము కలుగును.

౩. సందేహము.

౪. మనస్సును, స్థిరముగా నిలుప శక్తి లేకపోవుట.

యోగియైనవాడు, మనోవికారములను పూర్తిగా అణచివేయుటకు శక్తిగలిగియుండవలెను. మధ్యకాలములో ఏమాత్రము అజాగ్రతగా ఉన్నను, పట్టుతగ్గిపోవును.

౫. ప్రపంచమును గుఱించి ఉండు తప్పు అభిప్రాయము.

యోగి, మనస్సులోని తలంపులనేకాకుండా, పనులను గూడ అభ్యాసము చేయవలెను. తలంపులను, పనులను, ఊహాలను, అన్నిటినిగూడ నిగ్రహించేశక్తి గలిగియుండవలెను.

సుఖములను, అనుభవించవలెననే కోరికలు ఉన్నంత కాలము, మనస్సును పైవస్తువులమీద నిలుపుటకు, ఎంత ప్రయత్నము చేసినను. లాభములేదు.

ప్రపంచముమీద ఆశఉన్నంతకాలము, వైరాగ్యముగాని, శాంతబుద్ధిగాని, సాధ్యముకాదు. అది ఉన్నంత కాలము మనోవికారములను, అణగద్రొక్కుట సాధ్యము కాదు.

కాబట్టి అబద్ధపుజ్ఞానమును, భ్రాంతిని, నశింపుచేసి నిజమైనజ్ఞానమును పొందుటకు అభ్యాసము చేయవలయును.

నిజతత్వమును గుఱించి, జ్ఞానము లేకపోయినను, ఆత్మానాత్మజ్ఞానము లేకపోయినను, మనోవికారములను

దొలగింప సాధ్యము కాదు.

మనోవికారము లన్నిటికిని మూలకారణము. సరియైన జ్ఞానము లేకపోవుటయు అజ్ఞానములో ఉండుటయునే అయియున్నవి.

కొన్ని శక్తులను సంపాదించుటవల్లను మనస్సునకుకొన్ని అనుకూలమైన లక్షణములు గలుగుటచేతను, యోగులు సమాధిని పొందినామని భ్రాంతి చెందుచున్నారు.

కొందఱు దేవతాశక్తులను (Magical powers) వెదకుచున్నవారై, కైవల్యమును పొందలేకుండా ఉన్నారు. ఏకాంతమైనస్థలము అవసరమనే జ్ఞప్తితప్పిపోయి, విభూతులు అని పిలువబడే, దేవతాశక్తులవెంబడిని పోయి, అసలు ముఖ్యమైనవని మఱచిపోవుచున్నారు.

ఈకాలపు హఠయోగులు కొంతమంది దేహమును నిగ్రహించేశక్తిని సంపాదించినవెంటనే ధారిదృష్టిని అసలు పొందదగిన వస్తువుమీదనుండి తప్పించి, సాధనముల మీదికి మఱలించుచున్నారు, ఈవిధముగా, ఆత్మను తెలుసుకునే ప్రయత్నమును మానివేయుచున్నారు.

యోగసూత్రములు, నూతనయోగులను, ముందుండే ఆటంకములను, కష్టములనుగుఱించి హెచ్చరించుచున్నవి.

పైనచెప్పిన తొమ్మిది ఆటంకములకుతోడు — అనగా
౧. జాడ్యము, ౨.సోమరితనము, ౩. సందేహము, ౪. అజాగ్రత, ౫. స్థిమితములేకపోవుట, ౬. ప్రపంచముతో సంబంధము, ౭. దానినిగుఱించిన తప్పు అభిప్రాయము.
౮. మనస్సును ఒకచోదృష్టిమీద నిలుపలేకపోవడము.
౯. పొందినదానిని నిలువుకొన లేకపోవుట — అనువానికి తోడు, మఱికొన్నిటిని యోగసూత్రములు చెప్పుచున్నవి. అవిఏవియనగా,

౧. మనసులోనుంచి పుట్టేబాధ; బయిటిప్రపంచము; దేవుళ్లు.

౨. కోరికలు లభించలేదు అనునిరాశ, మనస్సుయొక్క ఉద్రేకములుకూడ, బాధలు అని తెలియవలెను.

౩. దేహము నిలకడలేకపోవడము.

౪. ఉచ్ఛ్వాస నిశ్వాసములు,

ఇవన్నియు, పైనచెప్పిన తొమ్మిదింటితో కూడనే ఉన్నవి.

మనోనిగ్రహము కలిగినవెంటనే, ఇవన్నియు విడిచి పోవుచున్నవి.

దేహము, సరియైనస్థితిలో ఉన్నదా? లేదా? అనేవిచారణ యోగసూత్రములలో ప్రారంభించబడి, క్రమేణా

వృద్ధిపొంది తుదకు అది, ప్రత్యేకశాస్త్రము క్రింద ఏర్పడినది.

దేహమునకు సంబంధించినంతమట్టుకు మనశ్శాస్త్ర ముయొక్క చిహ్నలు ఇక్కడ చూపించబడినవి. అవి ఉప నిషత్తులలో కూడ ఉన్నవి.

వ్యాసభా ॥ యోగ ॥ శా ॥ ౨. ౩౨

## ఆటంకములు ; విరుగుడు

ప్రతిఆటంకమునకు ఒకటియో లేక యెక్కువగనో విఱుగుడులు ఉన్నవి. విఱుగుడు అనగా తొలగించే సాధనము.

యోగాంగములు ౨. అనగా యోగమునకు సహాయము చేయు సాధనములు. ఇవి, ఆత్మకుఉండు ఆటంక ములను తొలగించుటకు సహాయముచేయుచున్నవి. ఉదాహరణము. దేహములో బలహీనత, అవయవములలో నిలుకడలేకపోవుట, ఉచ్ఛ్వాసనిశ్వాసములు తలక్రిందగుట, ఇవన్నియు, మనస్సును కలవరపెట్టి నిశ్చలముగానుండునట్లు చేయుటకు సాధ్యముకాకుండ చేయుచున్నవి.

వీటినన్నిటిని ఆపుచేసి, పూర్తిగా తొలగించవలెను.

## యోగ సూత్ర సిద్ధాంతము

మనోనిగ్రహముచేయుటకు, మనస్సు ఏలాగు స్వచ్ఛముగా నుండవలెనో, అదేవిధముగా దేహముయొక్క శుచిత్వముగూడ అవసరమైయున్నది. యోగి, అవయవములనుగూడ నిగ్రహించి స్వాధీనములో నుంచుకొనవలెను.

కూర్చున్నపుడు చెట్టుయొక్క మొదలు (స్థాణు) వలె కదలకుండా వెన్నెముక, మెడ, తల అన్నియు నొక పజ్క్తిలోనున్నట్లు ఉంచవలెను. ఆలాగుఉంచి, ధ్యానమునకు అనుకూలమైన ఆసనములను పూనవలయును.

క్రొత్తగా బయలుదేరిన ముద్రలు అనగా వ్రేళ్లను వంచుట, చేతులను వంచుట, శరీరమును వంచుట, ఇవేవియుగూడ యోగసూత్రములకు సంబంధించినవికావు. మఱియు — న్యాసనునేదికూడ (అనగా దేహముయొక్క వేఱువేఱు భాగములను తగులుట—) యోగసూత్రములకు చెందినదికాదు. తాంత్రికశాస్త్రమునకును, ఆస్తికతకును, సంబంధించినది.

న్యాసమునగా శరీరమును అనేకవిధములుగా వంచి వ్యాయామమును కలుగజేయు విధానము.

ఈవిధముగా, దేహము, అవయవములు, కండలు, కదలి పనిచేయునప్పుడు భగవంతునితో నైక్యము కలుగుచున్నది; అనేనమ్మకము కలుగుచున్నది. ఆకారణముచేత

ఇది కేవలము శరీరవ్యాయామమని చెప్పబడదు.

ముద్రలవలన ఆత్మైక్యము కలుగునని చెప్ప నేను వడదు. ఇవి బహుశః (Magical symbols) గారడీ చిన్నెలు అయియుండవచ్చును. వాటికి తరువాత క్రొత్త అర్థమును కలుగజేసి ఉండవచ్చును. ఈముద్రలు, న్యాసములు, యోగసూత్రములు అంగీకరించునవికావు.

యోగసూత్రములప్రకారము, దేహము, మెడ, తల, వెన్నెముక కదలకుండా రాతివలె నుండవలెను గాని, కదలుచూ ఉండకూడదు.

కదలుచుఉండిన, నిగ్రహమునకు సాధ్యముకాదు. ఆకారణముచేత హఠయోగమునకు సంబంధించిన ౮౪ ఆసనములు యోగము అభ్యసించువారికి ఉపయోగ పడునవికావు. దీనినిబట్టి యోగమునకు కావలసిన ఆసనములు వేఱు అని స్పష్టపడుచున్నది. యోగమునకు ఆసనము సులభముగా నిలకడగా నుండవలెను.

అయినప్పటికిని, వ్యాసభాష్యము, ఆసనములు జంతు రూపములుగా వేయవలెనని చూపించుచున్నది.

యోగశాస్త్రము "శ్వాసను నిగ్రహించి, ప్రాణాయామమును చేయుమనీ, ఆలాగు అభ్యసించుటచేత, తుదకు చాలసేపు ఊపిరిని ఆపుచేయుటకు శక్తి కలుగుచున్నదనీ"

చెప్పుచున్నది.

శ్వాస

౧. శ్వాసను లోపలికి తీసికొనుట, వెలుపలికి విడుచుట రెండుకూడ కొంచెము స్థలములో మాత్రమే ఉండవలెను.

౨. ఊపిరిసంఖ్య తగ్గించవలెను.

౩. కాలము, ఎక్కువగా నుండవలెను.

౪. ఈవిధముగా, దేహము తక్కువ పర్యాయములు ఊపిరివిడుచుచు, క్రమేణాతగ్గించి, చివరకు చాలా నెప్పుడుకు, ఊపిరివిడువకుండా ఉండేశక్తిని సంపాదించవలెను. ఇట్లు చేయుటలో, లోపలికి గాలిపోకపోవుటచేత, ఊపిరిఆడక, చచ్చిపోవుట తటస్థించకుండా ఉండేలాగు జాగ్రత్తగా ఉండవలెను.

(Autonomic system) తనంతట తానే పనిచేసే విధానము, నరములకు ముఖ్యస్థానమైన మెదడుతో కలిసియుండుటచేత దానంతట అది పనిచేసేవిధానమును, నిగ్రహించుట సాధ్యమైనవని, అని, నూతనముగా, యోగ సిద్ధాంతులవలన, కనిపెట్టబడియున్నది.

ఈకనిపెట్టుటలో, ప్రత్యేకహక్కు యోగసిద్ధాంతమునకే కలదుగాని, ఇతరములకు లేదు.

## తాంత్రికసిద్ధాంతము

ఆ దేశకాలములలో తాంత్రికసిద్ధాంతము, షట్చక్రము లను సర్వహించే విధానమును కల్పితమయ్యెను. దానికి అనుకూలముగానుండు కొన్ని దేహసంబంధమైన మార్పు లను ఆమోదించియుండిరి.

యోగశాస్త్ర మన్ననో, ఒక్క ఊపిరి వీడుచుట, పీల్చుట (ఉచ్ఛ్వాస నిశ్వాసములు) కు మాత్రమే కైవల్య మునుగాని మోక్షమునుగాని కోరే యోగులకు, 'గతి' యని నిరూపించియున్నది.

శ్వాసను నిగ్రహించుటచేత పరిశుభ్రతకలుగుచున్న దనియు, దేహములోని మలినమంతయు కొట్టుకొని పోవుచున్నదనియు అనగా భూతశుద్ధి అగుననియు, చెప్ప బడినది. ఇవిఅన్నియు క్రొత్తగా చెప్పబడినవిగా ఉన్నవి.

శ్వాసను నిగ్రహించుటచేత, మనస్సును, ఒకేవిషయ మున నిలుపుట సాధ్యమగుచున్నది.

మఱియు దేహమునకు, ఆత్మకును గల భేదమును కని పెట్టగల జ్ఞానమును కప్పివేసిన కర్మ, శ్వాసనిర్వాహణముచే నశించుచున్నది.

[యో. శా. ౨ – ౫౨] (భా. ఉ. ౧ – ౩. ౫)

అయినను, యోగసూత్రములలో గూడ శ్వాసను నిగ్రహించుటను గురించి, దానియొక్క ఫలితమును గుఱించి, అతిశయోక్తిగానే చెప్పబడియున్నది.

ఇందుకు కారణము ఉపనిషత్తులలో చెప్పియుండు 'పూర్వవాసన' గాని మఱియొకటి కాదు.

ప్రాతర్దానప్రభువు కనిపెట్టిన ప్రాతార్దానయజ్ఞము చేయునపుడు, మనుష్యుడు ఊపిరిపీల్చి, విడుచు మూలముగా ఎడతెగని యజ్ఞము చేయుచున్నాడని తలంచిరి. మఱియు, శ్రుతులన్నియు, పరమాత్మ శ్వాసవిడుచుటవల్ల, బయటపడినవని ఉపనిషత్తులఅభిప్రాయము. (కౌ.ఉ ౬-౩౨)

వాస్తవములో, తరువాతవచ్చిన గ్రంథములలో మనుష్యుడు గాలిని లోపలికి పీల్చినపుడు, 'సో' అనే శబ్దము చేయుచున్నాడనీ వెలుపలికి విడుచునపుడు, 'హమ్' అనే ధ్వని, చేయుచున్నాడనీ, ఈవిధముగా తనకు తెలియకుండానే, 'అజప, జప' అనేశబ్దములను చేయుచున్నాడనీ ఈవిధముగా జీవాత్మయే పరమాత్మ అగుచున్నాడనీ అందుచేత ('సో - అహం') అనగా అదే నేను, అని చెప్పుచున్నాడనీ, ఉన్నది. (ఖేర్ — సామ్ — ౫ — ౧౪.)

ఇది కేవల కుంభకమని పిలువబడుచున్నది.

[(హఠయోగ॥ ప్ర—౨. ౭౨—౪.) కూడ. చూడుడు]

## శ్వాస – నిగ్రహము

శ్వాసను నిగ్రహించుటచేత, దేహములోని వ్యాధులు నశించుననీ, మనుష్యునికి అందమును, దీర్ఘాయువును ఇచ్చుననీ చెప్పుట ప్రాణాయామపు ముఖ్యోద్దేశము కాదు. కాని, కాయసంపత్తు, శరీరము లోపములేనిదిగా కావడము, అనగా, అందము, నాజూకు (Grace), శక్తి, వదులుగాకుండా ఉండడము మొదలైనవన్నీ, శ్వాస నిగ్రహమువల్ల యోగివలన పొందబడుచున్నవని ఒప్పుకొనుచున్నారు. (యో॥ శా॥ 3 – ४६)

(యో. శా. భాష్య. తత్త్వవైశారది 3 – ४८)

## తపస్సు

యోగసూత్రములలో తపస్సునుగురించి ఎక్కువగా చెప్పబడియుండలేదు. యోగమునకు తపస్సు అవసరము లేదు. కాని తపస్సుఒకవిధమైన 'క్రియాయోగ' మని చెప్పబడియున్నది. మఱియు, తపస్సు, నియమసిద్ధాంతమునకు సంబంధించిన అయిదింటిలో ఒకటి అయియున్నది. పూర్వకాలములో, శరీరమునకు హింసను కలుగజేసేతపస్సు మొదలైనవి, అంత ఉచితము అయినవిగా తలచబడలేదు.

అదేవిధముగా — వేదములలోవిధించిన హింసతో కూడిన యజ్ఞముకూడ మంచిదికాదని చెప్పబడి ఉన్నది. భగవద్గీతలోకూడ యజ్ఞములనుగురించి కొద్దిగా చెప్పుచున్నది, గాని దానికి ఎక్కువవిలువ ఈయలేదు. (భగవద్గీత॥ అ. ౪. శ్లో. ౩౩.)

యోగముకూడ హింసతోకూడుకొన్న యజ్ఞమును నిరాకరించి విముక్తికి, అహింసతోకూడుకొన్న బౌద్ధ జైన సిద్ధాంతములను అవలంబించియున్నది.

దేహమును కదలించే ఆసనములు మొదలైనవి, మనోనిగ్రహమునకు భంగము కలుగజేయుచున్న కారణముచేత, ఖండించియుండి, హింస, కదలికలతో కూడుకొన్న యజ్ఞను మంచిదని యోగము ఏలాగు చెప్ప గలదు!

యజ్ఞములు నిరాకరించినను, ఉపనిషత్తులలో చెప్పబడిన ఓంకారశబ్దము, అంగీకరించబడినది. ఓంకారమును వరుసగా చాలాసేపు ఆగకుండా చెప్పుటచేత, మనస్సును, ఒకేవస్తువుమీదనిలుపుట సాధ్యముగుననీ, తలంపులను పూర్తిగా ఆపలేకపోయినప్పటికిని, ఈశ్వరుని ధ్యానించుటకు, సహజమైన శబ్దమనిన్ని, యోగము ఒప్పుకొనుచున్నది. (యో. శా. ౧. ౨౭)

## ధ్యానము

ధ్యానమువల్ల, దేహమును, నిగ్రహించవచ్చుననీ, ఆకారణముచేత, దేహము చేయవలసిన ముఖ్యమైనపని ధ్యానమనీ, ఊరక తాత్కాలికముగా, దేహములోనుండు లోపములను సవరణచేయుటకుమాత్రమే ఉపయోగపడు పని కాదనీ యోగమువలన కనిపెట్టబడియున్నది. జేమ్స్ కూడ ఇట్లే చెప్పియున్నాడు.

జేమ్స్ప్రిన్సిపల్స్ ఆఫ్ సైకాలజీ ౧ – ౮౩౫

కాని దేహమును నిగ్రహించిన మాత్రమున మనస్సును నిగ్రహించుట సాధ్యమైన పనికాదు.

ఇంద్రియములు బుద్ధిసహాయముచేత ఆత్మను ఆటకా యించుచున్నవి.

మనస్సును ఇంద్రియములలోనుంచి మఱలించినందాక, ఆత్మకు హింస కలుగుచునే ఉండును. కాబట్టి మనస్సును ఇంద్రియములలోనుంచి మఱలించవలెను. ఇది ప్రత్యాహార మనబడును. (యో. శా. ౨. ౫౪),

(మినస్ రైస్. డేవిస్ బుద్ధ – ఫిలాసఫీ ౧౨. ౧౩)

యోగసిద్ధాంతముప్రకారము ఇంద్రియములలో దేనిని గూడ, కావలెనని చెడగొట్టగూడదు. వాటిపనినిగూడ

చెడగొట్టగూడదు. తలంపులు నిగ్రహించబడుటవల్లనే కైవల్యము లభించును.

ఈసందర్భములో యోగసిద్ధాంతమును మూడుమాటలలో చెప్పవచ్చును. "ధ్యానము, మనస్సును నిశ్చలముగా నిలుపుట, జయించుట." అనేవి ఈమూడుమాటలు.

---

# యోగసూత్రములు

## రెండు మూడు భాగములు

ఏదో ఒకవిషయముమీద మనసునిలుపుటచేత, అనేక ములైన శక్తులు (విభూతులు) పుట్టుచున్నవని, రెండు మూడు భాగములలో, చెప్పబడిఉన్నది.

క్రొత్తగా ప్రారంభించిన యోగి, ఈ ఫలములను చూచుట తోనే ఉప్పొంగి పోవుచున్నాడు. కాని, అనుభవశాలి అయిన యోగి, వీటిని, ఆత్మశక్తి పెఱుగునట్టి చిన్నెలుగా గ్రహించి, తరువాత జ్ఞానేంద్రియముల నిగ్రహించుటకు ప్రయత్నించును.

విషయములను పూర్తిగా నిగ్రహించవలెనని కోరే యోగి, ప్రపంచములోని వస్తువులను, కాలములోను, ఖాళీస్థలములోను తెలిసికొనుటవల్లమాత్రమే తెలియు చున్నాడు. అనేకమైన సిద్ధులను పొందుటవల్లమాత్రమే తెలిసికొనజాలడు.

ఈ మెట్టుదాటిపోయి, ప్రపంచమనేవిషయము, ఆత్మ కు సంబంధము లేకుండా వట్టివస్తువుగామాత్రమే ఉన్న

దని తెలియవలయును. ఇంద్రియనిగ్రహముచేత, ప్రపంచ వస్తువులమీద కోరికలన్నియు విసర్జించినప్పుడు ఈశక్తి కలుగును.

మనస్సుయొక్క నిశ్చలత్వమునకు, మనస్సులోనికి వచ్చేవిషయములనెంబడి మనసును పోకుండాచేయుట, మొదటిపని అయియున్నది. ఇది జరిగినపిమ్మట నే మనో నిగ్రహము కలుగగలదు.

మనస్సులోనికి వచ్చేవిషయములు, మనుష్యునియొక్క జీవితముమీద ఆధారపడియున్నవి. తుదకు జ్ఞానము అనేది డంబముకొఱకు, భోగముకొఱకును మనుష్యుడు ఆశించే వస్తువులమీద ఆధారపడియున్నది.

## కోరిక తగ్గుట యెట్లు?

ప్రపంచములోని వస్తువులమీది ఆశ తొలగుట యెట్లు? ఈవిషయమై, హిందూ, బౌద్ధ, జైన మతములు మూడు గూడ ఒకసిద్ధాంతమునే అవలంబించి ఉన్నవి.

ఆకర్షించే వస్తువులయొక్క అసహ్యకరమైన లక్షణ ములమీద మనస్సునిలుపుట. ఉదాహరణము. పైకి కను పడే అందముచేత ఆకర్షించబడకుండా ఉండవలెనంటే,

మన ష్యానిశీలింపు, బౌద్ధసిద్ధాంతము లో చెప్పిన ఈ క్రింది విధముగా నుండవలెను.

"ప్రాణముపోయినతర్వాత దేహము ఎంత అసహ్యకరముగానుండునో, ప్రాణముతో నున్నప్పుడుగూడ, అంతే అసహ్యకరముగా నుండును. కాని, దానికి చేయుబడే సంరక్షణవల్లను, అలంకారములవల్లను, అసహ్యత కప్పబడుచున్నది. శరీరములో మూడువందల యెముకలున్నవి. నూట యెనుబది యెముకలు కలిసే సంధులున్నవి (joints). తొమ్మిదివందల మజ్జాబంధములు (Tendons), ఉన్నవి. తొమ్మిదివందల కండరములు (Muscles) ఉన్నవి. రంధ్రములతోగూడుకొన్న లోపలిచర్మము, పై చర్మము ఉన్నవి. ఈ రంధ్రములగుండా ఎప్పుడును చెమటనీరు వచ్చుచున్నది. ఇది పురుగులకు, జాడ్యములకు, నివాస స్థలము గానున్నది. సకల వ్యసనములకు, దుఃఖములకును పుట్టినయిల్లు అయియున్నది. దేహము యొక్క తొమ్మిది ద్వారములనుంచి చెమటపదార్థములు బాగా పండిన కురుపులోనుంచి వచ్చే రసమువలె వెలుపలికి పంపబడుచున్నవి.

కండ్లలోనుంచి పుసి వచ్చుచున్నది. చెవులలోనుంచి గుమిలి వచ్చుచున్నది. ముక్కులలోనుంచి చీమిడి వచ్చు

చున్నది. నోటిలోనుంచి ఆహారము లోపలికిపోవుచున్నది. పిత్తము, కళ్లె, రక్తము, బయటికివచ్చుచున్నవి. క్రిందనుండే రెండు రంధ్రములలోనుంచి, మూత్రపురీషములు వచ్చుచున్నవి. తొంబదితొమ్మిదివేల రంధ్రములలోనుండి, అసహ్యాకరమైన చెమట వచ్చుచున్నది. ఈచెమటనీళ్ల కొఱకు, ఈగలు, పురుగులు చేరుచున్నవి. వీటినన్నిటిని కప్పివేసి, అలంకరించుటచేత పురుషులు స్త్రీలను, స్త్రీలు పురుషులను మోహించుచున్నారు. పైనచెప్పిన అసహ్యాకరమైన గుణములన్నిటిని మఱచిపోవుచున్నారు.

వాస్తవములో సంతోషమునకు కారణము ఒకటి కూడలేదు. దీనికి నిరూపణ ఇదిఒకటే. ఒక దేహభాగమే దైనను దేహమునుంచి విడిపోయినయెడల అనగా తల ఒడలు మీదివెండ్రుకలుగాని, గోళ్లుగాని, పండ్లుగాని, కళ్లెగాని, చీమిడిగాని, మూత్రముగాని, కడుపులోని మలినముగాని, బయటపడినపుడు వాటినిచూచి మనిషి, సంతోషించడు, వాటిని ముట్టుకోడు, వాటినిచూచి అసహ్యించుకొంటాడు.

శరీరమును వదలకుండా అంటియున్న అన్నిభాగములును, అంత అసహ్యాకరమైనవి అయినప్పటికిని, వాటిని ప్రేమించుచున్నాడు. శాశ్వతమైనవనీ, సుఖమును ఇచ్చునవి అనిన్నీ తలచుచున్నాడు.

## యోగ సూత్ర సిద్ధాంతము

ఈ దేహము ఆకాశములోనుంచిగాని దేవతలలోనుంచి గాని పుట్టుటలేదు. ఆభరణములలోనుంచి పుట్టుటలేదు. వాసనకొట్టుచు అసహ్యముగానుండే కడుపులోని పేగుల యొక్క మాయలోనుంచి పుట్టుచున్నది. కుళ్లిపోయిన చేపలలోనుంచిన్ని ముంటుగుచున్న బురదలోనుంచిన్ని చిన్నపురుగులు పుట్టినట్లుగా ఈ దేహము పుట్టుచున్నది.

## ప్రేమ - కరిగిపోవుట

ఒకమనుష్యుడు, మొదట భార్యను, ఎక్కువగ ప్రేమించును. పిమ్మట నాతియొకనితో మాట్లాడినపుడు సందేహించును. ఈర్ష్యపడును. తర్వాత ఇంకొకనితో సంభోగించినది అని తెలిసినపుడు విడిచిపెట్టుచున్నాడు. అటు పిమ్మట ఆస్త్రీ కామిచేసినప్పటికిని, తనకు సంబంధములేదని తలచియూరకుంటాడు.

మొట్టమొదట ఒకనిమిషమైనా వదలిపెట్టకుండా ఉండేప్రేమ ఈస్థితికి వచ్చుచున్నది.

ఈవిధముగా, 'నేను, నాది' అనేభావము నశించిపోవుచున్నది. మనస్సు మూడువిధములైన ఉనికిలోనుంచి, వెనుకకు పోవుచున్నది. నాలుగురకములైన శరీరములో

నుంచి వెనుకకు పోవుచున్నది. అయిదురకములైన పునర్జన్మలోనుంచి వెనుకకుపోవుచున్నది. ఏడు మెట్లుగల గ్రాహ్యశక్తిలోనుంచి వెనుకకుపోవుచున్నది. తొమ్మిది రకములైన దేహములోనుంచి వెనుకకు పోవుచున్నది. తుదకు, అసహ్యముపుట్టి విరక్తిచెందుచున్నది.

ఈవిధముగా యోచించుటకు 'ప్రతిపక్షభావన' అని పేరు. అనగా రెండవవారు చెప్పేదానిని యోచించుట.

ఈలాగు యోచించి, ఒక్కొక ఆ[illegible]కమును, తొలగించుకొనుటకు అవకాశము కలుగుచున్నది.

## కామము

వస్తువులు, పనికిమాలినవని, హానికరమని, తెలిసికొనేవఱకు, కండ్లుమూసుకొని ప్రేమించుచునే ఉండును; కష్టములలో పడుచునే ఉండును.

ఈవిధముగానే అనుకొనిన కామమును విసర్జించుటకు సాధ్యమగును.

తన ఒక్క శరీరమును శుభ్రముగా నుంచుకొనుటకు, ఇంతకష్టము ఉండగా, ఇతర దేహములతో సంబంధము ఏవిధముగా నుంచుకొనగలదు.?

దీనివలన తేలే పర్యవసానం ఇది.

మనస్సును, ఏదో ఒకవిషయముమీద నిలుపుటకు అభ్యాసము కావలెను.

## యోగసూత్రములు - చంచలత్వము

చంచలత్వము లేకుండా చేయుటకు యోగసూత్రములు ఈప్రకారము విధించుచున్నవి. ౧. శరీరములో ఏ ఒక భాగము మీదనైన, బుద్ధిని నిలుపవలెను. బొడ్డుమీద గాని, ముక్కుమీదగాని, నాలుక చివరమీదగాని హృదయకమలము మీదగాని, తలలోనుండే జ్యోతిమీద గాని (మూర్ధ్నజ్యోతి) మనస్సును నిలుపవలెను.

మొదట ఒయటివిషయములమీద మనస్సు నిలుపు టకు అభ్యాసముచేసి, పిమ్మట, పైనచెప్పినట్లు దేహము లోని యేభాగము మీదగాని, నిలుపుటకు ప్రయత్నించ వలెను.

ధారణ — అనగా, మనస్సును ఏదోఒక స్థానము నందు నిలకడగానిలుపుట. దీనిఫలితము Similarity of presentations. ఇది 'ఏకతానత' అని చెప్పబడును. అనగా దీనిని పొందినపుడు, మనస్సు ధ్యానములోనికి దిగును. ధ్యానము, అనగా, ఒకేదృష్టితో భగవంతుని ధ్యానించుట.

మనుష్యుడు, ధ్యానములో మునిగిపోయినపుడు

సమాధిఅవస్థ కలుగును.

యోగసూత్రములప్రకారము ధారణ, ధ్యానము, సమాధి, ఈమూడింటికీభేదము చాలాకొంచెము.

యోగశాస్త్రము మూడింటికిని ఒకే పేరుపెట్టియున్నది. దీనికి 'సామ్యాయామ' మనిపేరు. అనగా (Constraint) నిగ్రహము.

నిగ్రహము ఎంతఎక్కువ అయితే, లోపలిదృష్టి అంత బాగా కనబడును. ఇదే సమాధిప్రజ్ఞ.

ఇవిమూడును నిగ్రహమునకు నేరుగా సహాయము చేయుచున్నవి. దీనికే 'సంప్రజ్ఞాతసమాధి' అనిపేరు.

యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహారములను ఐదును దీనికి పరోక్ష సహకారులు. అసంప్రజ్ఞాత సమాధికి ఈ ఐదును సహాయము చేయుచున్నవి.

ఇది ఇతరవిధములుగుండ చేయుటకుకూడ సాధ్యమని వ్యాసభాష్యము చెప్పుచున్నది.

భగవంతుని ధ్యానముకూడ ఈ ఇతరమార్గములలో చేరియున్నది. యో॥ శా॥ 3 - ౧ - మీద వాచస్పతి భాష్యము.

తలంపులను వృద్ధిచేసే పనులలోనుంచి మనస్సును ఆత్మను మరలించే విధానములనుగురించి ఆలోచించెదము.

మనస్సు చంచలమైన దనే విషయములో యోగ సూత్రము, బౌద్ధసిద్ధాంతములోను, జైనసిద్ధాంతములోను, ఏకీభవించుచున్నది. ౧. హానిచేయుట ౨. మోసము చేయుట ౩. అక్రమలాభములను పొందుట ౪. స్త్రీవాంఛ ౫. దురాశ ఇవన్నియు ఆత్మను ఒకవిషయమునుంచి మఱియొక విషయములోనికి ప్రవేశపెట్టి ఆ వేతలంపులలో పనిచేసేటట్లు చేయుచున్నవి.

యోగి, వీటిని, అటకాయించి, మనస్సును వాటిలో నుండి మఱలించి, ౧. అహింస ౨. సత్యము, ౩. అస్తేయము. అనగా (దొంగిలించకుండా ఉండుట) ౪. బ్రహ్మచర్యము. ౫. సంతృప్తి, అనువాని మీదికి త్రిప్పవలెను. మొదటిఅయిదును 'యమము' లనబడును, ఆఖరుది అనగా 'సంతృప్తి' నియమములలో చేరును.

మనస్సును వీటిమీదికి త్రిప్పి వాటిని అభ్యసించేలాగు చేయునంత కాలము. మనస్సు ఇష్టమువచ్చినట్లు చంచలమై తిరుగుచునే ఉండును. పాపఫలితములను జమచేయుచునే యుండును.

కాబట్టి యోగి అయినవాడు కల్మషములతో కూడుకొన్న తలంపులతో సంబంధములేకుండా ఉండవలెను. ౧. ఇతరులు సుఖముగానున్నందుకు సంతోషించవలెననీ,

౨. కష్టములలో నుండువారికి కరుణ జూపవలెననీ,
౩. స్నేహితులు చేసే మంచిపనులకు సంతోషించవలెననీ,
౪. దుర్మార్గులను గమనించవద్దనీ, బోధించబడి ఉన్నది.

## ఈర్ష్య - ద్వేషము

పైన చెప్పినట్లు నడచుకొనేయెడల, ఇతరుల అభివృద్ధిని గురించి, అనగా, ప్రపంచమునకు సంబంధించిన విషయములలో - ఈర్ష్య లేకుండా ఉండగలడు; ద్వేషమును విడువగలడు; పాపాత్ములయెడల కోపమును మాన గలడు; బీదలను నిర్లక్ష్యము చేయకుండా ఉండగలడు. మనోనిగ్రహముయొక్క ముఖ్యోద్దేశ్యము చెడుతలంపులను తొలగించుటయే అయియున్నది.

నిగ్రహించేశక్తి పెరిగేకొలది, చెడుతలంపులన్నీ క్రమేణ నశించును.

## యోగసూత్రము - చెడుతలంపులు.

యోగసూత్రము బోధించునది ఏమనగా, చెడు తలంపులు, మంచితలంపులు, రెండుగూడ ఆగిపోవలయును, కారణమేమనగా, మనోవృత్తిని పూర్తిగా నశింపు చేయుటయే యోగముయొక్క ముఖ్యోద్దేశము.

## యోగ సూత్ర సిద్ధాంతము

మనస్సులోనుంచి, మంచిచెడ్డతలంపులు భేదము లేకుండా నశించినప్పుడును, భూత భవిష్యత్ వర్తమాన కాలము లనేభేదము లేకుండా నశించినప్పుడును, మనోవికారములన్నియు నశించినప్పుడును యోగి, తనగమ్యస్థానమును పొందగలడు.

ఏకాగ్రచిత్తము కనబడినపుడే యోగియొక్క ఉద్దేశము నెఱవేరగలదు. యో॥ శా॥ ౩౨

అనేక మంది అనేక స్వభావములతో ఉంటారు. ఆయాస్వభావములకు అనుకూలమైన విషయములమీద మనస్సు నిలిపి యోగము చేయవచ్చును అనే సూత్రము మీద యోగము నడుపబడుచున్నది.

భగవంతునిమీద మనసునిలిపి ధ్యానముచేసినయెడల ఆటంకములు తొలగిపోవును. అనేకారణముచేత భగవంతునిగురించిన ధ్యానము యోగములో ప్రవేశపెట్టబడినది.

'ఉపయాావ్యాయ' మనే అశుచిలోనుంచిన్నీ క్లేశములోనుంచిన్నీ, ధర్మాధర్మములలోనుంచిన్నీ జాత్యావిర్భావములోనుంచిన్నీ, త్వరలో విముక్తినిపొందుటకు, భగవద్ధ్యానము మంచిసాధనముగనుక దానిని యోగములో ప్రవేశపెట్టిరి.

# యోగ సూత్ర సిద్ధాంతము

## మొ ద టి భా గ ము

యోగసూత్రముల మొదటిభాగములో భగవంతుని అనవసరముగా ప్రవేశపెట్టినమాట సత్యమే. సూత్రములు ౨౩ - ౨౯ వరకు వదలిపెట్టినప్పటికి లోపము లేకుండా అధ్యాయములో చెప్పబడిన విషయము నడుచును.

భగవంతునికి పేరుప్రవేశపెట్టుటవల్ల జ్ఞానయోగము కంటె, తక్కువదైన, క్రియాయోగము ప్రవేశపెట్టబడి నట్లు కనబడుచున్న మాటకూడ బహుశః నిజమై యుండవచ్చును.

సాంఖ్యసిద్ధాంతములో జ్ఞానముచేతమాత్రమే కైవల్యము, లభించునని చెప్పబడి ఉన్నది.

భగవంతుని ధ్యానముకూడ, శుచి, సంతుష్టి, తపసు, పారాయణము మొదలైనవాటిలో అనగా, నియమములో ఒకటిగా ప్రవేశపెట్టబడుటకూడ సత్యమే అయి ఉన్నది.

క్రీస్తుశకమునకు పూర్వము కొంత కాలముక్రిందట శివ మత, వైష్ణవమత భేదములు ఏర్పడి, ఆకాలములో యోగసిద్ధాంతములో భగవంతునిగురించిన ధ్యానము

ప్రవేశపెట్టబడిన దని తలచుటకు కారణము లున్నవి.

యోగసూత్రము, వేదాంతుల చేతులలోనికి, ఆకాలములో వచ్చినమాట సత్యమైనయెడల, భగవద్ధ్యానము వల్లనే, అన్నిటికంటె గొప్పదైన సమాధి, పొందుటకు సాధ్యమనీ శ్రుతులను, స్మృతులను పారాయణము చేయుటచేత, ఆయా దేవతలతో, యోగముగుండా సంయోగము కలుగుననీ చెప్పియుండుటకు, హేతువులు మనకు బోధపడుచున్నవి.

(యో. శా. ౧ – ౪౪.)

యోగసిద్ధాంతము, జీవాత్మ పరమాత్మల ఏకత్వమును గురించి ఒప్పుకోనదు. ఎందుచేతనంటే జీవాత్మ పరమాత్మలు ఒకటే అనుటను గురించి చెప్పుటకు వేదాంత సిద్ధాంతము తగియున్నది. ఆ విధముగా వేదాంతసిద్ధాంతములో విధించియున్నది. అట్టి స్థితిలో చెప్పినదానినే మఱల యోగసిద్ధాంతము మాఱు చెప్ప నుద్దేశించి యుండ లేదు. సర్వదర్శనసంగ్రహ - అభ్యంతర. పే ౩౪౬ - ౩౪౭ లంకావతారసూత్రములో ఇది ఈక్రింది విధముగా చెప్పబడి ఉన్నది. "శాంతి, అనగా, ఐక్యము. ఐక్యమువల్ల అన్నిటికంటె శ్రేష్ఠమైన సమాధి కలుగును. సమాధి తత్త్వములో ప్రవేశించుటవలన కలుగుచున్నది. తత్త్వము అనగా

అంతరాత్మలోనుండే గొప్పజ్ఞానము."
సుజూకీ సెన్ట్ - లంకసూత్ర పుట ౮౨-౧౨౧-౨౦౧.

పరమార్థము అనగా ఆఖరుసత్యములో ప్రవేశించుట. అనగా ద్వైతమును దాటిపోవుట. విగ్రహములు లేనిచోట ఏకత్వమే ఉండును. అన్నిరకముల ధ్యానములు అనగా అప్రమాణము, అరూప్యము, సమాధి, తలంపుల వినాశము, ఇవన్నియు, మనస్సు, ఉన్నచోట ఉండవు.

'భగవంతుడును, ధ్యానము చేయబడినప్పుడు కూడ, ఆఖరు ఉద్దేశము, మనస్సు యొక్క ప్రవాహమును, వికారములను, గొప్ప గొప్ప తలంపులను అంత మొందించుటకే గాని వేరుకాదు.' అని యోగసిద్ధాంతము.

ఏకారణముచేత భగవంతునియందు నమ్మకములేని వారిచేత యోగసిద్ధాంతము అంగీకరించబడుచున్నదో అది దీనినిబట్టి స్పష్టపడుచున్నది.

రీస్ డేవిడ్స్ అనునామె చెప్పినట్లు మనశ్శక్తులను వృద్ధి చేయుటకును తుదకు ఆశక్తులన్నిటిని ఉపయోగించుటవలన, భగవంతుని తత్త్వమును తెలిసికొనుటకును, తుదకు అవి ఎందుకును పనికిరానివి అని తెలిసికొనుటకును యోగజ్ఞాన మవసరమై యున్నది.

"దేహము, ఆత్మకంటె వేరైనదని తెలిసికొనినతోడనే

ప్రపంచవిషయములం దాసక్తి, వాటికి సంబంధించిన తలంపులు అన్నియుకూడ నశించిపోవుచున్నవి. ఆత్మ ద్వంద్వములను దాటిపోవుచున్నది. అనగా సుఖదుఃఖములను, దాటిపోవుచున్నది.

తెలుసుకొనేవాడు, తెలిసికొనబడేవిషయము అనే భేదమును దాటుచున్నది. అది అపరిణామము అగుచున్నది; — దాస్‌గుప్త: యోగఫిలాసఫీ

## క్రొత్తశక్తులు

క్రొత్తగా కనిపెట్టబడిన శక్తులు తమకు ఒళ్లు తెలియకుండా పరవశమయ్యేలాగు చేసినవి. పలువిధములైన ఆసనములు, ముద్రలు, న్యాసములు, ప్రాణాయామము, మొదలైనవి, దేహమును, స్వాధీనము చేసికొనుటకును, ప్రకృతిస్వభావములను, దానిశాసనములను, అతిక్రమించు శక్తిని పొందుటకును, అభ్యాసము కలిగించుచున్నవి.

బౌద్ధసిద్ధాంతము, అటువంటి శక్త్యభ్యాసములు, నిషేధించియున్నది.

బౌద్ధసిద్ధాంతములు గారడీవిద్య చేయకూడదని నిషేధించియున్నవి.

బుద్ధుడు, ఎక్కువమంది తనశిష్యులను మహిమలను చేయుటకును, గారడీవిద్యలు చేయుటకును నిషేధించినాడు. — పతికసుత్తాంత॥ W. f. ౪. ౮ బ్రహ్మజాలసుత్త.

ఈవిధముగా నిషేధమున్నప్పటికి గారడీవిద్యలు చేయబడుచునే యున్నవి.

ఆత్మ కేవలము జ్ఞానమును పొందుటకు మాత్రమే దానిశక్తిని ఉపయోగించుట లేదు.

యోగసూత్రము ప్రకారము, అతీతశక్తులు యోగాభ్యాసము చేయునప్పుడు, వాటియంతట అవే పుట్టుచున్నట్లు తలచబడుచుండగా జనసామాన్యము యోగికి మనస్సులో అవి తప్పకుండా ప్రయత్నపూర్వకముగా పొందవలసినవే అని కోరిక కలుగును. ఆత్మజ్ఞానము పొందుటే యోగము ముఖ్యోద్దేశము. మిగిలినవన్నియు అందుకు లోబడినవియే.

## కైవల్యము

యోగముగూడా కైవల్యమును పొందుటకు, ధైర్యశాలిగాని, ప్రయత్నముచేయుడు.

## యోగ సూత్ర సిద్ధాంతము

యోగసిద్ధాంతములో భగవంతునిగురించి చెప్పినప్పటికిని, ఆఖరు మెట్టులో, మనోవ్యాపారము భగవంతునికి ఏవిధమైన సంబంధములేని బౌద్ధమతములోను, జైనమతములోను, ఏవిధముగానుండునో, ఆవిధముగానే యోగములోగూడ నుండును.

యోగములో పేర్కొన్న దేవతలందరు నామమాత్రులేకాని, వారినిగురించి సత్యము ఏదియులేదు. ఈఅన్ని సిద్ధాంతములలోను, దేవతలు యోగికంటె తక్కువవారుగానే చూపింపబడినారు.

## యోగము – బౌద్ధమతము

బౌద్ధమతములోవలెనే యోగములోకూడ ఆత్మజ్ఞానమును పొందువిషయములో కొన్ని మూలసూత్రములు ప్రధానముగా ఉన్నవి.

అవి ఇవి: మనస్సునిగ్రహించుటలో ౧. శ్రద్ధయుండవలెను. ౨. వీర్యము, అనగా నమ్మకములోనించి వచ్చే శక్తి యుండవలెను. 3. స్మృతి అనగా కోరేవిషయమును మనసుముందుకు ఒకేధారగా వచ్చేలాగు చేయుశక్తి గలిగియుండుట. ౪. సమాధి — ఒకేవిషయమందు మనస్సు

నిలుపుట. ౫. ప్రజ్ఞ. మనోనిగ్రహము వలన లోపలి విషయములను తెలిసికోనేశక్తి (యో. శా. ౧. ౨౦)

బౌద్ధ సిద్ధాంతములో చెప్పబడినవి ఇవన్నియు, ఆత్మా నాత్మలకు ఉండేభేదమును తెలుసుకొనేశక్తులుగాని, పద్ధతులు కావు.

యోగసిద్ధాంతముకూడ చాలవఱకు బౌద్ధసిద్ధాంతము మీదనే ఆధారపడి యున్నదని తెలిసికొనవలయును.

సాంఖ్యసిద్ధాంతములో యోగము, ఒకవైపున భగవంతుని ప్రవేశపెట్టుచు మఱొకవైపున భగవంతుడు లేడు అనే బౌద్ధ, జైన మతములను ప్రవేశపెట్టుచున్నది. (హరిదాస్ భట్టాచార్యగారి - వ్యాసము. Cultural Heritage of India Page 330)

## పతంజలి యోగశాస్త్రము

భారతదేశములోని జ్ఞానమునకు సంబంధించిన సిద్ధాంతములలో యోగము చాలాముఖ్యమైనది.

ఆరుసిద్ధాంతములుకూడ, ప్రకృతి, సంబంధమైన స్వభావము, తలంపులను గుఱించి విమర్శించి యున్నవి. జీవాత్మ పరమాత్మలకు ఉండే సంబంధమును గుఱించికూడ విమ

ర్శించినవి. సంసారబంధ విముక్తిని గురించి కూడ పరిశీలించినవి.

అయినప్పటికిని, ప్రతిసిద్ధాంతమును, ఏవో కొన్ని ముఖ్యాంశములను గురించి ప్రత్యేకముగా బోధించి యున్నది. కాని, ఒక విషయములో మాత్రము, అన్ని సిద్ధాంతములును, సమానముగా, ఏకాభిప్రాయముతో నున్నవి. అది తత్త్వజ్ఞానమును గురించి. అనగా, అది పరమాత్మ జ్ఞానము.

మనపూర్వులు, దీనినిగురించి ఎక్కువ పరిశీలనచేసి, సత్యమును కనిపెట్టినారు. ఎన్ని పరీక్షలుచేసినా, ఎన్ని న్యాయసిద్ధాంతములను ఉపయోగపరచినా, ఆ సత్యము యొక్క స్వభావమునకు సంబంధించిన జ్ఞానమును మాత్రము ఇయ్యగలవుగాని, ఆ సత్యమును (పరమాత్మను) పొందడమునుగురించి చెప్పజాలవు.

### యోగశాస్త్రముయొక్క ఉద్దేశము

తత్వజ్ఞానమును పొందుటకు, ఏయేశక్తులు ఉపయోగపడునో, వాటి నన్నిటిని అభ్యసించుటయే యోగశాస్త్రముయొక్క ముఖ్యోద్దేశము.

ఉపనిషత్తులు యోగశాస్త్రముయొక్క ఉపయోగమునుగురించి, విస్తారముగా చెప్పియున్నవి. 'బుద్ధిని ఉప

## యోగ సూత్ర సిద్ధాంతము

యోగించినమాత్రముచేత పరమాత్మజ్ఞానమును యోగులు పొందజాలరు' అని ఉపనిషత్తులు బోధించుచున్నవి.

ఈవిషయమై, అనేకసాధనములు, శిక్షణలు ఉండినవి. వాటిలో ఏదో ఒకపద్ధతిని, యోగము ఎన్నుకోవలసి ఉన్నది. వాటిలో సాంఖ్యసాధనము న్యాయముతో కూడుకొని యున్నది. గనుక యోగము దానిని అవలంబించినది.

సాంఖ్యులు, వారివైపున, యోగమునకు సంబంధించిన, సాధనాభ్యాసములను, (శిక్షణలను) వారి సిద్ధాంతము లోని భాగములుగా అవలంబించియున్నారు.

ఈ సమానగుణముచేత, అవి రెండును ఒకటేయని తలచబడుచున్నవి. యథార్థములో వాటి రెంటిమధ్య సాధనములను గురించియు, తత్త్వములను గురించియు చాలాభేదము లున్నవి. కాబట్టి వాటిని భిన్నములుగానే భావించవలెను.

### విషయములు

ప్రపంచములోని విషయములు, వస్తువులు అనేక రకములుగా నున్నవి. ప్రతినిమిషము క్రొత్తవస్తువులు

పుట్టుచున్నవి, ఉన్నవస్తువులు నశించుచున్నవి. బాగా ఆలోచించి చూచిన యెడల, ఈపుట్టుకలు, నాశములు నిజమైనవికావు. అసలు వస్తువులకు నశించడమనేదిలేదు. క్రొత్తవస్తువులకు పుట్టడమనేదిన్ని లేదు.

మనము చూచే మార్పులు అన్నియు, వస్తువులలో వస్తువులు కలియుటచేత, పుట్టినట్లు, నశించునట్లును, కనిపించుచున్నవేకాని, అవి నిజముకావు.

ఈవిధముగా పరిశీలించుటలో కొన్ని విషయములను మూలములుగా ఎత్తుకొని, మిగిలినవాటి నన్నిటిని వాటి యొక్క (Manifestations) విభూతులుగా భావించ వలసియున్నది.

## గుణములు

సాంఖ్యులు, సత్వము, రజస్సు, తమసు అను గుణము లను మూలాధారములుగా చేసికొని మిగిలిన వాటి నన్నిటిని వాటిమీద ఆధారపరచినారు.

## ప్రకృతి

ఈమూడుగుణములు సమానముగా తులతూగుచున్న యెడల అది 'ప్రధానము' లేక 'ప్రకృతి' అని పిలువ బడుచున్నది.

ఈ సమత్వము చెదరిపోయినపుడు రెండు గుణములు అడుగంటి, ఒకటిమాత్రము దానిబలముచేత పైకి ఉబుకు చున్నది. అటువంటి సమయమున అది 'మహత్' అని పిలువబడుచున్నది.

## సత్ - అసత్

అవి సమముగా నున్నంత కాలము, అవి యథార్థముగా నున్నవా? లేవా? అనే సంగతి చెప్ప సాధ్యముకాదు. ఆకారణముచేత ఆస్థితి "నిస్సత్తసత్త" అనబడుచున్నది. ఈసమానత్వము చెదరిపోయి వాటిలో నొకటి పైకివచ్చి నపుడు, ఏది పైకివచ్చెనో, ఏవి అడుగునకు పోయినవో, వాటి భేదమును కనిపెట్టుట వెంటనే సాధ్యమగుచున్నది. దీనిపేరు 'అస్తిత' అందురు.

సముద్రముమీద ఒకవిధమైనకదలికపుట్టినపుడు చిన్న చిన్న (Ripples) సుళ్లు, అలలు, కెరటములు బయలు దేరుచున్నవని మనము చూచుచున్నాముకదా! అదేవిధ ముగా మహత్తులోనుంచి, అహంకారముపుట్టుచున్నది. దానికి అస్మిత లేక, (నేను - నాది) అని మఱియొక పేరు గూడ ఉన్నది.

అహంకారము - నేను - నాది, అనేభావము. అహంకారము ౧. సాత్వికాహంకారము, ౨. రాజసాహంకారము 3. తామసాహంకారము. అనిమూడువిధములు.

తామసాహంకారములోనుండి, అయిదుతన్మాత్రలును పంచభూతములును, పుట్టుచున్నవి.

సాత్వికాహంకారములోనుండి, కర్మేంద్రియములు అయిదు, జ్ఞానేంద్రియములు అయిదు మనస్సు ఒకటి మొత్తము పదకొండు ఇంద్రియములు పుట్టుచున్నవి.

రాజసాహంకారము పై రెండింటిని వృద్ధిచేయుటకు సహాయముచేయుచున్నది.

ఈ భూతములలోనుంచి జగత్తుఅంతా సృష్టించబడుచున్నది.

## ఆత్మ, ప్రాణము, పురుషుడు

ఈ జగత్తుఅంతా, ప్రాణములేనిదై మొద్దుగా నుండుటచేత, దానిని ఉపయోగించుటకు, అనుభవించుటకు, ఎవరైన ఒకరుండవలెను. కనుక దానికి పురుషుడు ఏర్పడినాడు. పురుషుడు, అనగా ఆత్మ లేక చిచ్ఛక్తి. ఇది విషయములకంటె వేరైనది.

## జీ వా త్మ

జీవాత్మలు లెక్కలేనన్ని యుండుటచేతను, వాటి అనుభవములుకూడ లెక్కలేనన్ని ఉండుటచేతను, పొందునట్టి దేహముకూడా పంచభూతములతో చేయబడినదై ఆత్మకు పనిచేయుసాధనముగా ఏర్పడియున్నది.

## మనుష్యునిదేహము

మనుష్యుని దేహము ఏలాగు వేటితో చేయబడినదో పరీక్షించెదము.

౧. మొదట శరీరము ఉన్నది. ౨. భూతముల యొక్క పెద్దరూపములు ఉన్నవి. ౩. అయిదుతన్మాత్రలు ఉన్నవి. ౪. పిమ్మట అహంకార మున్నది. పైమూడింటికి అహంకారము పుట్టినిల్లు ౫. తరువాత ఇంద్రియములు పదియు మనస్సుఒకటి ఉన్నది. ౬. అహంకారముపుట్టిన మనస్సు ఉన్నది. ౭. ఇవన్నియుచేరి ప్రకృతిగా ఏర్పడు చున్నవి.

పైనచెప్పిన వన్నియు, శరీరమునకు, వెలుపల నున్నప్పుడు, ప్రాణము లేకుండా ఉన్నవి.

కాని, అవి, చిత్ శక్తి, అనగా ఆత్మలోకలసి పని

చేయునప్పుడు, అనేకమైన పనులను చేయగలుగుచున్నవి.

మహత్ లేక మోహము అనునది, వెలుపల ప్రాణము లేకుండా ఉన్నప్పటికి, భేదమును కనిపెట్టేశక్తిని పొంది, నిశ్చయించే శక్తిని కలిగిఉన్నది. దీనికే, బుద్ధియని మఱి యొక పేరు ఉన్నది.

అహంకారము, వస్తువులయొక్క రూపమును, స్వభావమును, ఏర్పాటుచేయుచున్నది.

ఇంద్రియములు మనస్సు, వెలుపలినుంచి భావములను తీసికొని వాటిని బుద్ధికి ఇచ్చుచున్నవి.

## సంతోషము - బాధ.

బుద్ధిలో సత్వగుణము ఎక్కువగా నుండిన అది సంతోషమును కలుగజేయును,

బుద్ధిలో రజోగుణము ఎక్కువగానుండిన అది బాధను కలుగజేయును.

బుద్ధిలో తామసగుణము ఎక్కువగానున్న యెడల, మోహము లేక అజ్ఞానము కలుగుచున్నది.

సుఖము, దుఃఖము, అజ్ఞానము, ఈమూడును గుణములలోనుంచి పుట్టుచున్నవి. పైన చూపించినవిధముగా

ఇవి బుద్ధిలోనుంచి పుట్టుచున్నప్పటికిని, పురుషుడు తానే కర్త అనీ తానే భోక్త అనీ తలంచుచున్నాడు.

విషయములన్నియు నిజములుగా కనబడుట వట్టి భ్రాంతి.

## కైవల్యము.

సాంఖ్యములో కైవల్యమనేది పురుషుడు (జీవాత్మ) దేహేంద్రియాదులకంటె, వేరైన వాడననీ, తాను మరి యే ఇతరమైనదానివల్ల అంటబడననీ, తెలిసి కొన్నప్పుడే లభించును. ఈసాంఖ్యసూత్రము లన్నింటిని యోగశాస్త్రము చర్చించి ఉన్నది. వీటినన్నిటిని, యోగ శాస్త్రముగాచర్చించలేదని కొందరు ఆక్షేపించియున్నారు. కొన్ని ముఖ్య అంశముల గురించి ఇక్కడ అక్కడ చర్చించుటవలన, ఆ ఆక్షేపణ సరికాదని బోధపడుచున్నది.

సాంఖ్య సిద్ధాంతమును పునాదిగా జేసికొని యోగ సిద్ధాంతము దానిమీద కట్టబడిన దని, మనము చెప్ప వచ్చును.

## జగత్తు – భ్రాంతి

జగత్తులోని వేరు వేరు వస్తువులు అన్నియు, అజ్ఞానమువలన, భ్రాంతివలన ఉన్నట్లు కనబడడమే కాని, నిజము

కావు అని, సాంఖ్యసిద్ధాంతము, యోగముకూడ దీనినే అవలంబించి ఉన్నది.

## భూత, భవిష్యత్, వర్తమాన కాలములు

భూతకాలము, భవిష్యత్ కాలములు రెండున్ను భావములుగాను, విగ్రహములుగాను, వర్తమానకాలములోనే, ఇమిడియున్నవి, అనగా అంతర్భాగమైయున్నవి.

ఇంతకుపూర్వము జరిగినసంగతులన్నియు నశించిపోలేదు. అవన్నియు ఆలాగేయున్నవి. మన దృష్టిఅంతా వర్తమానకాలముమీదనే ఉండుటచేత భూత భవిష్యత్కాలములకు సంబంధించిన సంగతులు అను భవపడవు, వర్తమానకాలముమాత్రమే మనకు కనబడుచుండును.

భూతకాలము, భవిష్యత్కాలము, సూక్ష్మరూపములలో నుండుటచేత కూడ, వర్తమానకాలపు సంగతులలోనే, మన దృష్టియంతయు ఉంటున్నది.

కఠోపనిషత్తు ౨ - ౧. లలో. ఈ క్రిందివిధముగా చెప్పబడి యున్నది. "భగవంతుడు, ఇంద్రియములను సృష్టించి, వాటిగుండా, మనస్సు బయటివిషయములను, తెలుసుకొనేలాగు చేయుచున్నాడు. ఆ కారణముచేతలోపల

నుండే భగవంతుని యింద్రియములు తెలిసికొనలేకుండా ఉన్నవి. ఇది మనయొక్క దురదృష్టము, అయినప్పటికిని, ఒక మంచిమాత్రము మిగిలియున్నది. దీనివలన స్థూల రూపము, సూక్ష్మరూపము, భూతకాలము, భవిష్యత్కాలము, మహత్తు అనగా, మోహములో, అణగిఉన్నవి అని తెలియుచున్నది. దీనిపేరే బుద్ధి అని చెప్పబడుచున్నది. అందఱు, అజ్ఞానముచేత, పరమాత్మను పొందలేక యున్నారు. బ్రహ్మలోకములోనికి పోయినవారుగూడ అజ్ఞానములోనే ఉంటున్నారు.

యోగముగూడా, అన్నిటికంటె యెక్కువ అయిన జ్ఞానము పొందుటను గుఱించి, మనము ఇప్పుడు ఆలోచించుటలేదు.

## యోగము

ఇతరశాస్త్రములవలె విషయములయొక్క లోపలి స్వభావమును, యోగముకూడ వెల్లడిచేయుటకు ప్రయత్నించుచున్నది. 'ఏవిషయములోనైనను ఏకాగ్ర చిత్తము నిలిపినయెడల, దానిమూలముగా ఆవిషయము నిజస్వభావమును, ఎక్కువభాగా తెలిసికొనుటకు సాధ్యమగుచున్నది' అని అందఱికిని తెలిసినవిషయమే.

## యోగులు

ఈవిధముగా మనసును నిగ్రహించినవారు యోగులు అనిపించుకొందురు. ఈ అర్ధములో ఈకాలపుశాస్త్ర (Science) పండితులనుగూడ యోగులు అని చెప్ప వచ్చును. కాని వీరు యంత్రములనుఉపయోగించి, లోపలి సత్యమును కనిపెట్టుచున్నారు. అంతమట్టుకు అది మంచిదేగాని, ఆపద్ధతి అసలుసత్యము కనిపెట్టుటలో ఎంతమట్టుకు ఉపయోగపడగలదో చెప్పజాలము.

## యోగసిద్ధాంతము

యోగసిద్ధాంతము, అట్లు కాదు. విషయములను పూర్తిగా పరీక్షించి, వాటియొక్క సత్యమును కనిపెట్టుటకు అవసరమైన పద్ధతులను, సాధనములను కనిపెట్టి, వాటిని స్థిరపరచి, సత్యమును కనిపెట్టగలము అనే నమ్మకముతో పనిచేయుచున్నది.

గొప్పఋషులు, దీనికి ఉదాహరణము అనదగును. యోగాభ్యాసము అడుగునపడిపోయిన ఈకాలములో గూడ, అక్కడక్కడ ఋషులు కొందఱున్నారు.

యోగము మూలముగా సత్యమును కనిపెట్టుటకు

వెలుపలి సాధనములుగాని, సహాయముగాని అవసరము లేదు. దీనికి కావలసినవి రెండు ౧. దేహావరణస్థిరత. ౨. మనస్సుయొక్క నిశ్చలత్వము.

నిజమైన యోగి, పయటఉండే ముసుగులను తీసి వేయ ప్రయత్నించడు. ఆపని శాస్త్రపండితుడు (Scientist) చేయుచున్నాడు.

యోగియన్ననో, విషయమును, లోపల, వెలుపల గూడ, జ్ఞానమును కప్పియున్న అజ్ఞానమును తొలగించి, నేరుగా మూలవస్తువునే చూచుచున్నాడు.

## శబ్దతన్మాత్ర

వస్తువులను, ఉన్న వాటిని ఉన్నట్లుగా చూచెదము. సర్వత్ర వ్యాపించియుండే శబ్దతన్మాత్ర వినుటకు సాధన మైన చెవిలో నున్నది. ఏ ధ్వనియైనను బయలు పుట్టిన వెంటనే చెవిలో పడుచున్నది. అదే ధ్వనిని అంద జేయుచున్నది.

ఇతరేంద్రియములుకూడ ఇదేవిధముగా పనిచేయు చున్నవి.

యోగభాష్యముమీద, వాచస్పతి వ్రాసిన వ్యాఖ్యా నములు ఈవిషయము చర్చించియున్నారు.

యోగమువల్ల, చెవులు, శుభ్రముచేయబడి బాగా, స్పష్టముగా శక్తిగలిగి ఉండేలాగగుచున్నవి.

రేడియోయంత్రము, మనకు స్వాభావసిద్ధముగా విను టకుఉండేశక్తిని, ఏవిధముగా వృద్ధిచేయుచున్నదో అదే విధముగా యోగముకూడ చేయుచున్నది. వినేటటువంటి చెవులకు, ఆకాశమునకును మధ్యనుండే సంబంధముమీద మనస్సును నిలుపుటచేత రెంటింటిమధ్యన ఉండే ఆటంకము తొలగిపోవుచున్నది. ప్రతిశబ్దము చెవులకు వినబడేలాగు చేయబడుచున్నది. దీనినే దివ్యశ్రోత్ర మందురు.

శాస్త్రము(Science) క్రమేణా యోగశాస్త్రముతో సమానమగుచున్నది. ఈవిధముగా యోగము సాధ్యమైన పనియే యని ఋజువు చేయుచున్నది.

దీనినిబట్టి, యోగముగుండా, దివ్యజ్ఞానమును పొందు టకు సాధ్యమని చెప్పవచ్చును.

'భూత భవిష్యత్ వర్తమానకాలము లను మూడు కాలములను, వర్తమానకాలము, తనలోనే ఉంచుకొను చున్న' దని యోగులుచెప్పుచున్నారు.

## సూ క్ష్మ రూ ప ము లు

ఆకారణముచేత, ఏ ఒకవిషయమునైన ఏర్పాటు

చేయుటమీద మనసు నిలిపినయెడల అది భూతభవిష్యత్ కాలములలో గూడ సాధ్యమగుచున్న దని చెప్పు చున్నారు.

ఏ, కదలిక (Motion) కూడ, పూర్తిగా నశించదు. దాని గుఱుతులను, అదిపోవునపుడు వెనుకనుండే సూక్ష్మ రూపములమీద విడిచిపోవుచున్న ది. అవి మన సూక్ష్మ శరీరములమీద, అచ్చువేయబడినట్లు ఉంచబడి ప్రాణ వాయువు (జీవాత్మ) తోకూడా పోవుచుండును.

కాబట్టి మనపూర్వజీవితములు, మనతోకూడానే సూక్ష్మరూపములతోవచ్చి ఈజీవితములోగూడ అనుభవ మునకు వచ్చుచున్నవి. యో. శా. ౪. ౯—౩. ౧౮

ఈవిషయమై విష్ణుపురాణములో అవత్స, జైగిషవ్య అనువారు ఇద్దరిమధ్య జరిగిన సంవాదములో వివరముగా చెప్పబడియున్న ది.

## తత్వజ్ఞానము - యోగము

తత్వజ్ఞానమును పొందుటకు సాధనములుగా ఈక్రింది వాటిని యోగశాస్త్రముచెప్పియున్న ది.

యోగాంగములు: ౧. యమ ౨. నియమ ౩. ఆసన,

౪. ప్రాణాయామ ౫. ప్రత్యాహార ౬. ధ్యాన ౭. ధారణ ౮. సమాధు లని ఎనిమిది.

మనుష్యుని గుణములు, నడత మొదలైన వన్నియు, వీటిలో చేరియున్నవి. ఈసాధనములన్నియు మనసులో నుండే కల్మషమును తొలగించి జ్ఞానమునిచ్చునట్లు చేయుటకు ఉపయోగించును.

మనస్సులోని మలినమును తొలగించి మనోనిగ్రహము చేసినవెంటనే, విషయములయొక్క నిజస్థితిని తెలిసికొనుటకు తగినశక్తికలిగి జ్ఞానము ఉదయించుచున్నది. ఇది ఏలాగు సాధ్యమని ప్రశ్న వేయవచ్చును.

అందుకు జవాబు:-సాంఖ్యసిద్ధాంతములో చెప్పబడిన బుద్ధి అనే ఇంద్రియములో, ప్రపంచములోని అన్నివిషయములు బయటికి కనబడకపోయినప్పటికిని లోపల దాగి ఉంటున్నవి.

ఇది సత్యబుద్ధి అయినయెడల జగత్తులోని అన్నివస్తువుల సృష్టికి అదేకారణమగుచున్నది.

ఆలాగయినయెడల కొన్నిసంగతులు దానివల్ల కనిపెట్టబడవు. ఇందుకుకారణమేమి?

ఆ కారణము యోగసూ. ౪—3 లోనున్నది.

ధర్మాధర్మములు రెండుగూడ బుద్ధిని తమయిష్టము వచ్చినట్లు నడిపింపజాలవు.

యోగాభ్యాసముచేత, చిత్తశుద్ధి చేయబడినపుడు తత్వగుణము దానంతటఅదియే పనిచేయప్రారంభించును. చెఱువులో నుండేనీళ్ళు 'కట్ట'యొక్క అడ్డముతీసివేయుటతోనే, ఏలాగు ప్రవహించుచున్నవో, ఆలాగే మనస్సులో నుండే వాసనలు తొలగించబడినతోడనే సత్వగుణము సర్వత్ర ప్రవహించి పనిచేయుచున్నది.

## యమ - నియమములు

అహింస, సత్యము, శుచి, మొదలైనగుణములు రజోగుణమును, తమోగుణమును, అణచివేయుటకును, సత్వగుణమును వృద్ధిచేయుటకును శక్తికలిగియున్నవి.

వేదములలోని కర్మకాండకు సంబంధించినపనులన్నియు యమమునకును, నియమముకును, సంబంధించినవే అయి ఉన్నవి.

ఈరెండును పతంజలి యోగశాస్త్రములో ఒక్కొకటి ఆవేయాజ్ఞవల్క్యములోను, మండలబ్రాహ్మణోపనిషత్తులోను పదేసిభాగములుగా విభజింపబడినవి. అయిదుభాగములుగా విభజింపబడియున్నది. అంతకంటె యెక్కువగా

గూడ విభాగింపవచ్చును. ఇవి అన్నియుగూడ మనుష్యుని వృద్ధిలోనికి తీసికొనిరాగల గుణములు.

## ఆ స న ము

యోగాభ్యాసములో ఆసనము, అనగా, కూర్చుండు విధానము చాలాముఖ్యమని చెప్పబడియున్నది. హఠ యోగప్రదీపికలోను, శ్రుతికోపనిషత్తులోను, ఆసనమునకు ముఖ్యస్థానము ఈయబడియున్నది.

దీనికి కారణమేమనగా, అవయవములకు, ఇంద్రియములకు, దేహము ఉనికిపట్టు అయియున్నది కనుక, వాటి నన్నిటిని స్వాధీనముచేసికొనుటకు దేహము నిలకడగా నుండుట అవసరమైయున్నది.

ఆసనములు ఎనిమిది విధములు. ఇవి ఎనుబదిగా విభాగింపబడియున్నవి. ఇంతకంటె యెక్కువగా గూడ ఉన్నవి.

వ్యాసుడు యోగసూత్రములమీద వ్రాసినభాష్యములో వీటిని ౧౧ విధములుగా భాగించినాడు. ౧ పద్మాసనము. ౨. భద్రాసనము 3. వీరాసనము మొదలైనవి పదునొకండు.

## ఆ స నో ద్దే శ ము లు

౧. దేహము స్వాధీనములో ఉంచుకొనుట ౨. ఆహార మును అరిగేలాగుచేయుట. ఈ రెండు ముఖ్యోద్దేశములు.

దేహములోనుండే అనేకజబ్బులు ఆసనముల మూలముగా బాగగుచున్నవి.

## అ భ్యా స యో గ ము

మనోనిగ్రహము చేయగోరువానికి, దేహములోనుండు వికారమున్నియు, నశించి, దేహము సరియైనస్థితిలో నుండుట అవసరమైయున్నది. దానికి అనేకరకములైన ఆసనములు అవసరమైఉన్నవి. యోగము ఏ కొద్ది మందికో ఉపయోగించునుగాని ఇతరులకు కాదు అని తలచకూడదు. ప్రతివాడును యోగమును అభ్యసించుట వలన ఇహపరలోకములలో సుఖము కలుగును.

## ప్రా ణా యా మ ము

యోగసంబంధమైన ఆసనముల నభ్యసించుటచేత, దేహము పరిశుభ్ర మగుచున్నది.

౨. దేహమంతటవ్యాపించి, అన్నిపనులకు ఆధారమైన ప్రాణమును నిగ్రహించుటకు శక్తికలుగును.

3 ఇవి దేహముయొక్క వేఱువేఱు భాగములమీద వేఱువేఱువిధములుగా పనిచేయుచున్నవి. అందుచేత ఆసనములు కొన్ని అయిదుభాగములుగాను కొన్ని పది భాగములుగాను భాగింపబడియున్నవి.

అన్నిపనులకును, ప్రాణమే మూలకారణమని బాదరాయణులు చెప్పియున్నారు.

సాంఖ్యయోగ పండితులు బాదరాయణులవారి అభిప్రాయముతో ఏకీభవించరు. ప్రాణము అయిదు కర్మేంద్రియములకును, అయిదు జ్ఞానేంద్రియములకును వెనుక, అన్నిటికి సమానముగా నుంటున్నది. ఇది ఒక చిలుక పంజరమునకు పోల్చబడినది.

పంజరములో నుండేపక్షులన్నియు నొకపర్యాయము కలవరపడి కదలుటచేత, పంజరముకూడ ఏలాగు కదలుచున్నదో, అదేవిధముగా ఇంద్రియములన్నియు కలిసిపని చేయునపుడు, దేహములో ఒకవిధమైన కదలిక పుట్టుచున్నది. దీనిపేరే ప్రాణము.

ప్రాణము నిగ్రహించబడినపుడు, దేహములో అన్ని అవయవములును నిగ్రహించబడుచున్నవి.

ఇది సాంఖ్య యోగుల సిద్ధాంతము.

## ప్రాణాయామము యొక్క యుద్దేశము

కామక్రోధములను, మనుష్యునియొక్క పాపముల నన్నిటిని నశింపజేయుట ఒకఉద్దేశము.

పాపములు సరియైనజ్ఞానమును పొందకుండాచేయు చున్నవి, కామక్రోధములచేత మనస్సును చలింపజేయు చున్నవి. చలింపజేసి అప్పటికప్పుడు పూర్తిగా నశించి పోవు పైయుద్రేకము అణగి పైకి కనబడకపోయినప్పటి కిని, మనస్సు లోపలికిపోయి, అణగియుండి, అనేకవిధము లైన చెడుకార్యములను చేయించుచున్నది.

రజోగుణము ఎక్కువగానుండుటచే, ఈకామక్రోధ ములు ఎక్కువగా పనిచేయుచుండును. అటువంటి లోపములను తొలిగించుటకు ప్రాణాయామము సాధన ముగా నుండును.

శ్రుతులలోగూడ అనేకములైన పాపములను తొలిగిం చుటకు ప్రాణాయామము సాధనముగా చెప్పబడియున్నది.

ముక్కులు చెవులు మార్చిమార్చి మూయుటచేత పాపములు ఏలాగునశించును అని ప్రశ్న వేయవచ్చును. అజ్ఞానముచేత అట్టిప్రశ్న వేయబడుచున్నది. దాని నిజమైన ఫలితము అభ్యాసముమీద తెలియును.

భగవద్గీత అ ౮ శ్లో ౨౯ లో ఈవిషయమై చెప్పబడి యున్నది.

## ప్రాణము - నిగ్రహము

జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములకు, ప్రాణమే మూలాధారమని చెప్పబడియున్నది. ప్రాణము నిగ్రహించగలిగిన యెడల, ఇంద్రియములను విషయములలోనుంచి మఱలించుట సులభమైన పని యగును. అప్పుడు మనస్సునకు నిశ్చలత్వము కలుగును. గీతాశాస్త్రము, దేహనిగ్రహము, ప్రాణనిగ్రహము, రెండుకూడ అవసరమని చెప్పుచున్నది. ఈరెండింటిని అభ్యసించుటచేత, యోగులు దేహము లోనుండే జబ్బులనన్నిటిని తొలగించి అఖండమైనశక్తులను పొందుచున్నారు. యోగమునందాసక్తికలవారు సాధారణముగా హఠయోగమును అవలంబించెదరు. కారణమేమంటే, దానిగుండా అతిశీఘ్రకాలములో అనేకములైన గొప్పశక్తులు లభించును. గనుక, ఈకారణముచేతనే రాజయోగము క్రమేణ క్షీణించినది.

యోగులవేషము వేసికొని కొందఱు స్వలాభము నిమిత్తము హఠయోగమును ఉపయోగించు చుండుటచేత, యోగులు దొంగలుగా భావించబడినారు. ఈకాలములో

కూడ, యోగమనగా అందరానిదిగాను, దేవతాశక్తి గాను చెప్పబడుచున్నది. వైద్యమనికూడ చెప్పబడు చున్నది. అనగా యోగులు అంటే గొప్పవైద్యులు అనుకొంటారు.

ఇవిఅన్నియు పొరపాటుతోకూడిన అభిప్రాయములు. యోగులకు ఇట్టివన్నీ ఉండనవసరములేదు.

పతంజలి ఈవిషయమైప్రత్యేకించి అనగా, "యోగి దేవతాశక్తులను పొందుచున్నాడు, అని చెప్పగూడదు" అనిచెప్పినాడు.

యోగమునకు సంబంధించినశక్తి సరిగా ఉపయోగించినయెడల లాభకరముగానే ఉండునుగాని, తప్పుడు పనులకు ఉపయోగించినయడల అపాయకర మగును.

ఈకారణముచేత గీత వాటిని ఖండించుచున్నది. ఈకారణముచేతనే పతంజలి, రాజయోగమును గుఱించి చెప్పుచు, వైరాగ్యమును గుఱించి ఎక్కువగా చెప్పి యున్నాడు.

## ప్రాణాయామము - నాలుగుభాగములు

పతంజలి ప్రాణాయామమును నాలుగుభాగములుగా భాగించినాడు.

౧. రేచకము. అనగా శ్వాసను బయటికివిడుచుట

౨. పూరకము. అంటేగాలిని లోపలికి పీల్చుకొనుట

౩. కుంభకము. అంటే గాలిని లోపల నిలుపుకొనుట

౪. కేవలకుంభకము. పై మూడింటికిఉండే, నిర్బంధములు ఏవియుగూడ లేనిది.

మొదటి మూడింటికిఉండే నిర్బంధములు ఏవనగా, ఎన్నిమార్లు గాలి లోపలికి పీల్చుకొనవలెనో చెప్పబడి యున్నది.

ఎంత వేగముగా గాలిని వెలుపలికి విడువవలెనో, చెప్ప బడినది. ఎంతకాలము గాలినిలోపల ఉంచుకొనవలెనో చెప్పబడియున్నది. నాల్గవదానికి ఈపరిమితములు ఏవి యు లేవు.

## ప్ర త్యా హా ర ము

ప్రత్యాహారమనగా, ఇంద్రియములను విషయములలో నుంచి మఱలించుట.

ప్రాణాయామ, ప్రత్యాహారములు రెండుగూడా మన స్సును నిగ్రహించుటకు అవసరమైయున్నవి.

ధారణ, ధ్యానము, సమాధి, మూడున్ను యోగ

సోపానములు. దినచర్యలో గూడ యోగముగుండా ఎంత శక్తి లభించుచున్నదో ఇంతకుముందు చెప్పియున్నాము.

యోగాభ్యాసముచేత, ఆరోగ్యము, పరిశుభ్రత నిశ్చలత్వము లభించును. ఇంతేకాదు అన్నిటికన్న పైన ఉన్న సమాధి పొందునపుడు, పైనచెప్పినవన్నియు ఆటంకము లగును.

జైగిషవ్యుడు, ఈ దేవతాశక్తులన్నిటిని నిరాకరించి ఉద్రేకముల నన్నిటిని అణచుటమూలముగా సిద్ధిపొందినాడు.

సమాధిమూలముగానే సత్యము కనుగొనబడుచున్నది.

పతంజలి రెండవసూత్రము దీనివిషయమై స్పష్టపఱచుచున్నది.

యోగమునకు అనేక అర్థములున్నవి.

మొదటిఅర్థము కలియుట లేక సంయోగము. ౧ గీతాశాస్త్రములో యోగమనగా దుఃఖమును తొలగించునది అని చెప్పబడియున్నది.

౨. పైనఉండే ఆత్మమీద మనస్సును నిలుపుట అని మఱియొక అర్థము.

3. మనోవికారముల నన్నిటిని నిగ్రహించి ఉద్రేకము లేకుండా చేయుట.

౮. ఉపనిషత్తులలోను, యోగియాజ్ఞవల్క్యములోను జీవాత్మ పరమాత్మ ఐక్యము అని చెప్పబడినది.

౯. సూత్రకారుడు, యోగమునకు చిత్తవృత్తి నిరోధము, అనగా, మనోనిగ్రహము అని చెప్పినాడు.

## చిత్తవృత్తి నిరోధము

చిత్త మనగా, విషయములను గురించి, పరిశీలించే, దేహములోను డు ఒక ఆయుధము. దానియొక్క పనులు అనేకములుగా నున్నవి. యోగము వాటిని నిగ్రహించు నది.

మనస్సు ప్రకృతియొక్క ఒక రూపముగనుక అదిమూడు గుణములతో కూడుకొనియున్నది. అవి మూడురూప ములుగా పనిచేయుచున్నవి ౧. మూఢము ౨. క్షిప్తము ౩. విక్షిప్తము. మూడువిధములు అనునవి ఆమూడురూప ములు. అందులో—

౧. మూఢత్వము. తామసగుణమువల్ల కలుగుచు న్నది.

౨. క్షిప్తము. అనగా మనస్సు చెదరిపోవడము. రాజసగుణమున కలుగుచున్నది.

౩. చంచలత్వము, సత్వగుణమువలన కలుగుచున్నది.

## యోగ సూత్ర సిద్ధాంతము

రెండుగుణములు అణగియున్నప్పుడు ఒకటి పైకివచ్చి పనిచేయుచుండును. కాని ఇవి యేవియుకూడ యోగములు కావు.

ఈమూడింటిలో సాత్వికముమాత్రము అజ్ఞానమును, దానికి సంబంధించిన సుఖదుఃఖములను విడిచి పనిచేయునపుడు యోగమునకు సమానమగుచున్నది.

కర్మమీది అభిలాష కూడ పోయియుండవలెను.

విక్షిప్తము. సాత్వికగుణముతో కూడుకొన్నదైయున్నప్పటికిని, అది, అశాశ్వతమైనది అగుటచేత, మారుచుండుటచేతను, దానిని యోగమని చెప్పకూడదు.

## యోగము

౧. ఏకాగ్రత, ౨. పూర్తిఅయిన నిగ్రహము. ఇవి రెండును యోగమునకు ఉండితీరవలెను.

ఆరూపముయొక్క విషయము, సందేహముతోగాని, భ్రాంతితోగాని కూడుకొనకుండా ఉండవలయును.

౨. నిరోధమనేది, రూపమనేది లేకుండా ధ్యానము చేయుట. ధ్యానములో తెలిసికొనేవాడు, తెలిసికొనబడే విషయము రెండును కలిసి ఐక్యమైపోవును.

ఏకాగ్రతకు నాలుగుమెట్లున్నవి.

౧. సవితర్కము, అనగా, విషయము, దాని గుణములతో కూడ ధ్యానము చేయబడుచున్నది.

౨. నిర్వితర్కము. విషయము మాత్రమే ధ్యానము చేయబడును.

౩. సవిచారము.

౪. నిర్విచారము. పైనచెప్పినట్లే సూక్ష్మరూపముతో ఇక్కడకూడ జరుగును.

౫. సానందము. ఇక్కడ బుద్ధిలో నుండే సాత్వికగుణము ధ్యానమునకు ముఖ్యమైనదిగా నుండును.

౬. సాస్మిత. ఇక్కడ సత్వగుణము మాత్రమే మనస్సును ఆవరించియుండును. ఇవి ముఖ్యమైనవి, వీటిని అనుసరించుటవలన, అద్భుతములైన శక్తులుగలుగును.

విముక్తి బొందిన తరువాత పైకిపోవుటకు కోరే యోగి, ఇక్కడ ఆగడు. రూపమును సాధనముగా చేసికొనకుండానే ధ్యానములోనికి పోవుచున్నాడు.

సూక్ష్మశరీరముమీద మనస్సు నిలుపబడేయెడల, ప్రకృతితో సహా సూక్ష్మరూపములో నుండువాటిని సమస్తమును తెలిసికొనుచున్నాడు. ఈధ్యానము శాశ్వతమైన యెడల, అదివరకు మనస్సులోనుండే వాసనలు

రూపము మూలముగా ధ్యానముచేయుటచేత, నశించి పోవుచున్నవి. ఇది మఱల దాని పనులన్నియు అడ్డగించ బడినపుడు, రూపములేని అసంపూర్ణజ్ఞాతసమాధిలోనికి తీసికొని పోవుచున్నది.

దీనికి సాధనము, ఏవిధమైన కోరికగాని, ఉద్రేకము గాని లేక ఉండుటయే.

ఈ రూపముతో సంబంధములేని సమాధి రెండు విధములు.

౧. స్వభావసిద్ధమైనది.
౨. ప్రయత్నముచేత సంపాదించబడినది.

౧. దేవతలు, ఈసమాధిని, స్వభావసిద్ధముగా కలిగి యుందురు. కాని, అది శాశ్వతమైనది కాదు.

౨. యోగులు, అదే సమాధిని, అభ్యాసముచేత పొందుచున్నారు. ఇది యోగులవల్ల తల్లితో సమాన ముగా చూడబడుచున్నది.

ఉత్సాహముచేతను, జ్ఞాపకముచేతను ఆత్మకు, ఆత్మ కానిదానికి, ఉండేభేదమును కనిపెట్టగల జ్ఞానముచేత ఈసమాధిని తల్లితో సమానముగా జూచుచున్నారు.

ఈ ఆఖరుసమాధిలో కామక్రోధములయొక్క ఉద్రే కమును విసర్జించి, చాలాకాలము అభ్యాసముచేసిన

యెడల, అసంప్రజ్ఞాత సమాధి లభించు చున్నది

కట్టెలోని నిప్పు, క్రమేణ చల్లారినట్లు, పైన చెప్పబడిన అభ్యాసముచేత, క్రమేణ, మెల్లమెల్లగా కామక్రోధములు నశించుచున్నవి. చాలా అభివృద్ధిలోనికి వచ్చినపుడు సమస్తమును తెలుసుకొనేశక్తియును సమస్తమును జయించగల శక్తియును పుట్టుచున్నవి.

వీటినికూడ లెక్కచేయనివారు శ్రేష్ఠమైన ఆత్మను పొందుచున్నారు.

## కైవల్యము

ఇది, యోగిని, కైవల్యములో ప్రవేశపెట్టుచున్నది. దానివలన వానిఆత్మ మరిదేనిచేత కూడ అంటబడక నిశ్చలముగా స్వతంత్రముగా నిలిచియుంటున్నది.

పతంజలి యోగసిద్ధాంతము ప్రకారము ఇదియే యోగముయొక్క గమ్యస్థానము.

## యోగము నాలుగు విధములు

౧. హఠయోగము ౨. మంత్రయోగము ౩. లయయోగము ౪. రాజయోగము. ఈ విభాగము వారి వారి స్వభావముల ననుసరించి చేయబడినది.

## హఠయోగము

౧. ఆసనము, ౨. ప్రాణాయామములు హఠయోగము నకు పునాదుల వంటివి.

హఠయోగము అనేకరూపములు కలిగియున్నది.

హఠయోగముయొక్క సారాంశము, ఈక్రింది విధముగా నున్నది.

ఇడ, పింగళ, అనే రెండు నరము లున్నవి. ఒకటి వెన్నెముకకు ఎడమప్రక్కను, రెండవది కుడిప్రక్కను ప్రవహించుచున్నవి.

ఇవి రెండును మూలాధారమునుంచి బయలుదేరి పైన చెప్పినట్లు ప్రవహించుచున్నవి.

మూలాధారములో నుంచి సుషుమ్నానాడి అనే చిన్న కాలువ వెన్నెముక మధ్యగుండా పోయి తలలో నుండే బ్రహ్మరంధ్రముతో కలియుచున్నది. మూలాధారములో కుండలిని అనే నిలువజేయబడిన శక్తి (Energy) ఉన్నది.

ప్రాణాయామము చేయుటచేత కుండలిని అనే శక్తికి ఒకమార్గము ఏర్పడి, అది మెల్ల మెల్లగా సుషుమ్నానాడి గుండా తలలోనికి చేరుచున్నది. ఆలాగుచేరినపుడు యోగికి జ్ఞానజ్యోతి కలుగుచున్నది.

హఠయోగము అనేకరూపములను దాల్చుచున్నది. శరీరములోని కండలను నిగ్రహించుచున్నది. ప్రాణాయామముతో కూడ వేలువేలు హఠయోగరూపములను అభ్యాసముచేయుటచేత, యోగి, ధారణ అనే మెట్టుకు చేరుచున్నాడు.

ధారణలో నున్నవాడు, బొటనవ్రేలు మొదలు, తల వఱకు శరీరములో అనేక భాగములలోనుండే ప్రాణము మీద, మనస్సు నిలిపి ధ్యానముచేయుచున్నాడు.

శరీరములోనుండే పంచభూతములయొక్క అధిష్ఠాన దేవతలను, ధ్యానముచేయుచు, పంచభూతములను పరిశుభ్రముచేయవలసియున్నది. పిమ్మట, కుండలినీశక్తి ఆరుచక్రములగుండా, పైతట్టు పోవుచున్నది. ఆ మూలాధారమునకు పైగానున్న స్వాధిష్ఠానము దగ్గర ప్రారంభించి తలలోనుండే సహస్రారముదగ్గర అంతమగుచున్నది. మధ్య మెట్లు ఏవనగా ౧. మణిపూరము, ౨. అనాహతము, ౩. విశుద్ధము, ౪. ఆజ్ఞ, అనునవి. ఈనాలుగును వరుసగా

౧. బొడ్డు, ౨. గుండె ౩. గొంతు ౪. కనుబొమ్మలమధ్య భాగము అను నీ నాలుగు చోటులను ఉంటున్నవి.

యోగి, సహస్రారము యొక్క బ్రహ్మరంధ్రములో శివునిరూపముతో నుండే ఆత్మయొక్క కాంతినిగుఱించి ధ్యానము చేయుచున్నాడు. ఈవిధముగా మనస్సును అతిక్రమించుచున్నాడు. ఇది హఠయోగము.

## ౨. మంత్రయోగము

శివుడు, నారాయణుడు మొదలైన, దేవతలను దేహములోని వేఱువేఱు భాగములకు అధిష్ఠానదేవత లుగా భావించి వాటినిగుఱించి ధ్యానముచేయుట మంత్ర యోగ మనబడును.

## ౩. లయయోగము

ఇది మనస్సును విషయమును ఒకటిగా చేయుచున్నది. దీనికిసంబంధించిన అనేకపద్ధతులలో శబ్దము సులభమైన దియు, శ్రేష్ఠమైనదియు, అయి ఉన్నది.

తలలోనుంచి బయటకు పోయ్యేవాటి నన్నిటిని ఆపుచేసి శరీరములో వినబడేశబ్దముమీద మనస్సును, నిలిపినయెడల, అనేకశబ్దములు వినబడుచున్నవి. వేణు

గానము, వీణాగానములయొక్క శబ్దములు ఆఖరున వినబడి, మనస్సును నిగ్రహించుట కష్టములేకుండా చేయుచున్నది. మూడు యోగములను గురించి ఇప్పుడు చెప్పియున్నాము.

౪ రాజయోగము :—

విచారణశక్తి, వివేకజ్ఞానములు లేని యోగికి రాజ యోగము సాధ్యమైనవనికాదు.

యోగవాసిష్ఠములో, మనస్సును నిగ్రహించుటకు ౧. యోగము ౨. జ్ఞానము అని రెండు సాధనములు చెప్పబడినవి. కొందఱు యోగము సాధ్యముకాదని చెప్పుచున్నారు. కొందఱు జ్ఞానము సాధ్యమైనది కాదు అని చెప్పుచున్నారు.

ఈ రాజయోగము వేదములో అక్కడక్కడ 'ధ్యాయేత్' అనీ, 'ఉపాసీత' అనీ చెప్పబడియున్నది. కఠ, శ్వేతాశ్వతర, మండలబ్రాహ్మణ, ఉపనిషత్తులలో, వీటినిగురించి ఎక్కువగా చెప్పబడియున్నది.

లయయోగముయొక్క పుట్టుక సామవేదములో కనబడుచున్నది. దానినిగురించిన ఎక్కువపరిశీలన ఛాందోగ్యోపనిషత్తులో చేయబడియున్నది.

తాపసులు, సాధారణముగా మంత్రయోగమును

చేయుచున్నారు. మంత్రశాస్త్రములు దీనినిగుఱించి వ్రాసియున్నవి.

క్షురికోపనిషత్తు, హఠయోగప్రదీపిక మొదలైన గ్రంథములు, హఠయోగమునుగుఱించి, చెప్పియున్నవి.

రాజయోగము అన్నిటిలోనికి ముఖ్యమైనది. దీనిని గుఱించి విస్తరించి, మహాభారతములోను, విష్ణుపురాణము లోను, మార్కండేయ పురాణములోను, చెప్పబడి యున్నది.

౧. తంత్ర ౨. ఆగమ, 3. కాశ్మీరశైవ, కాపాలిక, సిద్ధాంతములకు, యోగసిద్ధాంతము మూలాధారమని చెప్పబడియున్నది.

నైయాయికులు, వైయాకరణులు, యోగమును గుఱించి శ్లాఘించియున్నారు. వేదములలోను, సంఘములకును, చరిత్రలకును, సంబంధించిన గ్రంథములలోను, ఆసన ప్రాణాయామముల గుఱించి చెప్పియున్నారు.

యజ్ఞ, యాగాదులలోను, కర్మాచరణములలోను, సంధ్యాదేవతాపూజలలోను, యోగపద్ధతులు అవలంబించ బడి యున్నవి.

'నిధిధ్యాస' అనుమెట్టు రాజయోగములో అన్నిటి కంటె పైమెట్టు అనీ, కైవల్యమునకు క్రిందిమెట్టు అనీ,

వేదాంత శాస్త్రములు చెప్పుచున్నవి.

వర్ణాశ్రమ భేదములేకుండా, సర్వావస్థలలోను, సర్వకాలములలోను, యోగము చేయదగియున్నది. అన్ని మత గ్రంథములలో దీనినిగురించి చెప్పియున్నారు.

అన్ని సిద్ధాంతములసారము యోగశాస్త్రముమీదనే ఆధారపడియున్నది.

బాదరాయణుడు, వారి వేదాంత సూత్రములలో, వారికాలములోనుండిన యోగపద్ధతులను ఖండించి యున్నారు. ఆఖండన, యోగసిద్ధాంతములకన్నిటికి అన్వయించదని, శ్రీశంకరులవారి అభిప్రాయము. శ్రీశంకరుల వారు, 'బాదరాయణుని ఆక్షేపణలు, యోగసిద్ధాంతములో ఉపనిషత్తులకు విరుద్ధముగానుండే కొన్నివిషయములగురించియేకాని, యోగసిద్ధాంతముల సూత్రముల గురించికాదు.' అనిచెప్పినారు. అంతేకాక సూత్రకారుడు, యోగసిద్ధాంతమును గురించి 'చాలాఉపయోగమైనది' అని పొగడియున్నారు. అని శ్రీశంకరులవారు చెప్పియున్నారు.

## పతంజలిసిద్ధాంతము

ముఖ్యముగా, రాజయోగమును గురించే పతంజలి సిద్ధాంతము బోధించియున్నది. మరియు "ఈశ్వరప్రణి

ధానాద్వా" అనగా భగవంతుని శరణు చొచ్చుటయే. అనుదానిలోను, భక్తియోగమును గుఱించి ఎక్కువగా చెప్పబడియున్నది.

'ప్రణిధానాత్' అంటే, తలంపులోను, మాటలోను, కార్యములోను, అన్నిటిలోగూడ భగవంతునికి పూర్తిగా సమర్పించి శరణుచొచ్చుట.

యోగికి, నమ్మకము, ఉత్సాహము, రెండునుగూడ నుండవలెను. అవి రెండు నున్నప్పుడే సమాధిమెట్టునకు రాగలడు.

## భక్తియోగము

భక్తియోగము, శ్రేష్ఠమైనది. వేదాంతులుగూడ దీనిని ఒప్పుకొనుచున్నారు. పతంజలి ఆత్మసంరక్షణను గుఱించి నాలుగుచోట్లచెప్పియున్నాడు. ఇందుకు కారణము, మొట్టమొదట ప్రారంభించి, మధ్యఆగకుండా, తుదవఱకును చేయవలయును గనుక.

భక్తిసాంఖ్యమునకంటె యోగము శ్రేష్ఠమైనదని స్పష్టపడుచున్నది.

వేదాంతములో సత్, చిత్. ఆనంద, అనియున్నవి. నేనే ఆపరమాత్మ; ఆ పరమాత్మయే నేను, అని జీవాత్మ

తలచుచున్నాడు. దానితోటి మోక్షమును పొందు చున్నాడు. కఠోపనిషత్తులో నిది అధ్యాత్మయోగ మని చెప్పబడుచున్నది.

గౌడపాదుడు దీనిని అస్పర్శయోగమని చెప్పిరి. కారణ మేమనగా, ఇతర యోగులు, నిర్గుణోపాసనచేయలేరు గనుక; యోగులు సాధారణముగా దేవతావిగ్రహములను ఆరాధించుచున్నారు. అస్పర్శయోగముగుండా కైవల్యము పొందుచున్నారు.

## జైనమతము

జైనమతమునకు ఆదిపురుషుడు ఋషభదేవుడు. ఈపేరు పురాణములలో గూడనున్నది.

వేదములలో కర్మకాండకును, జీవహింసతోకూడు కున్న యజ్ఞ, యాగాదులు సరియైనవి కావని మొదట జైనమతము ఎదుర్కొని పనిచేయుచు వచ్చెను.

మహాభారతకాలములో, జైనమతనాయకుడు 'నేమి నాథ' అనేవారుండిరి. వీరు శ్రీకృష్ణునితోపాటు, యాదవ వంశమునకు చెందియుండిరి. అప్పుడు వీరు ఇరువదిరెండవ తీర్థంకరుడుగా నుండిరి.

క్రీస్తుకుపూర్వము ఎనిమిదవశతాబ్దములో కాశీపట్టణములో పుట్టిన పార్శ్వనాథునికాలములోను, వారిపూర్వము పదకొండవ తీర్థంకరుడు అయిన శ్రేయాంసనాథుని కాలములోను, ఈ జైనమతము గొప్ప ఉన్నతస్థితిలో నుండినది. వీరిదగ్గఱనుండియే కాశీదగ్గఱనుండే స్థలమునకు సారనాథ్ అని పేరు వచ్చెను.

పార్శ్వనాథుడు ఇరువదిమూడవ తీర్థంకరుడుగా నుండెను. వీరి కాలములో ఏర్పడిన సంఘము శ్రమణ సంఘము అని పిలువబడెను. ఈసంఘ ముఖ్యోద్దేశము వేదములను ఎదుర్కొనుటయే.

కొంతకాలమైనతరువాత ఈసంఘము జైన బౌద్ధ మతములుగా మారిపోయెను.

జైనమతనాయకుడు మహావీరుడు. మహావీరునికి వర్థమానుడు అనేపేరుగూడ ఉండెను.

వీరు ఇరువదినాలవ తీర్థంకరుడుగా నుండిరి. ఆఖరు తీర్థంకరులు వీరే.

క్రీస్తుకుపూర్వము ౫౯౯ సంవత్సరములో వీరు జీవించి యుండిరి. వీరిగ్రామము పాటలీపుత్రము. పాట్నాకు ౨౭ మైళ్లదూరమున నున్నది. దీనికిఈకాలమున బాస్రా అని పేరు. వీరితల్లి త్రిశాలదేవి. వైశాలికి రాజు అయిన

లిచ్ఛవి కుమార్తె. చిన్నప్పటినుండి వీరిమనసు భగవంతుని వైపునకు తిరిగియుండెను.

రాజపుత్రులకు బోధించు విద్యలన్నిటిని అభ్యసించి, ప్రపంచము అశాశ్వతమైనదని, కనిపెట్టి, ముప్పదవసంవత్సరములో సన్యాసాశ్రమమును అవలంబించెను. పూర్ణమైన జ్ఞానమును పొందినతర్వాత వారిమతసిద్ధాంతములను బోధించుటకు ప్రారంభించిరి.

## అహింసా సిద్ధాంతము.

మహావీరునివల్ల అహింసాసిద్ధాంతము బోధింపబడెను. ఈయన గృహస్థులకు సన్యాసులకు గూడ అన్వయించే విధానములను, సూత్రములను, బోధించుచుండిరి. ఇవి అన్నియు ఏడు తత్త్వముల ననుసరించి బోధించుచుండిరి. మతమును, ఈతత్త్వము ప్రకారముబోధించి, ప్రజలలో నుత్సాహము పుట్టించి, వారిచే మతాభివృద్ధికి అవసరమైన ప్రచారములు చేయించి క్రొత్తవారిని మతమవలంబించేలాగు చేయుచు వచ్చిరి. ఈ విధముగ ముప్పదిసంవత్సరములు మతమును అభివృద్ధిచేయుటకు పాటుపడిరి.

వీరు డెబ్బదిరెండవ సంవత్సరమున మరణించిరి. వీరి శిష్యులనేకమంది రాజుల పోషణల నంది రాజులనుగూడ

మతములోనికి మార్చుచు జైనమతమును అభివృద్ధిలోనికి తెచ్చిరి. వీరిలో అనేకమంది కవులుగా బయలుదేరి గ్రంథముల రచించియుండిరి. ౧౧౦౦ A. D. కాలమునకు జైనమతము చాలా ఉచ్చదశలో నుండెను.

మహమ్మదీయులకాలములో ముఖ్యముగా అక్బర్ కాలములో ఈమతము చాలా అభివృద్ధిలోనుండెను. గుజరాతు దేశములోని చాళుక్యరాజులు, సిద్ధరాజు, అతని కుమారుడు కుమారపాలుడు, జైనమతమును అవలంబించి, దేవాలయములను కట్టుట, గ్రంథముల రచించుట మొదలైన కార్యక్రమములకు ఎక్కువ ప్రోత్సాహమును కలుగజేసిరి.

రాజపుతానాలో ఈజైనమతము ఎక్కువ వృద్ధిలో నుండెను. ఈమతము వృద్ధిలో నున్నంతకాలము. వర్ణాశ్రమభేదములు లేకుండా ప్రజలు జీవించుచుండిరి. రాజపోషణ తగ్గి, ప్రచారము తగ్గిపోవుటచే క్షీణదశ ప్రారంభించెను. వర్ణాశ్రమభేదములు మరల తల యెత్తెను.

ఇపుడు దేశమందంతటను జైనులు పదమూడులక్షలు మాత్రము ఉన్నారు. వీరిలో చాలామంది వర్తకవ్యాపారములలో నున్నారు. వీరి చేతులలో వర్తకసంబంధమైనవియు, వడ్డీమార్పుల సంబంధమైనవియు నగు వ్యాపార

ములు చాల విరివిగా నున్నవి. మార్వాడీలు అందఱును ఈమతమునకు చెందినవారు.

వీరు చాలాధర్మపరులు. సత్రములు, ఆసుపత్రులు మొదలైనవి అనేకముగా కట్టించి యున్నారు.

## భాషాభివృద్ధి

దేశములోని భాషలను అభివృద్ధిచేయుటలో జైనులు చాలాప్రయత్నములు చేసియుండిరి.

వేదములు, ఉపనిషత్తులు, మొదలైన మతగ్రంథము లకు అర్థముచెప్పుటలో బ్రాహ్మణులు ఆకాలములో సంస్కృతభాషను ఉపయోగించుచుండిరి. బౌద్ధులు పాళీ భాషను ఉపయోగించుచుండిరి. జైనులు వారిమత సిద్ధాంతములనుగుఱించి ప్రచారముచేయునపుడు, ఆ యా స్థలములలోనుండు ప్రాకృతభాషలలోనే ప్రచారము చే యుచు వచ్చిరి. భాషాప్రయుక్త ప్రచారమేగాక ఆ యా భాషలలోనుండే జ్ఞానమునుగూడ నశించకుండా కాపాడి నారు. ఈవిధముగా ప్రాకృతభాషలను. అభివృద్ధి చేసిరి.

రాష్ట్రీయభాషలు, అభివృద్ధిచేసినారు. ఆప్రకారము చేయుట అదియే మొదటి ప్రయత్నము.

మహావీరుడు అర్ధమాగధి భాషలో ప్రచారముచేసి బోధించుచు ఉండినాడు.

## సూత్రాంగములు

మహావీరుని బోధనలన్నియు పండ్రెండు. ౧౨ గ్రంథములుగా ప్రచురించబడినవి. అవి 'సూత్రాంగములు' అని పిలువబడుచున్నవి. అవి చాలాకాలము వఱకు, వంశపరంపరగాను, గురుశిష్యపరంపరగాను ఒకరినోటినుండి మఱియొకరినోటికి వచ్చేలాగు చేయబడుచుండెను. తుదకు అదియును ఆగిపోయి మఱపునకు వచ్చెను.

తరువాత అన్నిటిని జమచేయుటకు ప్రయత్నము చేసిరి. అట్లు జమచేసి అర్ధమాగధీభాషలో శ్వేతాంబర జైనులయొక్క గ్రంథములుగా నుంచబడి యున్నవి.

జైనులు ఈకాలపు భాషలయిన హిందీ, గుజరాతి, మరాటి భాషలుపుట్టుటకు మునుపు ఉండినభాషలో అనేక గ్రంథములను అచ్చువేయించి జాగ్రతచేసినారు. దానిని బట్టి పూర్వకాలపుభాషలు ఏవో అవి క్రమేణ మాఱిమాఱి తుదకు ఇప్పటిరూపములను అనగా హింది, గుజరాతి, మరాటి రూపములకు ఏలాగు వచ్చినవో మనకు బోధపడుచున్నది.

ఇప్పటిభాషలకూ పూర్వభాష అపభ్రంశమని చెప్ప బడుచున్నది. ఈ అపభ్రంశభాష, సంస్కృత ప్రాకృత భాషలకు ఒకవైపున, హిందీ, గుజరాతీ, మహారాష్ట్రము లకు రెండవవైపున గాక మధ్యకాలములో నుండినభాష. దీనిమూలముగా పూర్వకాలపు భాషలు ఏవిధముగా మారి తుదకు ఏరూపములను దాల్చినవో తెలియు చున్నది.

కన్నడభాషలో మొట్టమొదట గ్రంథము జైనులవల్ల వ్రాయబడినది.

తమిళదేశములోగూడ చాలాగ్రంథములు జైనపండి తులచే వ్రాయబడినవి.

సంస్కృతములోగూడ జైనపండితులు అనేకగ్రంథ ములను వ్రాసియుండిరి. వ్యాకరణ గణితశాస్త్రములలో గూడ మంచిగ్రంథముల వ్రాసిరి.

కళలు

శిల్పవిద్య, రంజనవిద్య, మొదలైనకళల విషయ ములో గొప్ప అభివృద్ధిని దేశమంతట చేసియుండిరి. వారు సన్యాసులకు సమాధులుకట్టుటకు, అలంకరించబడిన

జాతిద్వారములు, జాతిగోడుగులు, చెక్కబడిన పెద్ద పెద్ద జాతి స్తంభములు, పెద్దశిలావిగ్రహములు మొదలైనవి నిర్మించిరి. ఉత్తరహిందూస్థానములోని మధురాపట్టణములో పైనచెప్పినవాని దృష్టాంతములు కనబడుచున్నవి.

౧౨, ౧౩ శతాబ్దములనాటి శిలావిగ్రహములు బక్ డల్ బండ్ పట్టణములోనున్నవి. గోమతేశ్వరుడను పేరుగల బాహుశాలిని శిలావిగ్రహములు మైసూరు రాజ్యములోను శ్రావనబెల్ గోళాలోను, కారకాల్ లోను ఉన్నవి. మొదటిది ౧౦ వ శతాబ్దములో రాచమల్ల రాజు మంత్రియైన చాముండరాజుచే కట్టించబడినది. జాళ్ల కొండలో గుహాలు దేవాలయములు కట్టబడినవి. క్రీ. పూ. రెండవ శతాబ్దములోను, తరువాతనుకూడ ఒరిస్సాలో 'హాతి గుమ్ఫా' గుహాలు కట్టబడినవి. జగన్నాథ్ లోను, జున్నార్ లోను, ఉస్మానా బాద్ లోను పార్శ్వనాథ్ కొండలలోను, పావపురిలోను, బీహారులోను, రాజగిరిలోను, కతియావార్ సంస్థానములోను, గిర్నార్ లోను, పాలితానాలోను, దేవాలయములు, ఇతరకట్టడములు కట్టబడియున్నవి.

రాజపుటానాలో చలువజాతిదేవాలయము ౧౧ వ శతాబ్దములో మౌంట్ ఆబూలో కట్టబడినది.

నీరు తాగేపనికి ఉపయోగించే పెంకులు, ఇటుకలు

మొదలైనవి బహుమానాజూకు అయిన వస్తువులన్ని తయారుచేసినారు.

## జైనవేదాంతము

ఇది క్రీస్తుశకారంభమువఱకు ఏకమైనదిగా ఉంటూ పిమ్మట రెండుగా విడిపోయినది. అవి దిగంబర, శ్వేతాంబర శాఖలు.

తరువాత శతాబ్దములలో వీటిలో విభాగములు కలిగినవి. వీనిలో ఒక తెగ విగ్రహారాధనమును నిరాకరించి మతగ్రంథములను పూజించుచువచ్చిరి. వీరి పేరు శ్వేతాంబరులలో 'తెరపాటీలు' అనీ, దిగంబరులలో 'సామాయాలు' అనీ ఉండేది. ఈ తెగ ౧౭ వ శతాబ్దములో అభివృద్ధిలోనికి వచ్చినది.

## జైనమతము - బౌద్ధమతము

అజ్ఞానమువల్ల పాశ్చాత్యులు, జైనమతము, బౌద్ధమతేముయొక్క శాఖయని తలచుచుండిరి. కాని తరువాత దీని సత్యమును, అనగా జైనమతము ముందు పుట్టినదనీ, బౌద్ధమతము తరువాత కలిగినదనిన్ని కుటుంబములో మహావీరుడు బుద్ధునికంటె పెద్దవాడనీ స్థిరపఱుపబడినది.

## జైనసిద్ధాంతము

౧. ప్రాణముగలవస్తువు, ప్రాణములేనివస్తువు, కలియుటచేత ఒకశక్తి పుట్టుచున్నది. దానిమూలముగా పుట్టుట, చచ్చుట, జీవితములో, అనేకానుభవములు, అనుభవించుట కలుగుచున్నదని మొదటి సూత్రము.

ఈవిధానము ఆటంకపఱచుటకు నశింపుచేయుటకు కూడ శిక్షణవల్ల సాధ్యమైనపని అని మొదటి సూత్రములోని భాగముగానే తీసుకొనవచ్చును. అట్లుచేయుటవల్ల కైవల్యమును పొందవచ్చును.

దీనిని బాగా పరిశీలించినయెడల ఏడువిధములుగా భాగింపవచ్చును. ౧. ప్రాణము ౨. ప్రాణములేనివిషయము, ౩. రెండుకలియుట ౪. కలియుటచే ఒకశక్తి పుట్టుట ౫. కలియుట అనే విధానమును ఆపుచేయుటకు సాధ్యమైనపనియే అయియున్నది. ౬. ఉన్నశక్తులన్నియు, అంతముచేయుటకు సాధ్యమైయున్నది. ఈవిధముగా కైవల్యము నందుట సాధ్యమైనపని.

## ద్వైతము

జైనమతసిద్ధాంతము, సాంఖ్యసిద్ధాంతమువలె ద్వైత సిద్ధాంతము. అనగా ౧. జీవుడు ౨. ప్రాణములేని విష

యము, ఇవి రెండు కలసి ప్రపంచము అగుచున్నది. ఇది వేదాంతమునకంటె వేరైనది. వేదాంతములో పరమాత్మ ఒకటియే శాశ్వతమైనది. జగత్తు అంతా మిథ్య.

జైనమతములోను, సాంఖ్యమతములోను, జీవాత్మ, ప్రాణములేని వస్తువు, రెండునుగూడ శాశ్వతమైనవియే అయియున్నవి.

ఆత్మ కంటికి కనుబడదు. చేతికి తగులదు కాని అది ఉన్నట్లు, ఇతరచిన్నెలనుబట్టి కనిపెట్టవచ్చును. దాని యొక్క ముఖ్యమైనగుణము ఏదనగా తెలిసికొనగలశక్తి. అట్టి శక్తి యున్నట్లు ఇంద్రియములయొక్క పనులవల్లను, ఉచ్ఛ్వాస నిశ్వాసములచేతను, కొంతకాలము ప్రాణముతో దేహము ఉండుటచేతను కనిపెట్టబడుచున్నది.

జీవాత్మలు ప్రపంచములో వేఱువేఱుగా అనేకములై యున్నవి.

ఈ ఆత్మలు, దేనికదియే వేఱుగానుండును. ఒక దానిలో నొకటి కలియదు. వాటికంటె పెద్దదయిన దానిలో దేనిలోను కలియదు. (అనగా వేదాంతములో వలె వీటికి ఇందులో పరమాత్మ అనేదిలేదు. పరమాత్మలో కలియడమనేదిన్ని లేదు.)

౧. స్థావరము (కదలనిది) ౨. జంగమము (కదలునది.) అని జీవాత్మ రెండురకములు. స్థావరము అయిదు విధములు. ౧. మట్టితో చేయబడినది. ౨. నీళ్లతో చేయబడినది, ౩. నిప్పుతో చేయబడినది. ౪. గాలితో చేయబడినది. ౫. భూమి లోనుంచి పండే పదార్థములతో చేయబడినది.

మొదటినాలుగింటియొక్క ప్రాణము, సూక్ష్మరూపములో నుండును, అయిదవది స్థూలముగానుండును.

ఈ అయిదింటిలోను, ఒక ఇంద్రియము మాత్రము ఉన్నది. అది స్పర్శేంద్రియము. అదితగులుట చేత మాత్రము తెలిసికొనబడుచున్నది. దీనికంటె తక్కువ తరగతికి చెందిన జంతువులు ఉన్నవి. వాటిపేరు 'నిగోడ' లేక గుంపుగానుండే ఆత్మలు.

ఇందులో చాలాజంతువులు ఒకే శరీరముకలిగి ఒకే ఊపిరితిత్తికలిగి ఉంటున్నవి. అవి ప్రపంచమంతా వ్యాపించి యున్నవి. మనుష్యుని శరీరములోను జంతువులలోను, ఉంటున్నవి. అవి క్రమముగా వృద్ధిఅగుచున్నవి. వాటి సంఖ్య దినదినాభివృద్ధిలో నుంటూ, పుట్టుచు చచ్చుచు ఉండేవాటి స్థానముల నింపుచు, నిర్వాణమును పొందే లాగు చేయ శక్తిని ఇచ్చుచున్నవి.

## జంగమ జంతువులు

జంగమ జంతువులు నాలుగురకములు. ౧. రెండు ఇంద్రియములు కలవి. ౨. మూడు ఇంద్రియములు కలవి. ౩. నాలుగు ఇంద్రియములు కలవి. ౪. అయిదు ఇంద్రియములు కలవి. ౧. నాలుక, ౨. ముక్కు, ౩. కన్నులు, ౪. చెవి, ౫. స్పర్శ, అను నీఅయిదును ఇంద్రియములు.

౧. (Oysters) నత్త గుల్లలకు రెండుఇంద్రియములు మాత్రమున్నవి.

౨. (Lice) నల్లులు, పేలు, వీనికి మూడు ఇంద్రియములున్నవి.

౩. దోమలు, ఈగలు, తేనటీగలు, వీటికి నాలుగు ఇంద్రియములు ఉన్నవి.

౪. పక్షులు, జంతువులు, మనుష్యులు, వీటికి అయిదు ఇంద్రియములు ఉన్నవి.

ఆఖరు తరగతిలో మనుష్యులకు, జంతువులకు, పక్షులకును, తెలుసుకొనే జ్ఞానము ఉన్నది.

సముద్రములో నుండేసర్పమునకు ఏవిధమైనజ్ఞానమును లేకయున్నది.

## ఆత్మ — జ్ఞానము

ఆత్మకు తెలుసుకొనే శక్తియుండుటచేత ప్రతిజంతువు నకును జ్ఞానమనేది ఉన్నది.

౧. విషయములను తెలుసుకొనేది మొదటిజ్ఞానము.

౨. శాస్త్రజ్ఞానము, లేక అనుభవజ్ఞానము.

౩. కాలము, స్థలమును బట్టి దూరముగానుండే విషయములను తెలిసికొనే జ్ఞానము.

౪. వేఱొకని మనసును తెలిసికొనేజ్ఞానము.

౫. సమస్తమును తెలిసికొనే జ్ఞానము.

ఇవన్నియు వరుసగా, మతిజ్ఞానము, శ్రుతిజ్ఞానము, అవధిజ్ఞానము, మానపర్యాయజ్ఞానము. కేవలజ్ఞానము, అని తెలియుచున్నవి.

మొదటి రెండును సామాన్యమనుష్యునికి సాధ్యమైన పనులు.

తరువాతి రెండును, ఋషులకు సాధ్యమైనవి. ఆఖరుది పరిపక్వమై నిర్వాణమునకు తగియున్న ఋషికిమాత్రము సాధ్యమగును.

## అ జీ వు లు

రెండవతత్వము - అజీవులు అనగా ప్రాణములేని విష యములు. ఇవి అయిదు విధములు.

౧. పుద్గాలము లనగా కంటికి కనుబడేటటువంటియు, ఇతర యింద్రియములచేత కనిపెట్టుటకు సాధ్యమైనటువం టియు, సమస్తవస్తువులును పుద్గాలము లనబడును.

విషయములే జగత్తునకు మూలాధారములైయున్నవి.

జీవమే ఆత్మయగుచున్నది. ౧. భూమి, ౨. నీళ్లు, ౩. నిప్పు, ౪. గాలి, వీటియొక్క సూక్ష్మరూపము మిక్కిలి చిన్నది అయిన పరమాణువు, ౧. ఉష్ణము, ౨. వెలుతురు, ౩. నీడ, ౪. చీకటి. సూక్ష్మరూపములతోనున్న అణువుల యొక్క కదలికచేతనే పనిచేయుచున్నవి. వీటిలో ఇవి తాకుటచేత, క్రొత్తరూపములు పుట్టుచున్నవి. ప్రతినిమి షము, అనేకరూపములతోటి, మార్పులతోటి, కూడుకొ న్నవై, అణువులు పనిచేయుచుండును.

పరమాణువుల పని విషయములో జైనసిద్ధాంతమున కును, న్యాయ వైశేషిక సిద్ధాంతమునకును, భేదము ఉన్నది.

న్యాయవైశేషిక సిద్ధాంతములో విషయము, భూత

ములు ఎన్నియున్నవో అన్నిరకముల అణువులుగా మాఱుచున్నవి.

ఆత్మ ఎంతశాశ్వతమో విషయముగూడ అంత శాశ్వతముగా ఉన్నది.

ప్రపంచవిషయములలో నందు వస్తువు ఎల్లపుడును హెచ్చుతగ్గులు లేకుండ ఒకేమొత్తముగా నున్నది. మార్పులు ఎన్నికలిగినను సరియే, అది హెచ్చుటగాని తగ్గుటగానిలేదు.

## రెండవ అజీవి

౨. రెండవ అజీవి, ధర్మము అనబడును. ఇది ప్రపంచమంతటను వ్యాపించియున్నప్పటికిని, ఇంద్రియములకు గోచరముకాదు. విషయమునకు ఉండేగుణములు దీనికి లేవు. కాని ఇది ఉండుటచేతనే విషయములో కదలిక పుట్టుచున్నది.

నీళ్లు, చేపలుకదలుటకు ఏలాగు సహాయము చేయుచున్నవో, అదేవిధముగా ధర్మము, విషయాత్మలు కదలుటకు సహాయముచేయుచున్నది. చెట్టుమనుష్యునకు ఏలాగు నీడను ఇచ్చుచున్నదో, అలాగే అధర్మము, విషయము, ఆత్మ, నిలిచి విశ్రాంతిని తీసుకొనేలాగు చేయుచున్నది.

ధర్మాధర్మములు రెండును శాశ్వతమైన విషయములుగా తెలచబడుచున్నవి.

ఈ ధర్మాధర్మములు మామూలు అర్థములో తీసుకొన గూడదు. జైనసిద్ధాంతములో మామూలు అర్థమును తెలియజేయుటకు, పుణ్యము పాపము, అనుమాటలు ఉపయోగింపబడుచున్నవి. కాబట్టి ధర్మాధర్మములకు పైనచెప్పిన ప్రత్యేక అర్థములోనే తెలియవలెను.

## ౩౨. అజీవవస్తువు-ఆకాశము

ఆకాశములో, ధర్మాధర్మములలో వలెనే విషయము ఏదియునుండదు. ఆకాశము మిగిలినవిషయములకు ఉండే స్థలమును ఇచ్చుచున్నది.

ఆకాశము ఆద్యంతములు లేనిదై యున్నది. ఆకాశములో ఒకభాగమును మాత్రమే జగత్తు ఆక్రమించుకొని యున్నది, ఈభాగము లోకాకాశమని పిలువబడుచున్నది. ఖాళీగానున్న ఆకాశము, అలోకాకాశము అని పిలువబడుచున్నది. ధర్మము, అధర్మము, ఆకాశము, ఈవిధముగా, కదలికకు, విశ్రాంతికి, ఉండడమునకు, సాధనములగుచున్నవి. ఇవి మూడును ఒకదానిలోనొకటి అల్లుకొనిపోయియున్నవి.

ఈకాలపు శాస్త్రములో మూడింటికిని కలిపి 'కాళీ స్థలము(Space)' అని ఒకే పేరుతో పిలుచుచున్నారు.

## ౫. వ అజీవవస్తువు

### కాలము.

కాలముగూడ, ఆకాశము వలెనే జగత్తుఅంతా వ్యాపించియున్నది.

ఒకటిగానుండి, స్వతంత్రముగానుండి, చిన్నచిన్న అణువులుగానుండి, అనగా ఒకదానితోనొకటి కలియకుండా వేతే పదార్థముగా మారకుండా చిన్నచిన్న అణువు మొనలుగానే ఉంటున్నవి. ఇది కాలము యొక్క స్వరూపము. ఈ రూపముతో నుండే కాలము ప్రపంచములో నుండే అన్నివస్తువులందు మార్పులను వికారగుణములను కలుగజేయుచున్నది.

ఇది వీటికన్నిటికిని కాలమును పొడిగించుచున్నది.

కాలము ఆద్యంతములు లేనిదై యున్నది.

## ప్రపంచ వ్యవహారములు

ప్రపంచవ్యవహారనిమిత్తము, కాలము, నిమిషములు, గంటలు, రోజులు, నెలలు, సంవత్సరములు, యుగములుగా భాగింపబడియున్నది.

## ద్రవ్యము

అయిదు విధములైన అజీవములు.

జీవముతో కూడ ఆరువస్తువులు కలిసి, జగత్తులోనుండే ద్రవ్యము అనిచెప్పబడును.

## ఉండడము - ద్రవ్యము

అయిదుఅజీవములు, ఒకజీవము, మొత్తము ఆరును కలిసి ప్రపంచము నిలిచేలాగుచేసి నడిపించుచున్నవి.

జగత్తు నిలకడగా నుండుటకు, ఈద్రవ్యమే కారణమని చెప్పబడుచున్నది.

ఉపనిషత్తులకును, జైనసిద్ధాంతమునకును భేదము: ఉపనిషత్తుల మీద ఆధారపడిన, అన్నిబ్రాహ్మసిద్ధాంతముల ప్రకారము, "జగత్తును, జగత్తులోని అన్నివస్తువులను ఉండేలాగుచేసి నడిపించేవాడు పరమాత్మ ఒక్కడే" యని చెప్పబడియున్నది.

మఱియు ఈ పరబ్రహ్మశాశ్వతమైనవాడనిన్ని, వికారగుణములు లేనివాడనిన్ని చెప్పబడియున్నది.

## ఉపనిషత్తులు - బౌద్ధసిద్ధాంతము

ఉపనిషత్తులు పైవిధముగా చెప్పుచుండగా బౌద్ధము దీనికి కేవలము విరుద్ధముగా బోధించుచున్నది.

## యోగ స్మాత్ర సిద్ధాంతము

బౌద్ధసిద్ధాంతముప్రకారము జగత్తు జగత్తులోని అన్ని వస్తువులు గట్టిపదార్థములైనను, మనసునకు సంబంధించిన వైనను, కొంతకాలముండి నశించునవియే గాని, శాశ్వతమైనది ఒకటికూడ లేదు. అనగా ఆత్మకూడ కొంత కాలము ఉండి పిమ్మట నశించుచున్నది.

## జైన సిద్ధాంతము

పై రెంటికిని మధ్యస్థముగానున్నది.

వేదాంత బౌద్ధముల మధ్యనుండే భేదములను సమన్వయము చేయుటకు ప్రయత్నించుచున్నది. జైనసిద్ధాంతముప్రకారము ఉండడమనునది, మూడుభాగములుగా పని చేయుచున్నది. మూడు భాగములు ఏవి అనగా ౧. ఉత్పత్తి, ౨. నాశనము, 3. శాశ్వతము.

ఒకవస్తువుయొక్క ముఖ్యస్వభావమునుబట్టి అది శాశ్వతమైనదిగాను, మార్పులు లేనిదిగాను ఉంటున్నది. కాని ఆవస్తువుయొక్క అకస్మాత్తుగా వచ్చిన గుణములను బట్టి అది పుట్టుచున్నది; చచ్చుచున్నది.

ఆత్మ శాశ్వతమైనదే కాని, శరీరముతో దానికిగల సంబంధముచేత ప్రారంభించుచున్నది, నశించుచున్నది.

## బంగారము - అణువులు

బంగారములో నుండు అణువులు అన్నియు శాశ్వత ములైనవే కాని, అది గొలుసురూపమో ఉంగరము రూపమో దాల్చినపుడు అది పుట్టుచున్నది. చచ్చు చున్నది.

## ఖాళీస్థలము

అదేవిధముగా ఖాళీస్థలము లోని, ఏకో ఒకచోటు మొన గూడ ఉంటున్నది. అనగా శాశ్వతముగా నుంటున్నది. కాని, దానిలో ప్రవేశించే వస్తువులు వేఱు వేఱుకాలములలో వేఱు వేఱుగానుంటున్నవి.

## కాలము

కాలముగూడ అదేవిధముగా ఉంటున్నది. అనగా శాశ్వతముగా ఉంటున్నది. కాని, దానికి సంబంధించి పైకి కనుపడేవి తఱుచుగా మాఱుచున్నవి.

ప్రపంచములో నుండే ప్రతివస్తువునకుకూడ ఇదే తట స్థించుచున్నది

జైనులు, పైనచెప్పిన మూడువిభాగములగుఱించి పైనచెప్పినట్లు చెప్పడమేకాక వాటిని ఆధారము చేసికొని

ఒక క్రొత్త సిద్ధాంతమును సృష్టించినారు. దాని పేరు అనేకాంతము లేక స్యాద్వాదము. అనగా ఒకవస్తువును గుఱించి ఏడుఅర్థములను పరస్పర విరుద్ధమైనవాటిని, మనము చెప్పవచ్చును. కాని అవి అన్నియుకూడ సత్యమైనవే కావచ్చును. ౧. అది స్యాదస్తి, ౨. అది స్యాదస్తి కాదు. ౩. అది ఉన్నది. ౪. అది లేదు. ౫. అది వర్ణింపసాధ్యమైనది. ౬. అది వర్ణింపసాధ్యముకానిది. ౭. వర్ణించుటకు సాధ్యమగుచున్నది, అది వర్ణించుటకు సాధ్యముకూడ కాదు. పైనచెప్పిన యేడు వాక్యములకును నిజమైన అర్థము తెలిసికొనలేక, కొందఱుపండితులు, జైనమతము పరస్పరవిరుద్ధములతో కూడుకొని యున్నదని ఆక్షేపించుచున్నారు.

కాని దానిలో పరస్పర విరోధమేమియులేదు. ఉదాహారణము.

౧. ఒకమనుష్యుడు తండ్రిగా నున్నాడు.

౨. ఆ మనుష్యుడు తండ్రిగాడు.

౩. ఆ మనుష్యుడు రెండుగూడ.

ఈ, వాక్యములు, ఏయుద్దేశముతో చేయబడినవో ఆసంగతి తెలుసుకుంటే, అవన్నియు సమన్వయము చేయుటకు సాధ్యమైయున్నవి.

౧. ఒక బాలుని విషయములో తండ్రిగానున్నాడు.

౨. మఱియొక బాలుని విషయములో తండ్రిగాడు.

3. ఇద్దరి విషయములోచూస్తే తండ్రి అగుచున్నాడు, తండ్రిగాకుండను ఉన్నాడు.

౪. ఈ రెండుభావములు, ఒకేసమయములో, మాటలతో చెప్పుటకు సాధ్యముకాదు. గనుక 'చెప్పుటకు సాధ్యము కాదు.' అని చెప్పవచ్చును. అయినప్పటికిని తండ్రి అగుచున్నాడు, వర్ణించుటకు సాధ్యముకానివాడును అగుచున్నాడు. ఈవిధముగా అనికాంతసిద్ధాంతములో పరస్పర విరుద్ధమేమియు లేదు.

సందేహాము ఏమియు లేదు. అర్థముకాకుండా ఉన్నదియు గూడ లేదు.

అట్లు కాకపోవడమేకాకుండ ఈ అనికాంతసిద్ధాంతము మంచి జ్ఞానముతో కూడుకొన్నదిన్ని, అర్థముతో కూడుకొన్నదిన్ని అయి ఉన్నది.

ఈ సాధనముతోటి ప్రపంచ పరస్పర విరోధము

తోను పోటీలతోను కూడ మతసిద్ధాంతములను సమన్వయము చేసి శాంతిని పురికొల్పుట సాధ్యమై యుండును.

## జైన మతము

### సంయోగము.

జైనమతములో జగత్తును సృష్టించి నాశము చేసి, మరల సృష్టించే దేవుడు వేదాంతములో నున్నట్లు లేదు. విషయములతో కలుసుకొని పనిచేయుచున్న ఆత్మలు, అనేకములు, చిరకాలమునుంచి, ప్రపంచములో నుంటున్నవి. ఆత్మ విషయముతో కలియుట 'అస్రావ' మనబడుచున్నది.

ఆత్మయు, అస్రావమును, కలియుటచేత కలిగే భోగమువల్ల, మరల, మరల, సంయోగము కలుగుచున్నది. భోగము కలుగుచున్నది. తుదకు ఈసంయోగము (కలియుట) అంతమై, కైవల్యము పొందేవరకు, ఈ సంయోగ భోగములు కలుగుచునే యుండును.

### రెండు కలిసే విధము

ఆత్మయెల్లప్పుడును, కర్మ, అనే సన్నని విషయము

(అస్త్రావము) తో చుట్టుకొన బడియున్నది. ఈ కర్మ ఆత్మను ఆవరించి, ఆత్మ అక్రమపు దారిలో నున్నపుడు అనగా శరీరము, మనస్సు, మాటలు, మొదలైన వాటికి, సంబంధించిన, కోపము, గర్వము, మోసము, దురాశతో కూడుకొన్నదై, తప్పుదారిలోనికి పోయినపుడు, కర్మ, ఆత్మలో నివాసముగా కూర్చుండి, ఆత్మమీద పనిచేయు చున్నది.

## ఆత్మ - కర్మ సంయోగము

ఆత్మ, కర్మ కలియుటచేత 'కర్మ - శరీరము' ఏర్పడు చున్నది. ఇదే సాంఖ్య సిద్ధాంతములో లింగశరీరము లేక సూక్ష్మ శరీరము. అనబడును.

ఈ కర్మ శరీరము జీవితకాల మంతయు వెంబడించి యుంది. ఒకశరీరములోనుంచి మరియొక శరీరములోనికి పోవుచున్నది.

కర్మమున శరీరము అణువులతో చేయబడి యున్నది. ఆకారణముచేత దానికి బరువు, రంగును ఉన్నవి.

ఆత్మ దాని యంతటనది తేలిక పదార్థమై యున్నది. అన్ని విషయములలోను తేలికవై యున్నది. అందుచేత

శుద్ధమైయున్నది. అది వెంటనే జగత్తు అంతా వ్యాపించు చున్నది. 'ధర్మము' ఎంత వేగముగా తీసికొనిపోగలదో అంత వేగముగా సర్వత్ర వ్యాపించుచున్నది. కాని కర్మ శరీరముయొక్క బరువుచేత ధర్మముయొక్క వేగము అణచబడుచున్నది.

ఈ కర్మశరీరము, ఆత్మకు రంగునుగూడ కలుగజేయు చున్నది. నలుపు, ఊదా, బూడిదె, పసుపు, ఎఱుపు, తెలుపు మొదలైన రంగులను, ఆత్మ కిచ్చుచున్నది. మొదటి, నలుపు, ఊదా, బూడిదెరంగులు అమంగళ కరమైనవి. ఆఖరు మూడును మంగళకరమైనవి.

## నాల్గవ తత్వము

### బంధము.

విషయమును ఆశ్రవ మంటియున్నది. బంధములు ఎనిమిది విధములు. కర్మ శరీరము, ఆత్మను ఎనిమిది విధములుగా బంధించుచున్నది. కర్మయొక్క శక్తిని అనుసరించి బంధము ఎనిమిది విధములుగా ఏర్పడుచున్నది.

### కర్మలు

ఈ ఎనిమిదివిధములైనశక్తులు కర్మలుఅని చెప్పబడును.

మొదటి రెండు జ్ఞానమును, దర్శనమును అటకా యించుచున్నవి. 'జ్ఞానవారణ్య', 'దర్శన వారణ్య' మనివాని పేళ్ళు.

మూడవది, భ్రాంతిని కలుగజేయుచున్నది. కామ క్రోధముల మూలముగా (మోహనీయ) భ్రాంతిని కలుగ జేయునది.

నాల్గవది, సుఖదుఃఖములను కలుగజేయునది.

అయిదవది, ఆయుష్కాలమును నిర్ణయించుచున్నది.

ఆరవది, శరీరమును, ఇంద్రియములను, ఆరోగ్యమును, వర్చస్సును (రంగును) మొదలైనవానిని, కలుగజేయుచున్నది.

ఏడవది, జన్మనక్షత్రములను, గోత్రములను కలుగ జేయుచున్నది.

ఎనిమిదవది, మంచిగుణములను, శక్తులను పొందు విషయములో ఆటంకములను కలుగజేయునది. శక్తులనగా అంతరాయములు.

కర్మసంబంధమైన విషయము, ఆత్మలో ప్రవేశించి నపుడు, అది కర్మఫలము ఎప్పుడు ఇచ్చి యెప్పుడు తాను అంతమయ్యేదిన్ని స్థిరపఱచుచున్నది.

ఎనిమిదికర్మలు ౧౪౮ భాగములుగా చేయబడినవి.

## యోగ సూత్ర సిద్ధాంతము

మనుష్యుని జీవితములో కలిగే అనుభవములను అనుసరించి ౧౪౮ భాగములు కలిగినవి.

౮ మొదలు ౨ వరకుగల కర్మలు మంచి ఫలములను ఇయ్యవచ్చును. చెడుఫలములను, ఇయ్యవచ్చును.

మనస్సు, శరీరము చేసే పుణ్యకర్మలవల్ల మంచిఫలములు లభించును. పాపకార్యములచేత చెడుఫలములును లభించును.

ఈవిధముగా క్రొత్తబంధములు కలుగకుండా ప్రాతబంధములు విడిపోయేలాగున మనుష్యుడు చేయుటకు సాధ్యమై యున్నది.

ఈ విషయము, ఆఖరు రెండుతత్వములలో (సంవర, నిర్జర,) చెప్పబడియున్నది.

దేహనిగ్రహముచేతను, మనోనిగ్రహముచేతను, క్రొత్త కర్మలు లోపలప్రవేశింపకుండ చేయవచ్చును. మరికొన్ని తపస్సులచేత నిగ్రహములచేత, ఉన్నకర్మలు నశించేలాగు చేయవచ్చును. ఈవిధముగా జరిగినప్పుడు, ఆత్మ బంధములోనుంచి విడిపించబడుచున్నది. జనన మరణములు నశించుచున్నవి.

జీవాత్మ, ఆత్మజ్ఞానమును పొంది అంతములేని ఆనందమును పొందుచున్నది. కైవల్యమును పొందుచున్నది.

## యోగ సూత్ర సిద్ధాంతము

అప్పుడు మనుష్యుడు సిద్ధుడు అగుచున్నాడు.

ఈఫలములను పొందుటకు కొన్ని నియమములను, సూత్రములను, గృహస్థులకు, సన్యాసులకు, ఉపయోగ కరమైనవి, విధించబడినవి.

గృహస్థులయొక్క నడతకు సంబంధించిన శాసనములు, సన్యాసుల నడతలకు సంబంధించిన శాసనములు వేఱు వేఱుగా చేయబడియుండెను.

## వల్లభాచార్య - మతసిద్ధాంతము

వల్లభాచార్యులువారు, ౧౪౭౯ - ౧౫౩౧ కాలము మధ్యలో జీవించియుండిరి. వీరితండ్రి లక్ష్మణభట్టు దగ్గర నుంచి, 'మదనమోహన' విగ్రహము, ఒకవైపున రాధ. రెండవవైపున లక్ష్మి - ఈరెంటితో లభ్యపడెను. ఇది శ్రీకృష్ణుని విగ్రహము. రాసలీలలను గుఱించి చెప్పుచున్నది. వల్లభాచార్యుల రెండవ కుమారుడు విఠల్ నాథ్ జీ. వీరు తన ఆస్తులను ఏడుగురు కొడుకులమధ్య పంచిపెట్టినప్పుడు ఏడువిగ్రహములను గూడ సేవకుగాను పంచియిచ్చినాడు. ఈ యేడురూపములును శ్రీకృష్ణుని లీలలుగా చెప్పబడినవి.

శ్రీశంకరులవారివల్ల, నూతనముగా, బోధించబడి

నట్లు తలచబడిన మాయావాదము, భాస్కరపండితునిచేత ఖండించబడెను. పిమ్మట శ్రీరామానుజాచార్యులవారివల్ల ఖండించబడెను. ఉపనిషత్తులలోని జ్ఞానమును గుఱించిన ప్రబోధము క్రమేణ తగ్గిపోయి భక్తిమార్గమున ప్రబోధ ములు ప్రబలమాయెను. రామానుజులవారి కాలము మొదలు ఇప్పటి వఱకు ప్రజలు భక్తిమార్గమును అవలం బించుచునే ఉన్నారు. అనగా జ్ఞానమును గుఱించిన పరి శీలన తగ్గిపోయినది. అప్పటినుంచి ఇప్పటివఱకును ఆచార్యులవారి కాలమని చెప్పవచ్చును. ఈకాలములో నింబార్క, మాధవ, వల్లభ, చైతన్యాదులైన ఆచార్యు లును ఋషులును బోధించుచు వచ్చిరి.

శ్రీకృష్ణుడు తనకు కనబడి ఉపనిషత్తులకును, బ్రహ్మ సూత్రములకును, సరియైన అర్థమును బోధించవలసిన దని యు, శ్రీశంకరులవారు తప్పుఅర్థముచేసిపోయినారనియు, దానిని సవరణచేయవలసినదనియు తనకు బోధించినట్లును, ఆపనికి తానుపూనుకొన్నట్లును, శ్రీవల్లభాచార్యులవారు చెప్పియున్నారు.

భగవదాజ్ఞాప్రకారము వల్లభాచార్యులు, కార్యాచర ణము ప్రారంభించి, శంకరాచార్యులవారిని ఖండించుచు శుద్ధాద్వైతసిద్ధాంతమును స్థాపించిరి.

శుద్ధాద్వైతమును శంకర సిద్ధాంతఖండనగా తెలియవలెను.

వల్లభాచార్యులవారు, ప్రస్థానములను పునాదిగాచేసి, వారి సిద్ధాంతమును, స్థాపించిరి. ప్రస్థానములు అనగా ౧ వేదములు, (శ్రుతులు) ౨ భగవద్గీత, ౩ బ్రహ్మసూత్రములు, ౪ భాగవతము.

సందేహము కలిగినపుడు వరుసగా ప్రస్థానములను చూచి సందేహనివారణ చేసికొనవలసినదని వల్లభాచార్యులవారు విధించియున్నారు.

వ్యాసులవారి అనుభవములన్నియు భాగవతములో చెప్పబడినవనీ ఆకారణముచేత దానికి 'సమాధి-భాష' అని పేరు పెట్టబడినదనీ చెప్పబడియున్నది. నాలుగు ప్రస్థానముల గురించి బోధించుటకు వల్లభాచార్యులుగారు కొన్ని గ్రంథముల రచించిఉండిరి.

వల్లభాచార్యులు బ్రహ్మసూత్రములకును, జైమిని సూత్రములకును, భాగవతమునకు భాష్యములు వ్రాసిరి గాని, అన్నియు, అసంపూర్తిగానే ఉండిపోయినవి.

తత్త్వదీపనిబంధన మనే గ్రంథమునుకూడ వ్రాసియుండిరి. దానిలో శాస్త్రార్థము, సర్వనిర్ణయము, భాగవతార్థమును గురించిగూడ వ్రాసియుండిరి.

ఈసిద్ధాంతమును పూర్తిగా బోధించుచు, ౧౬ చిన్న చిన్న గ్రంథములను వ్రాసియున్నారు. వీటిలో చెప్పబడిన ఏడుపధములైన అర్థమును తెలిసికొన్నవారికి మోక్షము లభించునని చెప్పియున్నారు. ఉపనిషత్తులమీదను, గీతమీదను వల్లభాచార్యులవారు ప్రత్యేకభాష్యమును వ్రాసియుండలేదు. కాని వీటినిగురించి వారి యొక్క 'అను భాష్యము' లోను 'సుబోధిని' గ్రంథములోను తత్త్వదీప నిబంధనలోను పూర్తిగా చర్చించియున్నారు.

## బ్రహ్మము

అన్నిటికంటె శ్రేష్ఠమైనవస్తువు బ్రహ్మము. బ్రహ్మము శాశ్వతమైనది. బ్రహ్మము జ్ఞానము. ఆనందము. బ్రహ్మము రసము. (Sentiment)

వేదాంతులలో, వల్లభాచార్యులుతప్ప మఱియెవరు కూడ రసము (Sentiment) బ్రహ్మమని చెప్పియుండ లేదు.

కాని తైత్తిరీయ ఉపనిషత్తులో 'రసము' కూడ బ్రహ్మమని చెప్పబడియున్నది. దానిని వల్లభాచార్యులుగారు అవలంబించి యున్నారు. వల్లభాచార్యుల సిద్ధాంతము

ప్రకారము ౧. బ్రహ్మము పూర్ణుడు. ౨. పురుషులలో శ్రేష్ఠుడు.

ఈవిధముగా, అంగీకరించి గొప్పదేవుడు, రూప, ప్రాణములతో కూడుకొని, శ్రీకృష్ణభగవానుని మాత్రరుగా ఉన్నాడు.

బ్రహ్మమునకు దేవతాగుణాలు లుకలవు. వాటిలో ముఖ్యమైనవి. ౧. జ్ఞానము ౨. క్రియ. బ్రహ్మమునకు ప్రపంచసంబంధ మైనటువంటియు, మనుష్యసంబంధ మైనటువంటియు, గుణములులేవు.

ఉపనిషత్తులలో చెప్పబడిన లేదు, లేదు - కాదు, కాదు అనేగుణములు, ఆయనకు మనుష్యగుణములులేవు అని చెప్పుటకు ఆలాగు చెప్పబడియుండవచ్చును అని వల్లభాచార్యులుగారి మతము.

బ్రహ్మమునకు, శరీరమున్నది. దానిపేరు విగ్రహము ఆవిగ్రహము, పూర్తిగా, ఆనందముతో చేయబడినది. ఆనందమునకు ఆద్యంతములులేవు. ఆనందము సర్వత్ర వ్యాపించియున్నది; శాశ్వతమైనది.

అది, కర్త, భోక్త రెండునుకూడ అయియున్నది. విలాసార్థము, ఆటకొరకు తనలోనుంచి, జగత్తును సృష్టించియున్నది.

అది జగత్తునకు శ్రేష్ఠమైనటువంటియు, (Efficient) ముఖ్యమైనటువంటిదియు, (Material) నగు కారణమై యున్నది. దానిచేతనే జగత్తు నిలువబడియున్నది. అందులోనే జగత్తు ఇమిడియున్నది.

సుఖదుఃఖములతో కూడుకొన్న ప్రజలతో నిండియున్న ప్రపంచము, బ్రహ్మముచేత బ్రహ్మములోనుంచి క్రీడ కొఱకు సృష్టించబడియుండుటచేత దానిలో అనగా, ఆ బ్రహ్మములో క్రూరత్వమునకు అసమత్వమునకును స్థానములేదు.

బ్రహ్మములోనుంచి జగత్తు పుట్టినప్పుడుగూడ బ్రహ్మములో ఏవిధమైనమార్పులుకలుగవు. ఈమార్పు లేకుండా ఉండు సిద్ధాంతమునకు 'అవికృతపరిణామ' మని పేరు.

ఈబ్రహ్మభావము ఉపనిషత్తుల ఆధారముమీద చెప్ప బడుచున్నది.

దీనిలోనుంచి, ఇతరవాదములను, అర్థములను చేయు టకు అవకాశము ఉన్నది.

వేదములలోని మొదటిభాగమైన, కర్మకాండ, బ్రహ్మ యొక్క క్రియాశక్తిని, వర్ణించియున్నది.

ఉత్తరకాండ, అనగా ఆఖరుభాగము. జ్ఞానశక్తిని వర్ణించి యున్నది.

అది జగత్తునకు శ్రేష్ఠమైనటువంటియు, (Efficient) ముఖ్యమైనటువంటిదియు, (Material) నగు కారణమై యున్నది. దానిచేతనే జగత్తు నిలువబడియున్నది. అందులోనే జగత్తు ఇమిడియున్నది.

సుఖదుఃఖములతో కూడుకొన్న ప్రజలతో నిండియున్న ప్రపంచము, బ్రహ్మముచేత బ్రహ్మములోనుంచి క్రీడ కొఱకు సృష్టించబడియుండుటచేత దానిలో అనగా, ఆ బ్రహ్మములో క్రూరత్వమునకు అసమత్వమునకును స్థానములేదు.

బ్రహ్మములోనుంచి జగత్తు పుట్టునప్పుడుగూడ బ్రహ్మములో ఏవిధమైనమార్పులుకలుగవు. ఈమార్పు లేకుండా ఉండు సిద్ధాంతమునకు 'అవికృతపరిణామ' మని పేరు.

ఈబ్రహ్మభావము ఉపనిషత్తుల ఆధారముమీద చెప్పబడుచున్నది.

దీనిలోనుంచి, ఇతరవాదములను, అర్థములను చేయుటకు అవకాశము ఉన్నది.

వేదములలోని మొదటిభాగమైన, కర్మకాండ, బ్రహ్మ యొక్క క్రియాశక్తిని, వర్ణించియున్నది.

ఉత్తరకాండ, అనగా ఆఖరుభాగము. జ్ఞానశక్తిని వర్ణించి యున్నది.

భాగవతములో, బ్రహ్మము క్రియా శక్తిగాను, జ్ఞాన శక్తిగాను, రెండునుగా కూడ వర్ణించబడియున్నది.

## అక్షరబ్రహ్మము

అనగా పూర్ణపురుషోత్తమునకు తరువాత అక్షర బ్రహ్మమును గుఱించి ఆలోచించుచున్నాము.

అక్షరబ్రహ్మము, సత్తు చిత్తు ఆనందము, మూడింటిని కలిగియున్నది. ఇది పరబ్రహ్మముయొక్క స్థానమై యున్నది. పరబ్రహ్మయొక్క స్థితిని అనుసరించి ఇది అనేక రూపములను తాల్చుచున్నది.

పరబ్రహ్మము వైకుంఠవాసిగా నున్నపుడు అది వైకుంఠ లోకముగా నున్నట్లు కనబడుచున్నది.

అంతర్యామిగా అనగా లోపల ఉన్నట్లుగా కనబడు నపుడు, అది పరబ్రహ్మముయొక్క పాదముగా కనబడ వచ్చును; అవతార పురుషుడు అయినప్పుడుకూడ పాదము లాగు కనబడవచ్చును.

పరబ్రహ్మ, దేవతాస్వరూపములో, అధిదైవికములో నున్నప్పుడుగూడ పాదములాగుననే కనబడవచ్చును.

తైత్తిరీయోపనిషత్తులో, పరబ్రహ్మము, ఆనంద మయుడుగా వర్ణించబడియున్నాడు. అప్పుడు, అక్షర

బ్రహ్మము, పరబ్రహ్మము యొక్క పుచ్ఛము గాగు కనబడు చున్నాడు. అది పరబ్రహ్మము యొక్క ఆధ్యాత్మిక రూపము.

## మోక్షము - జ్ఞానము

పరబ్రహ్మము, జ్ఞానము ద్వారా, మోక్షమును ఇయ్య దలచినపుడు, నాలుగు రూపములను దాల్చుచున్నాడు. ౧. అక్షరము, ౨. కాలము, 3. కర్మ (పని) ౪. స్వభావము.

అప్పుడు అక్షరము, ప్రకృతి, పురుషుడు, రూపములో కనబడుచున్నది. పురుషుడు అనగా ఆత్మ. ప్రకృతిలో నుంచి జగత్తు మొట్టమొదటగా పుట్టుచున్నది. ఆ కారణము చేత, ప్రకృతి కారణము లన్నిటిలోనికి, గొప్ప కారణ మగుచున్నది.

ఉపనిషత్తులలోని, 'లేదు- లేదు,' అనే వర్ణన— ఉదా:- అస్థూలము (స్థూలము కాదు) మొదలైనది- ఈ అక్షరము నకే సంబంధించి ఉన్నది. అక్షరము అనేది, జ్ఞానమువల్ల ఉపాసించబడుచున్నది.

## పరబ్రహ్మము - అక్షరబ్రహ్మము

భేదము: పరబ్రహ్మము, అక్షరబ్రహ్మము కంటె శ్రేష్ఠ మైనది. అని, ఉపనిషత్తులలోను, గీతలలోను, భాగవతము

లోను స్పష్టముగా చెప్పబడి ఉన్నప్పటికిని ఇది వల్లభాచార్యులవారి పూర్వు లెవ్వరి చేతనుగూడ కనిపెట్టబడి ఉండలేదు.

ఈభేదమును మొదటకనిపెట్టి వెల్లడిచేసినవారు వల్లభాచార్యులవారే అయియున్నారు.

అక్షరము వలెనే, కాలము, కర్మ, స్వభావముకూడ పరబ్రహ్మములోనుండి విడదీయుటకు సాధ్యముకాని పరబ్రహ్మముయొక్క ఇతరరూపము లైయున్నవి. ఇవి అన్నియు, జగత్తుయొక్క సృష్టిలో ఏదో ఒకపని చేయుచున్నవి.

## ౨౮ తత్త్వములు

సృష్టివిషయములో ౨౮ తత్త్వములు ఉన్నవని వల్లభాచార్యులవారు ఒప్పుకొనుచున్నారు.

(౧) సత్త్వము, (౨) రజస్సు, (౩) తమస్సు, (౪) పురుషుడు, (౫) ప్రకృతి, (౬) మోహము, (మహత్) (౭) అహంకారము- పంచభూతములు ౫; తన్మాత్రలు ౫; కర్మేంద్రియములు ౫; జ్ఞానేంద్రియములు ౫; మనస్సు ౧; మొత్తము ౨౮ తత్త్వములు. జగత్తు సృష్టికిపూర్వము, అక్షరము, కాలము, కర్మ, స్వభావము ఈ నాలుగును

ఉండియున్నమాట సత్యము. అయినప్పటికిని వాటిని పైనచెప్పిన ౨౮ లో చేర్చకూడదు. కారణమేమంటే, అవి పరబ్రహ్మములో భాగములై మూలకారణములు అగుచున్నవి గనుక.

పైనచెప్పిన ౨౮ పదార్థములు కారణములు అగుట చేత ఒకదానిలోనుంచి ఒకదానిని విడదీయుట సాధ్యము కానందునను, అవి స్వతంత్రమైనవి కానందునను, తత్త్వములు అనబడుచున్నవి.

సాంఖ్యములో, ఈతత్త్వములు వేఱైనవిగాను, స్వతంత్రమైనవిగాను ఉండును.

ఈ ౨౮ పదార్థములపేర్లు, సాంఖ్యములోని పేర్లే అయినప్పటికి వాటిలో గుణభేదము లున్నవి. కాబట్టి అవి రెండును ఒకటేయని భ్రమించకూడదు.

ఉదాహరణము:—

౧. సాంఖ్యములో మూడుగుణములను, ప్రకృతి సృష్టించుచున్నది. అనగా, ఆగుణములే ప్రకృతిక్రింద ఏర్పడుచున్నవి.

ఇక్కడ వల్లభాచార్యులవారి సిద్ధాంతములో ఇంద్రియములు, మనస్సు, అణువులతో చేయబడియున్నవి. అవి శాశ్వతమై ఉన్నవి.

భగవంతుడు ఆదిలో ఒక్కడే ఉండినాడు. క్రీడా విలాసముకొరకు, తాను, అనేకములుగా నుండవలెనని కోరినాడు. తక్షణం నిప్పులోనుంచి రవ్వలు వచ్చినట్లు, వేలకొలది ఆత్మలు, అక్షరములోనుంచి పుట్టెను. కొన్ని ఆత్మలు ప్రత్యేకము పరబ్రహ్మములోనుంచియే పుట్టెను.

మనుష్యుని ఆత్మ పరబ్రహ్మములోనుంచియే పుట్టినది. ఆ కారణముచేత అది పరబ్రహ్మలో ఒక భాగమై (అంశము) ఉన్నది. ఈ ఆత్మ, అణువులతో చేయబడియున్నది. అది శాశ్వతమైనది.

ఆటకొరకు, మనుష్యునియొక్క ఆత్మలోనుంచి ఆనందము తొలగిపోవలెనని కోరినాడు. అందుచేత అది తొలగి పోయి, అజ్ఞానముతో కూడుకొన్నదై బంధింపబడినది.

ఆత్మకు పుట్టుక లేదు. చావు లేదు; దేహముమాత్రమే పుట్టుచున్నది; నశించుచున్నది. ఆత్మకు దేహముతో సంబంధమున్నంతకాలము జనన, మరణములు దానికి గూడ ఉన్నట్లు అజ్ఞానముచేత తలచబడుచున్నది.

ఆత్మ సర్వత్ర వ్యాపించి యుండలేదు. అది శరీరము యొక్క ఒడ్డుపొడుగులను అనుసరించి చిన్నదిగా గాని పెద్దదిగా గాని ఉండదు. కాని, అది అణువులతోనే చేయబడి ఉన్నది.

## యోగ సూత్ర సిద్ధాంతము

### చైతన్యము

ఆత్మయొక్క చైతన్యము, దేహమంతా వ్యాపించి యున్నది. ఆ కారణముచేత, చైతన్యమును ఆధారము చేసికొని దేహములోనుండే సమస్తమును, ఆత్మ అనుభవించుచున్నది.

తెలిసికొనేవాడు ఆత్మ; చేసేవాడు ఆత్మ. అనుభవించేవాడు ఆత్మ. కాని ఈ లక్షణములన్నిటిని పరబ్రహ్మములోనుంచియే పొందుచున్నాడు.

కాబట్టి ఆత్మ, నిజమైనవస్తువు. అజ్ఞానమువల్ల పుట్టినది కాదు. శంకరసిద్ధాంతములోవలె అజ్ఞానమువల్ల పుట్టి ఉండలేదు.

భగవంతుని యొక్క క్రీడావిలాసార్థము ఆత్మలు అనేకములుగా నుండుచున్నవి.

ఆత్మలు మూడు విధములు: అవి యివి.

౧. ప్రపంచ విషయములలో ఆశగలిగి, వాటినిగురించి పనిచేయు ఆత్మలు.

౨. వేదములలో విధించబడిన మార్గమును, అనుసరించి జీవించు ఆత్మలు.

3. భగవదనుగ్రహమువల్ల పుట్టిన భక్తిచేత పరబ్రహ్మను

ధ్యానించు ఆత్మలు.

మొదటితరగతి ఆత్మలు 'ప్రవాదము' అని పిలువ బడుచున్నవి.

రెండవతరగతి ఆత్మలు 'మర్యాదాత్మలు' అని పిలువ బడుచున్నవి.

మూడవతరగతి ఆత్మలు 'పుష్ట్యాత్మలు' అని పిలువ బడుచున్నవి.

ప్రపంచము బ్రహ్మములోనుంచి పుట్టియున్నది. కాబట్టి, అది పరబ్రహ్మముతోపాటు నిజమైనదైయున్నది. పరబ్రహ్మకంటె వేరైనది కాదు.

ప్రపంచము, పరబ్రహ్మయొక్క ఆధిభౌతిక భావ మును దాల్చియున్నది.

ప్రపంచములో శాశ్వతముగా నుండడమను గుణము కనబడుచున్నది.

దీనిలో చిత్తు, ఆనందము, అనే రెండుగుణములు అంత ర్భాతములై ఉన్నవి.

సాలెపురుగు, తాను వడికినసూలుతో తనను ఏలాగు కప్పుకొనుచున్నదో, అదేవిధముగాను, ఆలాగుచేయుటలో ఏవిధమైనమార్పు లేకుండా, ఏలాగుఉంటున్నదో, అదే విధముగా, బ్రహ్మ తనలోనుంచి జగత్తును సృష్టించి ఏ

విధమైన మార్పులేకుండా ఉన్నది.

జగత్తుయొక్క సృష్టి క్రీడకొరకుమాత్రమే చేయబడి యున్నది.

జగత్తుయొక్క ఉత్పత్తి, స్థితి, నాశము, ఇవిఅన్నియు, పరబ్రహ్మమువల్లనే నడుపబడుచున్నవి.

స్వభావములో జగత్తు కలలలోవలె అశాశ్వతమైనది కాదు.

శంకరసిద్ధాంతము. అసత్యము ; ప్రపంచమంతయు నిజము కాదనియు, అబద్ధమనియు, అజ్ఞానమువల్ల కల్పించబడినదనియు చేసేవాదము, సరికాదు. నాలుగుప్రస్థానములను ఆధారముచేసికొని వల్లభాచార్యులుగారు జగత్తు నిజమైనది అని దీనినిమార్చుటకు మనుష్యునికి సాధ్యమైన పనికాదనీ చెప్పుచున్నారు.

## నిజమైన ప్రపంచము-నిజము కాని సంసారప్రపంచము

వల్లభాచార్యులు, ప్రపంచమునకు రెండుభావములు ఉన్నవిఅనీ, అందులోఒకటి, అనగా కనుబడుచుండే జగత్తు అంతా శాశ్వతమైనదిఅనీ, జనన మరణములతోను సంసారముతోను గూడుకొన్న దేహేంద్రియాదు లనే ప్రపంచము, అశాశ్వతమైనది అనీ భేదము చూపించినాడు.

సంసారముతో కూడుకున్నప్రపంచము, అజ్ఞానముతో

గూడుకొని యుండుటచేత నశించుచున్నది అనిచెప్పి యున్నాడు.

పరబ్రహ్మ, తనకు క్రీడా విలాసార్థము ప్రపంచమును సృష్టించినాడనీ, దానికొఱకే ఆత్మలన్నియు అజ్ఞానముతో కప్పబడేలాగు చేయుచున్నాడనీ, ఆకారణముచేతనే, ఆత్మలన్నియు, 'నేను-నాది' అనేదోషముతో కూడు కొని యున్నవిఅనీ, ఇంతకు పూర్వము చెప్పబడియున్నది.

## సంసారము

సంసారమనేది, 'నేను-నాది' అనే అహంభావముతో చేయబడియున్నది, ప్రతిఆత్మకు, అహంభావమును నశింప జేయుట విధియైయున్నది.

మోక్షమార్గములుమూడు. అవి ౧. కర్మమార్గము, ౨. జ్ఞానమార్గము, 3. భక్తిమార్గము. ఈవిషయములో వేదాంతసిద్ధాంతములు ఆరింటిలో ఒకదానికి మఱియొక దానికిని మధ్య భేదమున్నది. వల్లభాచార్యులుగారివలన స్థాపింపబడిన శుద్ధాద్వైత సిద్ధాంతమునకు చెందిన యజ్ఞము, అయిదురూపములను పొందుచున్నది.

౧. అగ్నిహోత్రము, ౨. దర్శపౌర్ణమాసము,

౩. పశుయాగము, ౪. చాతుర్మాస్యము, ౫. సోమ యాగము అను ఈ అన్నియు పూర్వకాండ, (కర్మ కాండ) లోనివి. ఉత్తరకాండ, జ్ఞానరూపమును దాల్చుచున్నది.

వేదములలో చెప్పబడిన కర్మలను ఎవడు యథావిధిగా చేసి, బ్రహ్మజ్ఞానమును పొందుచున్నాడో, వాడు బ్రహ్మానందమనే మోక్షమును, పొందుచున్నాడు.

అటువంటి మనుష్యునికి వేదములలో చెప్పబడిన బ్రహ్మ పైన చెప్పిన రూపములలో ప్రత్యక్షమగుచున్నాడు.

## క్రమ ముక్తి

అటువంటి, దేవయాన, మార్గముగుండా, క్రమ ముక్తిని పొందుచున్నాడు.

పరబ్రహ్మ, వానిమీద ప్రత్యేక అనుగ్రహమును చూపినయెడల వాడు, మరణించినవెంటనే సద్యోముక్తిని పొందుచున్నాడు.

వాడు, బ్రహ్మజ్ఞానమును పొందకుండా, వేదములలో చెప్పబడిన కర్మలను యథావిధిగా చేయుచుండిన యెడల ఆరాధించే దేవతలను సంతోషపెట్టుచున్నాడు. అందుచేత ఆత్మానందమును పొందుచున్నాడు.

## స్వర్గము

స్వర్గము, అనగా పూర్తిగా సంపాదింపబడినది అని, అసలు అర్థము. లేక, కలితీ లేనటువంటిదియు, శాశ్వతమైనటువంటిదియు, భగవంతునికి ముఖ్యభక్తులు అనుభవించే ఆనందమునకంటె, వేరైనదియును, అయిన సుఖము, స్వర్గమనబడును. కాని, అనేక కోరికలను ఈడేర్చుకొనుటకు యజ్ఞములను చేయువాడు మామూలుగా మనము అర్థముచేసికొనే స్వర్గలోకముపోయి అక్కడ, అనేకవిధములైన సుఖముల ననుభవించి పుణ్యము పూర్తిఅయిపోయిన తరువాత తిరుగ మనుష్యలోకమునకువచ్చి, అదేవిధముగా పుట్టుచు చచ్చుచు నుండును.

## జ్ఞాని

ఎవడు బ్రహ్మజ్ఞానమునుపొంది ప్రపంచములోని ప్రతి వస్తువును బ్రహ్మమేయని తెలిసికొనుచున్నాడో, వాడు బ్రహ్మమును నిజముగా తెలిసికొనినవాడు అగుచున్నాడు; అక్షరబ్రహ్మలో అంతర్భూతుడు అగుచున్నాడు, కాని పరబ్రహ్మ అనే పురుషోత్తమునిలో చేరడు. కారణ

మేమంటే వాడు అక్షరబ్రహ్మను మాత్రము ధ్యానించి అక్షరబ్రహ్మయే అన్నిటికంటె పైవాడు అని తలచుచున్నాడు.

## పూర్ణ పురుషోత్తముడు

బ్రహ్మజ్ఞానమును పొంది భక్తిమార్గమును అవలంబించిన యెడల పూర్ణపురుషోత్తమునిలో కలిసి, మోక్షమును పొందుచున్నాడు. ఇది అక్షరబ్రహ్మములో కలియుటకంటె శ్రేష్ఠమైనదికాని పూర్ణపురుషోత్తముని కంటెగూడ శ్రేష్ఠతరమైన పదవి మఱియొకటి యున్నది.

## భజనానందము లేక స్వరూపానందము

భగవంతునికి, ప్రత్యేకముగా, ఒక ఆత్మమీద అనురాగము ఉండినయెడల ఆ ఆత్మను విడదీసి తనవంటి దేవతాదేహమును ఇచ్చి, శాశ్వతముగా వానితో క్రీడించుచున్నాడు. ఈ క్రీడకు నిత్యలీల అనిపేరు.

భగవంతుడు భక్తునికంటె, తక్కువ స్థానమును తీసుకొని, భక్తునికి ఆనందమును కలుగజేయుచున్నాడు. ఈ ఆనందమునకు భజనానందము లేక స్వరూపానందము

అని పేరు. దీనినిగురించి తైత్తిరీయోపనిషత్తులోను, భాగవతములోను చెప్పబడి ఉన్నది. ఈ ఆనందము భగవంతునివల్ల స్వయముగా నీయబడుచున్నది. కాని మనుష్యుడు ఎంత ప్రయత్నము చేసినను లభించదు.

## పుష్టి

ఈ భగవత్ప్రసాదము, ఈ సిద్ధాంతములో పుష్టి అని చెప్పబడుచున్నది.

శ్రీకృష్ణునికి గోపికలు చూపినభక్తి, వారియెడల కృష్ణుడు చూపిన అనురాగమే దీనికి సరియైన ఉదాహరణము.

ప్రపంచమునకు భక్తిమార్గమును చూపినవారు ఈ గోపికలేయని వల్లభాచార్యులవారు చెప్పుచున్నారు.

'భగవంతుడు సమస్తము నైయున్నాడు.' అనే సిద్ధాంతమునకు సర్వాత్మభావము అనిపేరు. ఈ సర్వాత్మభావము, జ్ఞానులుపొందే సర్వాత్మభావము ఒకటి కాకపోవుటకు, ఈవల్లభసిద్ధాంతములో భక్తుడు భగవంతునిలో సమస్తమును చూచుచుండుటయే భేదమని తెలిసికొనవలెను.

జ్ఞానివిషయములో అట్లుకాదు. జ్ఞాని సమస్తము లోను బ్రహ్మను చూచుచున్నాడు.

గోపికలకు అట్టిశక్తి ఉండినది. ఆకారణము చేతనే భగవంతుడు గోపికలకు లోబడియుండినాడు. వల్లభాచార్యునియొక్క శుద్ధాద్వైత సిద్ధాంతములో బ్రహ్మానందముకంటె స్వరూపానందము శ్రేష్ఠమైయున్నది. అదియే అన్నిటికంటె గొప్పమోక్షము.

## రసము

భగవంతుడు రసములతో నిండియున్నాడు. అవి ఎనిమిది. ఈ ఎనిమిది రసములలో ప్రేమ అన్నిటికంటె శ్రేష్ఠమైనది. 'ప్రేమ' లేక శృంగారము రెండు విధములు.

౧. సంయోగము (కలియుట)

౨. విప్రయోగము (విడిపోవుట)

భక్తుడు దీనిని అనుభవించుటలో రెండుమెట్లు ఉన్నవి. భగవంతుని సన్నిధానములో సంయోగమును అనుభవించుచున్నాడు.

భగవంతుడు సమక్షములో లేనప్పుడు వియోగ కారణముచేత ఎల్లపుడు ఒకే దృష్టితో భగవంతుని ధ్యానించు.

చున్నారు. కొందఱు రెండవదానినే శ్రేష్ఠమైన మెట్టుగా భావించుచున్నారు.

## పుష్టిమార్గము - మర్యాదామార్గము

౧. మర్యాదా మార్గములో వేదములలో విధించిన మార్గమును అవలంబించి భగవంతునిమీద భక్తి కుదిరే వఱకు వేదశ్రవణముచేయుచు మనుష్యుడు ఉండినయెడల భగవంతుడు వాని ప్రయత్నమునకుమెచ్చి, వానిని తనలోనికి తీసుకొను చున్నాడు. అనగా వానికి సాయుజ్యమును ఇచ్చుచున్నాడు. సాయుజ్యము అనగా భగవంతునిలో కలియుట. ఇదియే మర్యాదామార్గము.

పుష్టిమార్గము అనగా భగవంతుని అనుగ్రహము. దానంతట అది తనకుకలిగి భగవంతునిమీద భక్తికలుగు చున్నది. భక్తితో వేదశ్రవణము మొదలైనవి చేయు చున్నాడు. ఈపుష్టిమార్గములో భక్తి పుట్టుటకొఱకు ప్రయత్నము చేయుటలేదు. భగవంతుని అనుగ్రహము చేత భక్తిపుట్టి భగవంతుని ధ్యానము చేయుచున్నాడు.

౩.వ మర్యాదామార్గము, బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులకుమాత్రమే అన్వయించును, స్త్రీలకు అన్వయించదు.

పుష్టిమార్గము, అన్ని జాతులకును, స్త్రీపురుషులకు కూడ అన్వయించును.

దీనికి అంగభేదము, జాతిభేదము, మతభేదములులేవు. దీనికి ప్రమాణములు ఉన్నవి.

౧. మర్యాదామార్గము నవలంబించువారు వేదములో విధించిన కర్మకాండను అవలంబించుచున్నారు. అనగా వర్ణాశ్రమ ధర్మముల ప్రకారము నడచుచున్నారు.

౨. పుష్టిమార్గము నవలంబించువారు జాతి మత భేదములు లేకుండా స్త్రీపురుషులతో సహా వారికి స్వభావసిద్ధముగానుండే భక్తిచేత భగవంతునికొఱకు ఆరాధన చేయుచున్నారు.

వల్లభాచార్యులవారు వారికాలములోనుండే దేశకాల పరిస్థితులను బాగా ఆలోచించి, వేదములలో చెప్పిన కర్మ జ్ఞానము, శాస్త్రయుక్తమైన భక్తి, ఆచరణలో లేకపోవుటను గమనించి, శూద్రులకు, స్త్రీలకు విధించబడిన నిషేధము న్యాయమైనది కాదని తెలిసికొని పుష్టిమార్గమును ప్రపంచమునకు చూపినారు.

ఇది, వల్లభాచార్యుల వలన క్రొత్తగా కనిపెట్టబడినది కాదు. ఈ మార్గము, ఉపనిషత్తులలోను, గీతలోను, భాగవతములోను బోధించబడియున్నది.

శ్రీరామానుజులవారు, ఇతరులుగూడ భక్తిమార్గమునుగురించి చెప్పియున్నారు కాని, వల్లభాచార్యులవలె, ప్రత్యేక సిద్ధాంతము చేసియుండలేదు.

శూద్రులకు స్త్రీలకు విధించబడిన నిషేధమును ప్రత్యేకముగా తొలగించియుండలేదు. ఆ కారణముచేత వల్లభాచార్యుల సిద్ధాంతములో పుష్టిమార్గము న్యాయముతోను సత్యముతోను కూడియున్నది.

వేదములను, వేదములలోని కర్మలను, జ్ఞానమును, శాస్త్రయుక్తమైన భక్తిని నిరాకరించకుండా, వాటికి తోడు భగవంతుడు ఇచ్చిన పుష్టిమార్గమునుగూడ ఏర్పాటుచేసినారు.

ఇతర వైష్ణవులుగూడ భగవదనుగ్రహముతో కూడు కొన్న భక్తిని ఒప్పుకొనుచున్నారు. కాని, దానిని వేదములో విధించబడిన నిబంధనతో చేర్చి ఆచరించుచున్నారు. అనగా మర్యాదామార్గముతో చేర్చి చేయుచున్నారు. ప్రత్యేక పుష్టిమార్గము అవలంబించి ఉండలేదు.

పుష్టిమార్గమును అవలంబించే భక్తులు 'స్నేహాత్మకులు' అని చెప్పబడుచున్నారు. ఈ విధముగా భక్తితో సేవించబడు భగవానుడు గోపీజ్ఞానవల్లభుడు అనబడుచున్నాడు.

## గోపికలు – మార్గదర్శకులు

పుష్టిమార్గమును మొదటచూపించిన గోపికలు, తమ మార్గమును అవలంబించినవారను అయి యున్నారు. పుష్టి మార్గములో అవలంబించబడిన భక్తి, గోపికల భక్తి వంటిది అయి యున్నది.

## భక్తుల జీవితము

౧. భక్తుడు, తనకు ఉండే సమస్తమును, భగవంతునికి సమర్పించి, అనగా తనకుటుంబములో నుండే అందరి యొక్క ఆస్తులు మొదలైనవానిని మొట్టమొదట భగవంతునికి సమర్పించి 'నాది' అనేది లేకుండా చేయ వలయును.

౨. భగవానుడైన శ్రీకృష్ణుడు, ప్రపంచము సమస్త మును జాతి మత భేదములేకుండా, ఉద్ధరించుటకు, అవత రించినాడని తెలియవలయును.

3. 'బ్రహ్మసంబంధము' అనే సంస్కారమును జేసి, దానిమూలముగా విడిపోయిన సంయోగమును ఆత్మకు భగవానునికి మధ్య పునరుద్ధారణ చేయవలయును. ఈ విధముగా భక్తునికిగల బలహీనతను తొలగించుకొని,

సేవకు అర్హతను సంపాదించుకొనవలెను.

౮. 'నేను - నాది' అనే భ్రాంతి లేకుండా, భగవంతునికి అర్పించిన సర్వమును స్వేచ్ఛగా దేహముతో సహా భగవంతుని సేవలో ఉపయోగించవలెను. దేహమును, ధనమును, సంపత్తును భగవంతుని సేవలో, వ్యయము చేయుట మూలముగా సంసారమును నాశము చేయవలయును. 'నేను - నాది' అనే భ్రమను నశింపుచేయవలెను.

జాతి మతము లేకుండా, ఈసంస్కారమును, సమస్త ప్రజలు చేయవచ్చును. అబద్ధమైన సంసారము ఈ విధముగా దేహమును, ధనమును, అర్పించుట మూలముగా నాశము చేయవలయును గాని, సన్యసించుట మూలముగా సంసారమును నశింపజేయుటకు ప్రయత్నించకూడదు. కలియుగములో సమస్తమును భగవంతునికి అర్పించకుండా సన్యసించడము వలన ఏమియు ప్రయోజనములేదని వల్లభాచార్యులుగారు చెప్పుచున్నారు.

భగవంతునియొక్క వియోగమువలన కలిగే బాధ లేనప్పుడు మాత్రము, సన్యాసమును అవలంబించవచ్చును అని ఆచార్యులవారు చెప్పియున్నారు.

## యోగ సూత్ర సిద్ధాంతము

ఆచార్యులవారు తనకడపటిరోజులలో భగవంతుని వియోగమును భరించలేనప్పుడు సన్యసించినారు.

శరీరము భగవంతుని సాన్నిధ్యమును బొందుటకు అడ్డుగానేర్పడినప్పుడే సన్యాసాశ్రమమును పొందవలయు నని ఆచార్యులవారి బోధన.

కుటుంబములో నుండువారు అందఱు భగవంతుని ఆరాధించవలెను. సేవ వలన వచ్చుఫలము అందఱికిని చెందును. సేవలలో నన్నిటికంటె గొప్ప సేవ, మనస్సుతో చేయబడుచున్నది. మనస్సుతో సేవచేయునపుడు భగ వంతుని గుఱించి మాత్రము ధ్యానించుచుండును.

కుటుంబములో ఎవరైనను సేవకు ఒప్పుకొనని యెడల వానికి వేఱుగాపోయి సేవచేయుటకు ఉత్తరువు యీయ బడును. ఈవిధముగా సేవచేయుటలో ప్రపంచబంధము లోనుంచి కుటుంబము విడువబడుచున్నది.

అందఱిజీవితమును భగవంతుని జీవితమగుచున్నది. ఇది ఆచార్యులవారి రెండవకుమారుడైన విట్టల్‌నాథ్‌జీ జీవితములో చూపింప బడినది.

ఈకాలములో వర్ణాశ్రమధర్మములను శాస్త్రములో విధించినప్రకారము చేయుట, సాధ్యమైన పనికాదు. ఒక

వేళ పైకిఉన్నట్లు కనుపఱుపచేసినను వాటివలన ఫలము కలుగదు.

భాగవతధర్మము అనగా భగవంతునిసేవ. భాగవత ధర్మమునకు, వర్ణాశ్రమధర్మమునకును పోటీ కలుగునెడల పుష్టిమార్గమును అవలంబించు భక్తుడు, భాగవతధర్మమునే అవలంబించవలెను.

భాగవతధర్మమును ముందుగానడపి, పిమ్మట సావకాశముగా వీలు ఉన్న యెడల వర్ణాశ్రమధర్మములను ఆచరించవచ్చును. అంతేగాని, భాగవతధర్మమును, ఎన్నటికిని విడువకూడదు.

ఇది నిజమైన ఆత్మధర్మము. వర్ణాశ్రమధర్మములన్ననో అవి కేవల శరీరధర్మములు. దేహమునకంటె ఆత్మ శ్రేష్ఠమైనదని వేరే చెప్ప నక్కఱలేదు కదా!

## పుష్టిమార్గ తత్వము

పుష్టిమార్గమును అవలంబించు పురుషుడు, తనయొక్క ఆత్మను, సమస్తమైన సంపదను, ధనమును, భగవంతునికి అర్పించి సర్వకాల సర్వావస్థలందును, భగవంతునే ధ్యానించుచున్నాడు.

తాను వేఱుగా నున్నానని భావన వానికి ఉండదు. కాబట్టి వానికి ఏవిధమైన ఆస్తియును ఉండదు. ముందు సమస్తమును భగవంతునికి అర్పించి తరువాత వాని అనుమతినిపొంది ఉపయోగించు కొనవచ్చును

ఆస్తినంతా భగవంతునికి అర్పించినప్పుడు, హక్కు భగవంతునిదికాని వానిది కాదు.

పుష్టిమార్గమును అవలంబించువాడు, నీతి, న్యాయములు తప్పి ఎన్నటికిని నడువడు. కారణ మేమనగా, పుష్టిసిద్ధాంతము, విరక్తి, విసర్జనలమీద ఆధారపడి ఉన్నది, గాని భోగములమీద ఆధారపడదు.

పుష్టిమార్గము అన్నిజాతులు, అన్నికులములు, అన్ని తరగతులు, స్త్రీలు, పురుషులు, నాలుగు వర్ణములు, చెడుబుద్ధులచేత పాపములనుచేసి పడిపోయినవారు, మొదలయిన వారందఱికిని సమానముగా ఉపయోగించుకొని, దానిఫలమును అనుభవించుటకు, హక్కు ఉన్నప్పటికిని నీతితప్పి నడచుటను ఒప్పుకొనదు.

ఎంత చెడుకార్యమునైన ఇష్టమువచ్చినట్లు చేయుటకు పుష్టిమార్గము అనుమతించుచున్నది, అని తలచ కూడదు. సరియైనమార్గమున యధావిధిగా నడపించిన, ఇది, భక్తులకు రక్షణ నిచ్చుచున్నది.

## యోగ సూత్ర సిద్ధాంతము

పుష్టిమార్గ సిద్ధాంతసారము, ఆత్మకును భగవంతునికిని సంయోగమును కలుగజేయుటయే. అది దాని ముఖ్యోద్దేశము.

దీనినిపొందు మార్గములు అనేకములుగా నున్నవి. ౧. ఎప్పుడును, కోపముతో నుంటున్నప్పటికిని సాయుజ్యమును పొందుట సాధ్యమగుచున్నది.

సంయోగమును కలుగజేసే సాధనము కోపమైనను ఈర్ష్య, ఓర్వలేనితనమైనను, లేక భక్తిఅయినను లేక ఉద్రేకమైనను, వీటిలో నేదియైనను, ఆత్మను భగవంతునితో కలుపునుపాయము కావచ్చును. భక్తుడు నిజమైన భక్తిప్రేమలతో భగవంతుని పొంది నిత్యనిలయమును అనుభవించి భజనానందమును అనుభవించుటకు అర్హుడు అగుచున్నాడు.

ఇతరులు సాయుజ్యమును మాత్రము పొందుచున్నారు.

నిత్య నిలయ, భజనానందము సాధ్యముకాని వారు నిరుత్సాహ పడకూడదు.

అటువంటివారు భగవంతుని కాళ్ళమీదపడి, వాని దయకు పాత్రులై ఉండవలెను. దీనిపేరు ప్రపత్తి. అనగా సమస్తమును సమర్పించి శరణు జొచ్చుట.

## భగవంతుని నామము

ఈ సిద్ధాంతములో సేవించు భగవంతుని పేరు 'గోవర్ధన నాథజీ' లేక, 'శ్రీనాథజీ' అనగా, భాగవతము లోని ౧౨ స్కంధముయొక్క స్వరూపము వీరి దేవాలయము. ఇది మేవార్ దేశములో నాథద్వార్ గ్రామములో నున్నది. అనగా భాగవతములో ఏకృష్ణభగవానుని గురించి భక్తిమార్గము బోధించబడి యున్నదో ఆకృష్ణభగవానుడే ఈ నాథజీ అని తెలియవలయును.

## ౧౨. స్కంధములు —

భాగవతములోని ౧౨ స్కంధములు నాథజీ దేహము లోని ౧౨ భాగములై ఉన్నవి.

రాసలీలలు వర్ణింపబడియుండు ౧౦వ స్కంధము నాథజీ హృదయమని తెలియవలెను.

నాథజీ విగ్రహము వంశపరంపరగా, పెద్దలనుంచిమనకు చెప్పబడినప్రకారము, గిరిరాజాపర్వతముమీద నున్నట్లుగా భగవంతుని వలన ఆచార్యులవారికి తెలియచేయబడి తరువాత నాథ ద్వారమునకు తేబడినది. ఆ విగ్రహము భగవంతుడైన పూర్ణపురుషోత్తముని విగ్రహము.

## యోగ సూత్ర సిద్ధాంతము

ఈ విగ్రహమును పూజించుట సేవ యనబడును.

పరమేశ్వరుని, విభూతులను ఆరాధించుట పూజ యనబడును.

## శుద్ధాద్వైతము

ఈ సిద్ధాంతము, నాలుగువ్యూహములను, అనగా, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, అనువాటిని మోక్షమును ఇచ్చునట్టివిగాను, ధర్మమును స్థాపించి ప్రపంచముయొక్క భారమును, తగ్గించునట్టివిగాను, అంగీకరించి ఉన్నది.

ఈవ్యూహములు, పూర్ణపురుషోత్తమునికంటె తక్కువ తరగతికి చెందియున్నవి.

పూర్ణపురుషోత్తముడు, మిక్కిలి దీనదశలో నున్న వారినిగూడ, పైకి ఎత్తగలిగిన శక్తి గలిగియున్నాడు.

భగవంతుడు చేయు పనులనుబట్టి వ్యూహమా? లేక పూర్ణపురుషోత్తముడా? అని కనిపెట్టవచ్చును. కాబట్టి ఆచార్యులవారు నాథజీ సేవయే శ్రేష్ఠమైనదని బోధించి యున్నారు.

పైన చెప్పినదంతయు వల్లభాచార్యులవారిచేత స్థాపింప

బడిన శుద్ధాద్వైత సిద్ధాంతము.

ఇది అంతయు వల్లభాచార్యులుగారి వలన స్వయముగా స్థాపించబడినదేగాని, పుష్టిమార్గము మొదలైనవి, విష్ణు స్వామిగారి సిద్ధాంతములలోనుంచి తీసికొనబడినవి అని చెప్పుట సరికాదు.

## పుష్టిమార్గము - రాసలీల

పుష్టిమార్గములో, రాసలీలను కలిపినపుడు సామాన్య ప్రజల మనస్సులోను. ఇతరుల మనస్సులోను తప్పు అభి ప్రాయము కలుగవచ్చునని ఊహించి, ఆచార్యులవారు ఆవిషయమై హెచ్చరిక చేసిఉన్నారు.

గోపికలకథ నిజమని తీసికొనవచ్చును లేక విగ్రహము గాను, తీసుకొనవచ్చును. నిజమని తీసుకొనినయెడల, రాసలీలలో స్త్రీపురుష సంభోగము గాని, వాంఛ గాని లేదు అని గ్రహించవలెను.

భాగవతములో ప్రపంచసంబంధమైన సంభోగము ఉన్నట్లు కనబడుచున్నప్పటికిని, అటువంటిది నిజముగా నున్నట్లు తలపకూడదు. అంతేగాదు గోపికల భక్తిని గమనించిన యెడల మనస్సులోనుండే కోరికలు, ప్రపంచ

సుఖములు అన్నియును నశించి పోవుచున్నవని గ్రహించవలయును.

వల్లభాచార్యులవారు ఈ విషయమై వ్రాసిన శ్లోకములను శ్రద్ధతో చదివినయడల నిజతత్వము బోధపడగలదు.

రాసలీలను విగ్రహముగా తీసికొనినయడల దానికి అర్థము 'శ్రుతులు భగవంతుని గురించి బోధించినట్లు గోపికలభక్తి భగవంతుని గురించిమాత్రమే బోధించుచున్నదని తెలియవలయును.' అని ఆచార్యులవారు బోధించియున్నారు.

---

# బౌద్ధసిద్ధాంతము

బౌద్ధసిద్ధాంతమును గుఱించి చర్చించుటకు ముందు బుద్ధుడు పుట్టునప్పటికి, దేశములోని వేదమతము, ఉపనిషత్తుల సిద్ధాంతములు, ఇతర మతసిద్ధాంతములు ఏ స్థితిలో నున్నవి? బౌద్ధమతము పుట్టుటకు కారణము ఏమి? బౌద్ధమతమునకును, వేదములకును, ఉపనిషత్తులకును, భగవద్గీతకును ఏమైన సంబంధము ఉండినదా? లేక బౌద్ధమతము ప్రత్యేకము వేఱైనమతమా? ఈసంగతులు ముందుగా ఆలోచించుదము.

వేదములలో చెప్పబడిన కర్మకాండను అనుసరించి యథావిధిగా కర్మలు చేయబడుచుండె. జీవహింసతో కూడుకొన్న యజ్ఞములు, యాగములు విరివిగా చేయబడు చుండెను. స్వర్గాది కర్మఫలముల కొఱకు కర్మలు చేయ బడుచుండెను.

ప్రథమములో యజ్ఞములలో మనుష్యులను బలియిచ్చు చుండిరి. తరువాత గుఱ్ఱములు బలి యియ్యబడెను. తర్వాత ఆవులు, పిమ్మట గొఱ్ఱెలు, అటుపిమ్మట మేకలు,

పిమ్మట భూమిలో పండిన బియ్యము, (బార్లి) యవధాన్యము యొక్క పిండితో పురోడాశము అనే పిండము, మొదలయినవి బలి యిచ్చుచుండిరి. యజ్ఞములో ఈవరుసన ఒక దానితరవాత మఱొకటి బలియిచ్చుచు వచ్చిరి. ఆఖరుకు పైనచెప్పిన పురోడాశపిండముతో చేయబడు యజ్ఞమునకు జంతుబలితో చేయబడు యజ్ఞమున కున్నంత ఫలము లభించునని చెప్పబడెను. మనుష్యజంతుబలులను గుఱించి వేదములోనే చెప్పబడియున్నది.

ప్రస్తుతకాలములో నేతితో యజ్ఞము చేయబడుచున్నది. రొట్టెతో కూడ చేయబడుచున్నది. మొదటి దానికి 'ఘృతపశు' అనియు రెండవదానికి 'పిష్టపశు' అనియు పేళ్ళు. పశువునకు బదులు నేయి, రొట్టెలు ఈయబడుచున్నవి అని అర్థము.

గుమ్మడికాయగాని లేక చెఱకు గణుపుగాని ఈ కాలములో ఇయ్యబడుచున్నది.

## పశుయజ్ఞము

బుద్ధునికాలములో జంతువులే బలి యీయబడుచుండెడివి. జంతుహింసయందు నమ్మకము పోయి కొందరు

వాటివల్ల ఏమియు ప్రయోజనము లేదని నమ్మి, వేదకర్మ లను ఎదుర్కొనుటకు ప్రారంభించిరి. ఆలాగు ఎదుర్కొని క్రొత్తమతములను ప్రారంభించినవారు బౌద్ధులు, జైనులు అయిఉండిరి. జైనమతమును స్థాపించిన మహావీరుడు, బుద్ధుడును, ఒకకుటుంబమునకు, ఒకసిద్ధాంతమునకును, చెందియుండి తరువాత విడిపోయి, బుద్ధుడు బౌద్ధమత మును, మహావీరుడు జైనమతమును స్థాపించిరి.

పశుహింసతో కూడుకొన్న యజ్ఞములు, అశుచితో కూడుకొన్నవనీ, అటువంటి కర్మలగుండా నిర్వాణ మును పొందుట సాధ్యముకాదనీ బుద్ధుడు, మహావీరుడు కూడ గొప్ప ప్రబోధము చేయుటకు ప్రారంభించిరి.

వేదమతములో ప్రథమమున, ప్రకృతిస్వభావమునే పూజించుచుండిరనియు తరువాత మనుష్యరూపముతో చేయబడిన విగ్రహములను పూజించుచుండిరనీ కొందఱు చెప్పుచున్నారు. మఱికొందఱు సర్వత్ర ఒకటే ఆత్మ, వ్యాపించి యున్నదని చెప్పుచుండిరి.

## వేదములు - భగవంతుడు

వేదములు అనేక దేవతలను పూజించుచున్నవని కొందఱును, మఱికొందఱు ఒకపరమాత్మనే పూజించు

చున్నవనియు చెప్పుచుండిరి.

ఈ భేదాభిప్రాయములకు కారణమేమనగా ౧. కర్మమార్గమందు ఉండే నమ్మకముచేత, ఫలములన్నియు, దేవతల వల్లనే ఈయబడుచున్నవనీ, భగవంతుడు అవసరములేదనియు, ఒకగొప్ప నమ్మకము ప్రజలమనస్సులో నాటుకొని ఉండినది.

స్వర్గాది ఫలములన్నియు దేవతలవల్లనే ఇయ్యబడుచున్నవని కర్మలుచేయువారి నమ్మకము. ౨. వేదములలో చెప్పబడినది ఒకే దేవుడు అనీ అది ఆత్మయే అనీ సిద్ధాంతము. అది దేవునియందలి నమ్మకమును తొలగించినది అనికూడ వాదించబడినది. కారణమేమంటే, ఒకడే దేవుడు ఉన్నయెడల, ఆ దేవుడు మనుష్యుడే అయి ఉండవలెను. లేక అతనియొక్క ఆత్మయే అయి ఉండవలెను. అని వాదము.

ఎవరి ఆత్మను వారే చంపుకొనరు కదా! పూజించేవాడు పూజింపబడేది, ఉంటేనేకాని దేవుడు ఉన్నాడు అనే భావము కలుగదు.

## సృష్టి - నాశము

జగత్తుయొక్క సృష్టికి, వినాశమునకు భగవంతుడు

ఉండవలెనని కొందఱు వాదించగా, మఱికొందఱు, జగత్తు యొక్క సృష్టిగాని నాశముగాని లేవేలేవు అని వాదించు చున్నారు. అనగా ప్రపంచము ఎల్లప్పుడును ఒకేవిధముగా ఉన్నదని దానిలో కొన్నిమార్పులు అప్పుడప్పుడు ఇతర కారణములచేత కలుగుచున్నవనీ చెప్పుచున్నారు.

సృష్టి ప్రళయములు ఉన్నవని ఒప్పుకొన్నప్పటికిని భగవంతుడు ఉండవలసిన అవసరములేదు. వాటి రెంటికిని కారణములు వేరే ఉన్నవని చెప్పుచున్నారు

సృష్టి, ప్రళయములు రెండును పురుషుడు, ప్రకృతి, అనగా, ఆత్మ, ప్రకృతిస్వభావములవల్లనే చేయబడుచున్న వని చెప్పుచున్నారు. నిర్వాణమును పొందుటకుకూడ భగవంతుని సహాయము అవసరములేదు అనీ, మనుష్యుడు తనంతట తానే విధించబడిన మార్గమును అవలం బించుటచేత పొందగలడనీ చెప్పుచున్నారు.

కర్మమార్గమువలన మోక్షము కలుగదని కనిపెట్టిన పిమ్మట, జ్ఞానమార్గము ఉపనిషత్తులలో బోధించబడినది. అనగా కర్మలకుబదులు, ధ్యానము బోధించబడినది.

## ధ్యానము యోగము

ధ్యానములోనుంచి యోగము కనిపెట్టబడినది.

## యోగ సూత్ర సిద్ధాంతము

బుద్ధునికాలమునకు, చాల పూర్వమునుంచి, దేశములో, ధ్యానము, యోగము, అభ్యసించు బడుచుండెను. బుద్ధునిరాకకు పూర్వము, ప్రకృతికి స్వభావములగు తలంపులను గుఱించియు, జ్ఞానమునకు సంబంధించిన తలంపులను గుఱించియు జంతుహింసతో కూడిన కర్మలను గుఱించియు పూర్వకర్మ ఫలములను గుఱించియు, జగత్తు నిజముగా ఉన్నదా? లేదా? అనే విషయమును గుఱించియు, జగత్తు ప్రకృతిలోనుంచి పుట్టుట, కాలములో నుంచి పుట్టుటలను గుఱించియు, నిర్వాణమును పొందుటకు కావలసిన శిక్షణమును గుఱించియు, వేఱు వేఱు అభిప్రాయములతో ఏర్పరుపబడిన క్రొత్త సిద్ధాంతములు బుద్ధుని కాలమునకు పూర్వమే స్థాపింపబడి తీవ్రముగా పనిచేయుచుండినవి.

## కోరికలు - భోగములు

మనుష్యునకు, ప్రపంచసంబంధమైన కోరికలు భోగములు మొదలైనవాటిపై ఆశ ఎక్కువగా నుండుచు వచ్చెను. క్రమేణా కోరికలవల్లను భోగములవల్లను ప్రయోజనము లేదని తెలిసికొనినవారు విరక్తి పొంది

మనస్సును త్రిప్పి, ఇంద్రియనిగ్రహము, తపస్సు చేయుచు, శరీరమునకు కష్టమును కలుగజేయుచు బ్రహ్మచర్య వ్రతమును అవలంబించుచు, శమము, అనగా మనోనిగ్రహమును, దమము, అనగా ఇంద్రియ నిగ్రహములను, మోక్ష మార్గమును అవలంబించినవారు అనేకులు బుద్ధుడు రాక పూర్వమే దేశములో నుండిరి.

బుద్ధుని రాకకుపూర్వము దేశము మతవిషయములో గొప్ప ఉన్నతస్థితిలో నుండినది.

మోక్షమునకు మూలసాధనమైన బ్రహ్మచర్యవ్రతము ఆచరణలో నన్నివైపుల నుండుచువచ్చెను.

---

# ఉపనిషత్తులలోని సిద్ధాంతములు

ఉపనిషత్తులలో బోధించబడిన పరబ్రహ్మ లేక పరమాత్మసంబంధమైన సిద్ధాంతము ప్రజలయొక్క మనస్సులను పూర్ణముగా ఆకర్షించి పనిచేయుచుండినది.

దేశము ఇట్టి పరిస్థితులలోనుండగా బుద్ధుడు తల్లి గర్భమున జన్మించెను. పెరిగి పెద్దవాడు అగుచుండగా ఉపనిషత్తులలో బోధించబడిన సూత్రములను, మఱి యితర సిద్ధాంతములను గ్రహించినాడు.

ద్రవ్యయజ్ఞముకంటె, జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనది అను ఉపనిషత్తులలో సిద్ధాంతమును, బుద్ధుడు బాగా గ్రహించినాడు. వేదాంతులతోపాటు బుద్ధుడుగూడ జ్ఞానయజ్ఞ సిద్ధాంతమునే అవలంబించినాడు.

బుద్ధునికాలము వచ్చునప్పటికి, వేదములలోని కర్మకాండను, హింసతోకూడుకొన్న యజ్ఞములను, స్వతంత్ర బుద్ధితో ఖండించువారు ఒకవైపున, ప్రబలమైన ప్రబోధ

మును చేయుచుండిరి. రెండవవైపున వేదవిధులను సమర్థించువారుగూడ ఎక్కువ స్వతంత్రతతో పని చేయుచుండిరి. అట్టి వాతావరణలో విద్యను అభ్యసించి శాస్త్రములను పఠించుచుండిన బుద్ధునియొక్క యుక్తాయుక్త పరిజ్ఞానము న్యాయాన్యాయ విచక్షణబుద్ధి స్వతంత్రత, అన్ని గుణములుకూడ మిక్కిలి గొప్పస్థితిలో నుండినవి. ఉపనిషత్తులకును, ఇతర శాస్త్రములకును తనబుద్ధికి న్యాయమని తోచినట్లు అర్థముచేసి యుక్తమని, న్యాయమని తోచిన సిద్ధాంతములను, ఉపనిషత్తులలోనుంచియు ఇతర శాస్త్రములలోనుంచియు ఆమోదించి, తన నూతన మత సిద్ధాంతములో చేర్చుకొనుచు, తప్పు అని తోచినవాటిని నిరాకరించుచుండిరి.

ఉపనిషత్తులలో చెప్పబడిన సిద్ధాంతములనే బుద్ధుడు తన సిద్ధాంతములోను బోధించుచున్నప్పటికి, ముఖ్య సిద్ధాంతముమీద, భేదాభిప్రాయమును, చూపించి యుండుటచేత, బౌద్ధమతము, హిందూమతము కాదనీ, అది ప్రత్యేకమతమనీ, శుద్ధవైదికులు - చెప్పుచువచ్చిరి.

౧. వేదాంతములలో పరమాత్మ లేక పరబ్రహ్మ అనే దేవుడు, ఒక్కడే ఉన్నాడని బోధించబడి యున్నది. బుద్ధుడు దీనికి ఒప్పుకొనలేదు. ప్రత్యేకముగా దీని.

కాక వ్యతిరేకసిద్ధాంతమును స్థాపించినాడు. ఈ కారణము చేత, శ్రీ శంకరులవారు బౌద్ధమతమును తీవ్రముగ ఖండించి యున్నారు.

పరమాత్మ అనే శబ్దమునకు శ్రీ శంకరులవారు చెప్పిన అర్థమును, బుద్ధుడుచేసిన అర్థమును బాగా ఆలోచించి చూచినయెడల, ఇద్దరు చెప్పినదియు నొకటియే అని తేలుచున్నది.

వేదాంతములో, జగత్తు అశాశ్వతము అనీ, ఈవేళ ఉంటె రేపు నశించును అనీ చెప్పబడినది. బౌద్ధమతములో జగత్తు ఆకాశములో కట్టబడిన పట్టణమువంటిదనీ, అది వట్టి భావమనీ, లేనిదానినిగానే భావించవలసినది అనీ, చెప్పబడియున్నది. మఱియు జగత్తుయొక్క రూపము లేనిది ఉన్నట్లు అజ్ఞానమువల్ల కల్పింపబడినదే గాని, నిజస్వరూపము కాదని బుద్ధుని సిద్ధాంతము, దీనిని గుఱించి, ఈ క్రిందివిధముగా సంవాదములో చూపబడినది.

జగత్తునకు పైకి కనుబడినది నిజరూపము కాకపోయిన, దాని నిజరూపము ఏది? అని ప్రశ్న!

జవాబు: ధర్మత, అనగా ఒక (ధర్మముగా) ఉండడము.

ప్రశ్న: ధర్మత, అంటేఏమిటి?

జవాబు: స్వంతముగా నుండుట, అనగా స్వాభావము.

ప్రశ్న: స్వభావము స్వంతముగా నుండుట అనగా ఏమి?

జవాబు: ప్రకృతి, స్వభావము.

ప్రశ్న: ప్రకృతి, స్వభావము అంటే ఏమిటి?

జవాబు: ఏమియు లేకుండా ఉండుట (Voidness) (శూన్యత)

ప్రశ్న: శూన్యత, అంటే ఏమిటి?

జవాబు: తనకు తాను లేకుండా ఉండుట.

ప్రశ్న: అంటే ఏమిటి?

జవాబు: అటువంటిది (Suchness) తత్త్వ,

ప్రశ్న: అంటే ఏమిటి?

జవాబు: మార్పులేనిది శాశ్వతమైనది అనగా మఱియొక దానిమీద ఆధారపడక స్వతంత్రముగా నుండునది.

ఈ విధము, ఇదివఱకు, ఉండియుండలేదు. ఇకముందు ఉండబోదు. (అభూతత్వభావము).

ఉదా: నిప్పుయొక్క స్వభావము ఏమిటంటే, ఏమియు లేకపోవుట; అనగా దానికిఉత్పత్తి లేకపోవుట(అనుత్పాద) అది, దానియొక్క వేడిగాదు. ఎందుకంటే వేడి, కారణములు, షరతులమీద, ఆధారపడియున్నది గనుక, మొదట లేకుండాఉండి ఇప్పుడు ఉత్పత్తి అగుచున్నది.

ఈ విధముగా ఏదియు కనుపడదు. ఏదియు కనుపడ కుండనుపోదు. ఏమియు లేనిదానికి అంతమున్నది. ఏదియు శాశ్వతముకాదు, ఏదియు ఒకేమోస్తరుగా నుండదు. ఏదియు వేఱుగాలేదు. ఏదియును ఇక్కడికిరాదు, అక్కడికిపోదు. ప్రాతిత్యసముత్పాదము అనగా ఒకదాని మీద ఆధారపడిన యుత్పత్తి.

## శూన్యవాదము - విజ్ఞానవాదము

ఈవిధముగా ఆలోచించి చూచినయెడల బౌద్ధమతము లోని శూన్యవాద సిద్ధాంతమునకు "ఆరోపించబడిన ఉపాధులను నిరాకరించుచు, పైనగాని లోపలగాని కనబడు చుండే జగత్తు అంతేయు ఆకాశములో కట్టబడిన "గంధర్వ నగరమువలె అబద్ధమైన" దని అర్థముచేయవలెను.

జగత్తుఅంతా పైనగాని లోపలగాని, అబద్ధము అని స్థిరపఱచబడినపుడు 'నేను—నాది' అనే భావముపూర్తిగా నశించుచున్నది.

తెలిసికొనబడేది, తెలిసికొనేవాడు, రెండును లేనప్పుడు 'నేను—నాది' అనేభావమునకు స్థానములేదు. సంసారము యొక్క వ్రేళ్ళు, ఈ 'నేను-నాది' అనే భావములోనే నాటుకొని ఉన్నవి.

భావము నశించినపుడు సంసారముకూడ నశించుచున్నది.

శూన్యవాదులయొక్క ముఖ్యఉద్దేశము. 'నేను—నాది' అనే భావమును నశింపుచేయుటయే. అనగా ఆత్మను, ఆత్మకుచెందినవాటిని నశింపుజేయుటయే అయి ఉన్నది.

'శూన్యతను గురించి, ధ్యానముచేసినపుడు అహం భావము, వెలుపల బయటకూడ నశించుచున్నది. 'నేను—నాది' అనేభావము నశించునపుడు, ఉపాధులన్నియు నశించుచున్నవి.

ఉపాధులు అనగా, కామము, భ్రాంతి, కర్మలయందు కాంక్ష. ఆత్మవాదము, అనగా ఆత్మ ఉన్నదనేవాదము. సమస్తమును, నశించుచున్నవి. ఇవిఅన్నియు నశించుట లోనే మఱల పుట్టుక కలుగుచున్నది.

ఈవిధముగా కర్మలు, కోరికలు, నశించినపిమ్మట మోక్షము పొందబడుచున్నది.

పైనచెప్పబడిన జగత్తుయొక్క నిజ స్వరూపవర్ణనయే, ఉపనిషత్తులలో చెప్పబడిన పరమాత్మవర్ణన అయిఉన్నది.

పరమాత్మను గురించి అడిగినపుడు. ఇదికాదు, అది కాదు, కాదు, లేదు, అనే జవాబు ఉపనిషత్తులలో ఏవిధ ముగా చెప్పబడి యున్నదో అదేవిధముగా బౌద్ధసిద్ధాంత ములోగూడ, ఆత్మయొక్క నిజస్వరూపము పైనవర్ణించ

బడినట్లు చెప్పబడియున్నది.

శ్రీ శంకరులవారి గీతాభాష్యములో పరమాత్మను గురించి వర్ణించుచు 'పరమాత్మఅనగా గొప్పశక్తి' అని వ్రాసియున్నారు.

బుద్ధుడుగూడ ప్రపంచమును నదితోపోల్చి 'శక్తి,' అని చెప్పియున్నాడు.

కాబట్టి భగవంతుడులేడు, అని బుద్ధుడు చెప్పినప్పుడు జగత్తును నడిపించేశక్తి లేదని చెప్పినట్లు భావించకూడదు.

## విజ్ఞానవాదము - వేదాంతము

వేదాంతములో జగత్తు అంతా బ్రహ్మమని చెప్పబడి ఉంటే బౌద్ధమతములో బుద్ధుడు ఇది అంతా చిత్తము, లేక, మనస్సు, అనిచెప్పియున్నాడు, అనగా మనస్సే ఈ జగత్తును సృష్టించి ఉన్నది, అని చెప్పిఉన్నాడు.

మనస్సు అన్నను, బ్రహ్మము అన్నను, ఒకటేఅని ఉపనిషత్తులలో చెప్పబడియున్నది.

కాబట్టి ఈ అర్థములో భగవంతుడులేడు అనుట బౌద్ధ సిద్ధాంతము అని తలచగూడదు.

విజ్ఞానవాదము, ఉపనిషత్తుల మీాదనే ఆధారపడి ఉన్నదని చెప్పబడి ఉన్నది.

గౌడపాదుని వ్యాఖ్యానముతో గూడ వేదాంతమును చదివినయెడల విజ్ఞానవాదము ఉపనిషత్తులమీద ఆధార పడియున్నదని స్పష్టపడుచున్నది.

ఉపనిషత్తులలో బ్రహ్మమనీ ఆత్మ అనీ చెప్పబడునది విజ్ఞానము, లేక జ్ఞానము, అయి యున్నది.

కాబట్టి బ్రహ్మవాది లేక ఆత్మవాది, అని పిలువబడు వాడు, విజ్ఞానవాదియే అయి ఉన్నాడు.

## బ్రహ్మము, ఆత్మ, విజ్ఞానము

బ్రహ్మము, ఆత్మ, విజ్ఞానములు మూడును ఒకటియే యని ఈక్రింద చెప్పబడినట్లు స్పష్టపఱుప బడినది.

౧. "వాస్తవములో ఇదిఅంతయు ఆత్మయే" అని ఛా॥ ఉ– 2 – ౨౫ – ౨ లో చెప్పబడిఉన్నది.

౨. "బ్రహ్మయే ఇది అంతా" అని ముండక ఉ ౨. ౨. ౧౧

3. "ఇది అంతా బ్రహ్మము" అని ఛా॥ ఉ॥. 3. ౧౪. ౧.

౪. "దీనిలో వేఱుభావములేదు. వేఱుగా ఉన్నట్లు చూచు వానికి జనన మరణములే ప్రాప్తించును" అని బృ. ఉ॥ ౪. ౪. ౧౯ లో నున్నది.

పైనచెప్పిన నాలుగు ఉదాహరణములకును ఇది అంతా విజ్ఞానమే అని అర్థము. అనగా, ఈ కనపడే

జగత్తు అంతా వట్టిభ్రాంతి. బ్రహ్మము, లేక విజ్ఞానము ఈరూపములో నున్నట్లు భ్రాంతిచేత కనపడుచున్నవి. అంతేగాని, దానియొక్క నిజస్వరూపము ఏదనగా, బ్రహ్మము, లేక, విజ్ఞానము, అని తెలియవలెను. పైనచెప్పిన బౌద్ధ సంవాదములో, ఈజగత్తుయొక్క నిజస్వరూపము ఏది? అన్న ప్రశ్నకు జవాబు ఈవిధముగా చెప్పబడినది. మొదటిప్రశ్న మొదలు ఇంతవఱకును చదివినయెడల బాగా బోధపడును.

## బుద్ధుని వాక్యములు

పైనచెప్పిన నాలుగు ఉపనిషత్తులలోని వాక్యములను బుద్ధునియొక్క యీక్రిందివాక్యములతో పోల్చి చూచెదము. బుద్ధుడు ఈవిధముగా చెప్పినాడు. "ఓ జినపుత్రులారా! ఆ మూడు అంతస్థులుగూడ చిత్తమే" అని తెలిసికొనుడు. అనగా చిత్తము, మనస్సు, విజ్ఞానము, మూడుగూడ ఒకటేఅర్థము.

కాబట్టి బౌద్ధసిద్ధాంతములోను, వేదాంత సిద్ధాంతములోను, రెండింటిలోగూడ, పైకికనబడే ప్రపంచము నిజమైనదికాదు అని స్పష్టపడుచున్నది.

నిజమైనట్లు కనుబడుటకు కారణము. అజ్ఞానమని

వేదాంతము చెప్పుచున్నది.

బౌద్ధ సిద్ధాంతము వాసనాకారణమని చెప్పుచున్నది. అనగా అజ్ఞానము లేక వాసనా విజ్ఞానమును జగత్తుగా కనబడేటట్లు చేయుచున్నది.

ఎండమావులలోని నీళ్లు, కలలోకనుబడు వస్తువులు, భ్రాంతిలో కనుబడు వస్తువులు, ఎంతనిజములో, ఈజగత్తు గూడ అంతేనిజము అని అర్థము. ౪. ౨. ౪౫.

## జగత్తు నిజము కాదు

'జగత్తు నిజము కాదు అది వట్టిభావము' అనియే, వేదాంతములో చెప్పబడిన సిద్ధాంతమును గుఱించి గౌడ పాదుడు తన, మాండూక్యకారికలో పూర్తిగా సమర్థించి ఉన్నాడు. దీనిని గుఱించి దానిలో ఈ క్రిందివిధముగా నున్నది.

తెలుసుకొనువాడు, తెలిసికొనబడే విషయము, అను ద్వంద్వము, మనస్సు (Vibrations) అలలవలె కదలు చుండుట వల్ల సృష్టించబడుచున్న వేగాని సత్యముకాదు. మనసునకు చూడబడు విషయము అనునదిలేదు. అదిసంగ రహితమైనదని చెప్పబడుచున్నది. ఏవిషయమునందును

కోరికలేనిది అగుటచేత 'అసంగ' మని చెప్పబడుచున్నది.
౪. ౪౧

మనసుయొక్క చలనము (Vibration) అనగా మనసుయొక్క పనిచేయుట, నిప్పుకట్టె, కదలుటవల్ల ఒకప్పుడు నేఱుగీతలవలెను, ఒకప్పుడు వంకర టింకరగను ఏలాకనుబడుచున్నవో, ఆలాగేవిజ్ఞానముయొక్క కదలిక గూడ చూచువాడు చూడబడువస్తువుగా కనుబడుచున్నవి.
౪. ౪౨

నిప్పుకట్టె కదలకుండా ఉన్నప్పుడు దానిమంటలు వంకరటింకరలు ఏలా ఏర్పడవో ఆలాగు విజ్ఞానము చలనములేక స్థిరముగా నున్నప్పుడు తెలిసికొనేవాడుగాని తెలిసికొనబడేవస్తువుగాని కనబడదు. ఈవిధముగా దానికి పుట్టుకలేదు.
౪. ౪౩

నిప్పుకట్టెకదలినప్పుడు కనుపడే పంక్తులు దానిలో నుంచియే పుట్టుచున్నవి. కదలకుండా ఉన్నప్పుడు అవి దానిలోనే ఉండును. అప్పుడు దానిలో ప్రవేశించడ మనేదిలేదు.
౪. ౪౪

విజ్ఞానమునుగూడ అట్లే అని అర్థము చేసికోవలెను. కలలో ఏవిధముగా లేనివస్తువులు ఉన్నట్లు కనుబడు చున్నవో, అదేవిధముగా మేలుకొన్నప్పుడుగూడ, లేని

వస్తువులు ఉన్నట్లు కనబడుచున్నవి. ౩. ౨౧.

కలలో సాటిలేని మనస్సు ద్వంద్వముగా ఏలాగు కన బడుచున్నదో అలాగే మేలుకొని యున్నప్పుడుగూడ సాటిలేని మనస్సునకు ద్వంద్వముగా కనబడుచున్నది.

గౌడపాదుడు, ఈ విధముగా అర్థముచేసి బోధించి యున్నాడు.

టి, నాన్‌జీ, అను పండితుడు వ్యాఖ్యానము చేసిన 'లంకావతార' మను, బౌద్ధవిజ్ఞానమునకు సంబంధించిన గొప్ప గ్రంథములో ఈ క్రిందివిధముగా వ్రాయబడి యున్నది. ఇది అంతా చిత్తము, అది రెండు రూపము లుగా వచ్చుచున్నది. ఒకటి తెలుసుకొనేవాని రూపము గను, రెండవది తెలిసికొనబడే విషయముగను వచ్చు చున్నది. ఆత్మగాని, దానికి సంబంధించినది ఏదియుగాని లేదు. (౩. ౧౨౧ పే. ౨౯)

మనసు మాత్రమేఉన్నది. కనబడునది లేదు. దానికి నాశములేదు. అది శాశ్వతమైనది కాదు.

(౩. ౯౫ పే. ౧౮౧)

మనుష్యునియొక్క మనస్సు, విషయములవైపునకు వ్రాలుచున్నది. రెండు రూపములుగా వ్రాలుచున్నది. చూచేవాడు చూపబడునది, అను రెండు రూపములుగా

ఉన్నట్లు తెలిసికొనుచున్నది. తెలివితక్కువవారివల్ల, ఆలాగు తలచబడుచున్నది. ఆలాగు చూడబడేదానికి ఏవిధమైనను గుణములేదు. (౧౦ - ౫౮ పే. ౨౭౨)
కనబడే జగత్తు విజ్ఞానమువల్ల సృష్టించబడి యున్నది. అని మండల బ్రాహ్మణోపనిషత్తులో ౧౨. ఈ విధముగా చెప్పబడినది: జగత్తుయొక్క సృష్టికి మనస్సు కర్త, నిలచి యుండుటకును, ప్రళయమునకునుగూడ మనస్సే కర్త ...
ఈ మనస్సే మహావిష్ణువు.

## ముక్తి లేక మోక్షము

విజ్ఞానవాదములో 'విజ్ఞానాప్తిమాత్రత' లేక 'విజ్ఞానమాత్రత' అనునది ఉన్నది.

'విజ్ఞానమాత్రత', అంటే, విజ్ఞానము, అది ఉండేస్థితి. అదే విజ్ఞానమాత్రత అని చెప్పబడుచున్నది.

విజ్ఞానము, ఏ విషయమును, చూడనప్పుడు అది దానిలోనే ఉంటున్నది. విజ్ఞానము, విజ్ఞానములోనే యుండుస్థితి, 'విజ్ఞానమాత్రత' అనబడును.

దీనినే విజ్ఞానవాదులు ముక్తి, మోక్షము అని చెప్పుచున్నారు.

వేదాంతములో విజ్ఞానమాత్రము, అనేమాటకుబదులు

'ఆత్మసంస్థజ్ఞానము' అని చెప్పబడి ఉన్నది. అనగా, తనలోనే ఇమిడియుండు జ్ఞానము; గౌడపాదుని వలన ఉపయోగించబడిన, ఈమాట ఛాందోగ్యోపనిషత్తులో (౭.౨౪. ౧. ౨) చెప్పబడిన, ఎక్కడ మనుష్యుడు దేనిని చూడడో, ఎక్కడ మనుష్యుడు దేనిని తెలిసికొనడో, అదే ఆద్యంతములు లేనిది (Infinite) భూమన్ ఆద్యంతములు లేనిది, శాశ్వతమైనది; ఆద్యంతములు ఉండేది అశాశ్వత మైనది. దాని గొప్పతనములోనైననరే, లేక గొప్ప తనము కానిదానిలోనైననరే, అని చెప్పబడిన మాటలను ఆధారముచేసికొని గౌడపాదుడు, పైనచెప్పిన వ్యాఖ్యా నము వ్రాసిఉన్నారు.

గౌడపాదుడు ఆగమసూత్రములో ఈక్రింది విధముగా చెప్పిఉన్నారు; మనస్సు క్షీణించి, చీకటిలో పడకుండా ఉండినపుడు, లేక మనస్సుచెదరి, భ్రాంతిలో పడకుండా ఉండినపుడు, మనస్సు అస్థిరముకానప్పుడు, మనస్సునకు ఇంద్రియనిగ్రహము లేనప్పుడు, అనగా మనస్సు, అట్టి స్థితిలో ఉన్నప్పుడు బ్రహ్మమగును. ఈ విధముగా విజ్ఞాన వాదులయొక్క, 'విజ్ఞానమాత్రము' వేదాంతుల బ్రహ్మ భావమగుచున్నది. బ్రహ్మభావము అనగా బ్రహ్మఅగుట ఇదియె, బ్రహ్మవాదులయొక్క, ముక్తి, ఈ ముఖ్య

విషయములో వేదాంతులు, బౌద్ధులు, పూర్తిగా ఏకీభవించుచున్నారు. అనగా గౌడపాదుడును, యోగ వాసిష్ఠరామాయణమును రచించినవారున్ను, ఈవిషయమై ఉపనిషత్తులకు, ఏమి అర్థముచేసినారో, అదే అర్థమును బుద్ధుడుకూడ చేసిఉన్నాడు.

బుద్ధునికి వేదాంతము బాగా తెలుసునని చెప్పుటకు ఇది ఒక ముఖ్యమైనసాక్ష్యము. మఱియు, మాధ్యమికుల యొక్క, ప్రపంచోపశమమునకు, తరువాతవచ్చిన, మాండూక్యవిజ్ఞానము 'విజ్ఞప్తిమాత్రత', బౌద్ధుల నిర్వాణము, లేక వేదాంతులయొక్క బ్రహ్మప్రపత్తి, లేక బ్రహ్మభావము, సాంఖ్యులయొక్క కేవల జ్ఞాన, యోగులయొక్క యోగము, లేక చిత్తవృత్తి నిరోధము, ఉపనిషత్తులలో, విష్ణువు, పరమపదము, భక్తియోగము ఇవి అన్నియు నొకటే అని తెలియవలెను.

మహావగ్గలోని 'వినయ' లో చూపింపబడిన 'అస్సాజ' 'సరిపుత్త' సంవాదములో చూపింపబడిన జ్ఞానము ఉదయించిన పిమ్మటనే బుద్ధుడు, విషయములయొక్క పుట్టుక, నాశములను, కనిపెట్టగలిగిఉన్నాడు. జగత్తు నిలిచియుండుటకు, పన్నెండుభాగములతో కూడుకొన్న కారణము (ద్వాదశాంగనిదానము) న్ను, దానిని ఆధా

రముచేసికొని పుట్టడమున్ను, వీటినిగురించి బుద్ధుడు బోధించుటయున్ను తటస్థించినది. ఇవి అన్నియు మనుష్యునియొక్క- కష్టములు, బాధలు, క్రమేణ పుట్టుటయు, అజ్ఞానముయొక్క- నాశము, ఇవి అన్నియు పైనచెప్పిన వాటివలన చూపింపబడుచున్నవి. ఇప్పుడు, అజ్ఞానమువల్లనే నశింపు చేయబడుచున్నది. అజ్ఞానమును నశింపుచేయుటకు ముందుగా బోధిసత్త్వుడు కావలయును.

బోధిసత్వునికి గొప్పపనులు విధించబడియున్నవి.

సర్వభూతహితము, శిక్షణ, మొదలైనవాటిని, బోధిసత్వుడు బ్రతికియున్నంతకాలము చేసినప్పుడే నిర్వాణము నకు అర్హతను సంపాదించుచున్నాడు.

బోధిత్వమునకు అర్హతను పొందుటకు పూర్వము బోధిసత్వుడు అయి యుండవలెను.

౧. బోధిసత్వునియొక్క- మొదటివిధి, సమస్తభూత కోటియందును, సమబుద్ధి, సమమైనసేవ, ఇతరుల కష్టము లను, బాధలను, నివారణచేయుటలో దేహమును, ప్రాణమును, అర్పించుటకు సిద్ధముగా నుండవలెను.

ఎదటివాని బాధల నివారణచేసిన పిమ్మటనే, తన కష్టములను నివారణ చేసికొనుటకు ప్రయత్నము చేయ వలెను.

ప్రపంచములోని జంతుకోటియొక్క బాధలు నివృత్తి చేయువఱకును, తన సుఖమును గుఱించి, ఆలోచించ కూడదు. ప్రపంచములోని, జీవకోటిలో, ఒకటైనకూడ విడువబడకుండా సంసారములోనుంచి, విముక్తుడైనపుడే, తాను జ్ఞానమును పొందుటనుగుఱించి ఆలోచించవలెను.

౨. బోధిసత్వుడు, తనఆస్తులను, భోగములను, దేహముతోసహా ముందుగా విసర్జించవలెను. సమస్త మును, విసర్జించి ప్రజలయొక్క మేలుకొఱకు ప్రయత్నము చేయవలయును.

తథాగతులను, అనగా బుద్ధులను సేవించవలయును. ప్రపంచమునకు సేవచేయుట వల్లనే వారిని సేవించుటకు సాధ్యమగును.

బోధిసత్వుడు ఈ క్రిందివిధముగా తలచవలెను. "నేను తథాగతులను పూజించుటకొఱకే ప్రపంచమునకు సేవ చేయుచున్నాను. జనులందఱు వారిపాదములను నా నెత్తి మీద పెట్టుదురుగాక, లేక నన్ను చంపుదురుగాక, భగవంతుడైన బుద్ధుడు సంతోషించుగాక.

దయతోకూడుకున్న హృదయములుగల తథాగతులు ప్రపంచముతో ఐక్యమైపోయి యున్నారు. వారే ఈ ప్రాణికోటి రూపముల దాల్చినారు. కాబట్టి ప్రజలే

భగవంతులు, వారికి ఎందుకు అగౌరవము చూపవలెను. ప్రజాసేవ తథాగతులసేవ అయి యున్నది. ఇది ఒకరికి మేలుచేయుటయే అయి యున్నది. ఇది ప్రపంచములోని బాధను తొలగించుటయే అయి యున్నది. కాబట్టి దీనినే నాయొక్క వ్రతముగా నుండనిమ్ము." (౧౬. ౨౧.)

"నిర్వాణము, సమస్తమును, విసర్జించడములో నున్నది. నా మనస్సు దానికి సిద్ధముగానున్నది. నాకు ఉన్న సర్వమును నేను విసర్జించవలెను. నా సమస్తమును సమస్త జీవకోటికిని విసర్జించవలయును. నన్ను, నేను వారికి ఒప్పగించుకొనుచున్నాను. వారియిష్టము వచ్చినట్లు చేయవచ్చును. వారు నన్నుచూచి నవ్వవచ్చును, వెక్కిరించవచ్చును, లేక నా నెత్తిన మట్టి కొట్టవచ్చును. నా దేహమును వారి యిష్టమువచ్చినట్లు చేయవచ్చును. నా దేహమును వారికి సమర్పించినపుడు, దానినిగురించి నేను ఆలోచించవలసిన అవసరములేదు. వారి యిష్టమువచ్చిన పనిని, నాచేత వారు చేయించుకొనవచ్చును, నావల్ల ఎవ్వరికి ఎప్పుడుగూడ ఏవిధమైన కీడు కలుగకుండుగాక.

నాకు నేరమును ఆరోపించువారు అందఱును, నాకు హానిచేయువారు అందఱును, నన్నుచూచి పరిహాసముగా నవ్వువారు అందఱును జ్ఞానమును పొందుదురుగాక.

నేను, ఆధారములేనివారికి ఆధారమును చూపిన వాడను అగుదును గాక, బాటసారులకు సహాయము చేయువాడను అగుదును గాక, అవతలి యొడ్డునకు పోవు వారికి నేను ఒక పడవగానో, నావగానో, తెప్పగానో ఉపయోగపడుదును గాక, వెలుతురు కావలసినవారలకు దీపము అగుదును గాక, పడక లేనివారికి పడకనగుదును గాక, నౌకరు లేనివారికి నౌకరును అగుదునుగాక, జీవకోటి అంతా ముక్తి పొందేవఱకును, నామీద వారు జీవనముచేసి, బ్రతికేలాగు చేయుటకు నాకు శక్తి ఉండును గాక." ఇవి అన్నియు బోధిసత్వుని సొంత మాటలు.

ఇవే భావములు, భాగవత పురాణములలో ౧.౨ ౨౧, ౨౨ లలో రంతిదేవుని నోటగుండా పలుకబడినవి. "దేవుని దగ్గరనుంచి నాకు గొప్పపదవి అక్కఱలేదు. పునర్జన్మ లేకపోవడముకూడ నాకు అక్కఱలేదు. నాకు కావలసినది ఒక్కటే ఉన్నది. అది ఏమి అనగా అందఱు పడే బాధలు నేను పడడము నాకు కావలెను. వారిలో నేను ఉండి, వారుపడే బాధలు నేనుపడుట నాకు కావలెను. నా మూలమున వారి కష్టములు తొలగిపోవుట నాకు కావలెను."

ధృవుడు భగవంతునితో ఈ విధముగా చెప్పినాడు. ప్రపంచముయొక్క క్షేమము నాకు కావలయును. నాకు ఇతరకోరిక ఏదియునులేదు.

మహానిర్వాణ తంత్రములో ౨. ౩౩ లో మహాదేవుడు పార్వతికి ఈ క్రిందివిధముగా చెప్పినాడు.

"ఓ పరమేశ్వరీ! ప్రపంచమునకు మేలు జరిగినయెడల, భగవంతుడు సంతోషించును.

ప్రపంచమునకు భగవంతుడు ఆత్మయై యున్నాడు. అది ఆ భగవంతునిమీద ఆధారపడి ఉన్నది.

అందరికి సేవచేయుట, అందరి కోర్కెలను ఈడేర్చుట, అందరికి రక్షణను ఇచ్చుట, ఇవి అన్నియు శివునియొక్క పూజ అనబడును."

అని బ్రహ్మసూత్రము ౧. ౨. ౧ కు శ్రీకాంతుని వ్యాఖ్యానములో వ్రాయబడి యున్నది.

## తర్పణములు

మనుష్యుడుచేయు తర్పణములలో "ఈ మూడు లోకములు తృప్తిపొందునుగాక, బ్రహ్మ మొదలు గడ్డిపోచ వఱకు సమస్తమును తృప్తి పొందునుగాక." అని అనుచున్నాము.

# యోగ సూత్ర సిద్ధాంతము

వేదములలో చెప్పబడిన ఋషులు, ఈ క్రిందివిధముగా ధ్యానము చేయుచున్నారు.

అన్ని దిక్కులును నాకు స్నేహముగా నుండునుగాక.

జీవకోటి అంతయు నన్ను దయతో చూచునుగాక.

నేను అన్నిటిని దయతో చూచెదనుగాక, మనసుందర ముగూడ, సమస్తభూతకోటిని, ప్రేమతో చూచెదము గాక.

ఉపనిషత్తులు గీతాశాస్త్రముకూడ, సర్వభూతహిత మును బోధించుచున్నవి. మఱియు సమస్త భూతకోటిలో, తనను చూచుటను గుఱించిన్ని, తనలో సర్వభూతకోటిని చూచుటను గుఱించియు బోధించుచున్నవి. ఈ విషయ ములోకూడ బౌద్ధసిద్ధాంతము వేదాంతమునకు వ్యతిరేక మైనదికాదు.

వ్యతిరేకము కాకపోవడమే కాకుండా, ఉపనిషత్తుల లోను, గీతాశాస్త్రములోను, సర్వ భూతహితమును ఏలాగు ఆచరణలో పెట్టవలెనో, ఆ విధానమునుచేసి చూపించియున్నది. పైన చెప్పిన బోధనత్త్వాని దీక్ష, ప్రమాణములు, ఆదర్శ పూర్వకముగా ఉన్నవి. ఈ విధముగా బౌద్ధ సిద్ధాంతము, వేదాంత సిద్ధాంతమును వ్యాపింపజేసి ఉన్నది.

## యోగ సూత్ర సిద్ధాంతము

జాతి, మత, భేదములేకుండా, సర్వప్రాణికోటికి సేవ యేలాగు చేయవలెనో ఆమార్గమును స్థాపించియున్నది. కృతయుగ పద్ధతులకు దగ్గఱగా ప్రజలను తీసుకొని పోయినది.

## మోక్షము, కామము, సంసారము

౧. వేదాంతులు, 'సంసారమునకు మూలకారణము అజ్ఞానము' అని చెప్పియున్నారు. బుద్ధుడు దానిని అంగీకరించి ఉన్నాడు.

౨. 'సంసార బంధమునకును. కష్టములకును, కారణము కామము' అని వేదాంతులు చెప్పియున్నారు. బుద్ధుడు దానిని ఒప్పుకొని ఉన్నాడు.

౩. 'అనుభవించుటవల్ల. కామము తగ్గదు సరేకదా, మఱీ కొంత ఎక్కువ అగును' అని వేదాంతులు చెప్పెదురు. అధర్వణ వేదములో, ఒకఋషి కామమునుగూర్చి, ఈ విధముగా చెప్పియున్నాడు: "భూమి, ఆకాశము, ఎంత పెద్దవిగా నున్నవి? జలము ఎంత విస్తారముగా ప్రవహించుచున్నది? అగ్ని ఎంతదూరము వ్యాపించి యున్నది? వాటి అన్నిటికంటె నీవు ఎంత ఎక్కువ శ్రేష్ఠముగాను గొప్పదిగాను ఉన్నావు."

ఓ కామమా! నీకు నేను నమస్కరించుచున్నాను. లోబడి యున్నాను. అని చెప్పియున్నాడు. వేదములలో అనేకచోట్ల, కామమును అగ్నితో పోల్చియున్నారు. అగ్ని సమస్తమును దహించుచున్నది. కనుక అలాగే కామము, సమస్తమును ఋషులతో సహా అజ్ఞానముతో కప్పుచున్నది.

ఋషులు, కామముయొక్క శక్తిని గ్రహించియే ఈ క్రింది విధముగా చెప్పియున్నారు. "మనస్సులోనుండే కోరికలన్నియు నశించినప్పుడు, అశాశ్వతమైన జీవుడు, శాశ్వతమైన పరమాత్మ అగుచున్నాడు. జీవించి ఉండగానే పరబ్రహ్మ మగుచున్నాడు." ఇదే భావము ఉపనిషత్తులలోను గీతా శాస్త్రములోను, సంపూర్ణముగా చెప్పబడి ఉన్నది.

బుద్ధునుకూడ ఈ అభిప్రాయముతో ఏకీభవించి, ప్రపంచములోని అన్ని బాధలకును కామమే కారణమని బోధించి ఉన్నాడు. కామమును జయించినతరువాత నే, తాను జ్ఞానమును పొంది ఉండినాడు.

కామము మృత్యువును గలుగజేయును. గనుక,

బుద్ధుడు నచికేతనుని మోస్తరుగా మృత్యువును జయించి నాడని చెప్పబడి ఉన్నది.

కామముతో కూడుకొన్న సంసారవృక్షమును అసంగము అనే కత్తితో, ఉపనిషత్తులు, గీతాశాస్త్రములలో చెప్పియున్న ప్రకారము బుద్ధుడు మొదలంట నరికి ఉన్నాడు.

సమస్త వేదములకు, ఉపనిషత్తులకును సారమైన గీతా శాస్త్ర సిద్ధాంతముతో గూడ, పూర్తిగా బుద్ధుడు ఏకీభవించి ఉన్నాడు.

ప్రపంచములోని, అన్ని దుఃఖములకు, కష్టములకు, అజ్ఞానము, కామము, కారణములై ఉన్నవి.

అజ్ఞానము అనగా చూడలేకపోవడము లేక తప్పుగా చూడడము; ఆలాగు చూచుటచేత, లేనివస్తువును ఉన్నట్లుగాను, చెడ్డవస్తువును మంచివస్తువుగాను, తలచుచున్నాము. ఆకారణముచేత స్వభావసిద్ధముగా కోరికలు పుట్టుచున్నవి. కోరికలు తప్పుదారిలోనికి తీసుకొనిపోవుచున్నవి. తుదకు నాశము చేయుచున్నవి. అజ్ఞానమును

తొలగించితేనేగాని కామము నశించదు. జ్ఞానమును పొందితేనేగాని, అదిన్ని సంపూర్ణజ్ఞానమును పొందితేనే గాని అజ్ఞానము నశించదు. అని చెప్పినదానివలన స్పష్ట పడుచున్నది.

## అజ్ఞానమును తొలగించు విధము

ఉపనిషత్తులలో ఋషులు ఈ విధముగా బోధించి ఉన్నారు. "పరమాత్మ, అన్ని దేహములలోను అన్ని స్థలములలోను వ్యాపించి ఉన్నది. పరమాత్మ ఒక్కటే అయి ఉన్నది. రెండవదిలేదు. క్రింద, పైన, వెనుక, కుడిప్రైపున, ఎడమవైపున ఏతట్టు చూచినను పరమాత్మయే ఉన్నది. అని మనుష్యుడు తెలిసికొనవలెను. జ్ఞానమును పొంది, నేనే యీ పరబ్రహ్మను అని తెలిసికొనవలెను. ఆలాగు తెలిసికొనినయెడల సమస్తకోరికలు, నశించు చున్నవి. కష్టము, దుఃఖము, మనోవ్యాధి, అన్నియును నశించుచున్నవి." అని ఋషులు బోధించుచున్నారు.

సమస్త ప్రాణికోటి, ఆత్మయేయని, తెలిసికొనినప్పుడు, సర్వత్ర, ఏకత్వము కనుపడునపుడు దుఃఖము, కష్టమును

ఎక్కడ నుండగలవు?

అని ఉపనిషత్తులలోని ఋషులు బోధించుచున్నారు. మఱియు "మనుష్యుడు ఆత్మను గుఱించియే తలంచవలెను. ఆత్మనుగుఱించియే వినవలెను; ఆత్మను గుఱించియే ధ్యానము చేయవలెను. కలుసుకొనవలెను. అదియే మోక్షము." అని ఋషులు బోధించుచున్నారు. ఇది అంతయు ఉపనిషత్తుల సిద్ధాంతము.

బుద్ధుడు ఈ సిద్ధాంతముతో ఏకీభవించడు. దీనికి కేవలము విరుద్ధముగా బోధించుచున్నాడు. ఇక్కడనే వేదాంతమునకును బౌద్ధ సిద్ధాంతమునకును ఉండే నిజమైన భేదము.

బుద్ధునియొక్క "పరమాత్మలేదు" అనే యీ వాద మును బాగా అర్థముచేసికొనుటకై, అద్వైత సిద్ధాంతము నందు ఈ విషయమును పూర్తిగా మనస్సులో నుంచుకొన వలెను. అద్వైత సిద్ధాంతము ప్రకారము ౧. దేహేంద్రి యాదులు వాటంతట అవియే నడచుకొనుచున్నవి. అనగా త్రిగుణములచేత చేయబడిన ప్రభావముచేత నడుప బడుచున్నవి. ౨. పరమాత్మకు ఏవిధమైన సంబంధము లేదు. పరమాత్మ సాక్షిభూతుడుగా నున్నాడు. ఉప నిషత్తులలో చెప్పబడిన సిద్ధాంతము ఇది.

## బుద్ధుని భేదాభిప్రాయము

పైనచెప్పిన సిద్ధాంతము, మొదటి భాగమునకు ఆక్షేపణలేదు. రెండవభాగమున చెప్పబడిన పరమాత్మ, అనే దేవుడులేడు; అని బుద్ధునివాదము.

"పరమాత్మ మోక్షము నియ్యదు. బంధమును కలుగజేయుచున్నది. నేను, నాది అనే భావము సంసార బంధమునకు కారణము. కాబట్టి ఆభావము నశింపు కావలయును. బంధములోనుంచి విముక్తి కావలెను." అనే విషయములో, బుద్ధుడు, వేదాంతులును ఒకే అభిప్రాయములో నున్నారు. కాని సాధనవిషయమై భేదాభిప్రాయము కలిగినది.

వేదాంతులు 'ఆత్మజ్ఞానముకలిగినయెడల, బంధవిముక్తి అగును' అని చెప్పుచున్నారు దీనికి బుద్ధుడు ఆత్మ అనునది నిజముగా నున్నయెడల, నేను, నాది అనే భావము నశింపదు. కాబట్టి ఆత్మ అనే వస్తువే లేదు. అని వాదించుచున్నాడు. ఆత్మఉన్నయెడల నేను, నాది అనే భావము నశించుటకు అవకాశమే కలుగదు. అనగా అహంకార మమకారములు నశించవు. అవి నశించని యెడల దుఃఖము కష్టములు నశించవు. అవి నశించని

యప్పుడు, ఆత్మ ఉన్నది అని తెలిసినయెడల, ఆత్మ, దేహము, ఒకటేయని తలచుచున్నాడు. దానితోటి దేహముమీద ఎక్కడలేని ప్రేమ కలుగుచున్నది. ఈ ప్రేమ సుఖములమీద ఆశను గలిగించుచున్నది. ఈ ఆశ, సుఖములు, అశాశ్వతములైనవని తెలిసికొనుటకు శక్తి లేకుండా చేయుచున్నది. ఆస్థితిలో ఆవస్తువులు తనకు ఉండదగినవి అనే బుద్ధి పుట్టుచున్నది. పిమ్మట వాటి నిమిత్తము యత్నము చేయుచున్నాడు వాటిని పొందిన తర్వాత తనవే అని పట్టుపట్టుచున్నాడు. ౬. ౭. ౮౫.

ఆత్మ ఉన్నదనే భావము కలిగినయెడల ఆత్మ కానిది మఱియొకటి ఉన్నదనే భావము కలుగుచున్నది. ఆత్మ మీదను, ఆత్మ కానిదానిమీదనుగూడ భక్తిప్రేమలు పుట్టుచున్నవి. అప్పుడు కామక్రోధములు కలుగుచున్నవి. వాటివల్ల సమస్తహానులు సంభవించును. 'నేను - నాది' అనే అహంకారభావము వదలనియెడల, పునర్జన్మ కలుగుచునే యుండును. ఆత్మ ఉన్నదని తలంచునంతకాలము, అహంకారము నశించదు. ప్రపంచములో ఆత్మలేదు అని వాదించేది నీవు తప్ప మఱి ఒకడులేడు. కాబట్టి నిర్వాణము నిచ్చుటకు నీ సిద్ధాంతముకంటె మేలైనది మఱియొకటి లేదు. అని బుద్ధునియొక్క భక్తుడు.

బుద్ధునితో చెప్పెను.

ఆకారణముచేత బుద్ధుని శిష్యులలో ఒక గొప్పవాడు 'ఆత్మలేదు' అని చెప్పుటకు కారణమును ఈ క్రింది విధముగా చెప్పినాడు.

"కామక్రోధములు మొదలైన చెడుగుణము లన్నియు ఆత్మఉన్నదని తలచుటలోనుంచి పుట్టుచున్నవి. గనుక ఈ భావము ఆత్మమీదనే నిలుపబడి యుండుట చేతను, ఈ రెండుకారణములచేత, ఆత్మ అసలే లేదు. అని బుద్ధునివల్ల చెప్పబడి యున్నది.

అలాగు చెప్పుటకు ఉద్దేశము ప్రపంచములో తెలిసి కొనేవాడు, తెలిసికొనబడు వస్తువు, రెండుగూడ యథార్థములో లేవని చూపించుటకే అయి ఉన్నది. ఇది సరి అయిన యెడల, శోకములు పుట్టుటకే అవకాశము ఉండదు.

ఈవిధముగా, కామము నశించుచున్నది. నిర్వాణము పొందబడుచున్నది.

## జగత్తు మిథ్య

తెలిసికొనేవాడు, తెలిసికొనబడు విషయము మన కండ్లయెదుటనే కనబడుచుండగా, అవి లేవు అని చెప్పుట

ఏలాగు సాధ్యము. అని ప్రశ్న దీనికి జవాబు 'నిరాత్మ' అని బుద్ధుడు చెప్పినాడు. అనగా 'ఆత్మ లేదు అని ఒప్పుకొనే యెడల తెలుసుకొనువాడు తెలిసికొనబడు విషయము ఉన్నట్లు కనబడుచున్నప్పటికిని యథార్థములో ఎందుకు లేవో బోధపడును' అని బుద్ధుడు చెప్పినాడు.

## నిరాత్మ

నిరాత్మ అనగా, ఆత్మ లేదు అని చెప్పడమే. ఆత్మ అనగా స్వభావము. స్వభావము ఎట్టిదనగా వికార గుణములు లేనిదీ శాశ్వతమైనదీ అయి ఉన్నది.

## నిరాత్మ రెండు విధములు

౧. పుద్గాలనిరాత్మ ౨. ధర్మనిరాత్మ ౧. పుద్గాల అనగా, సత్వ, జీవ, పురుష మొదలైనవి. అనగా ఆత్మ. ఆత్మ అనే పుద్గాల నిరాత్మకు స్వతంత్రమైన స్వభావము లేదు. కాబట్టి దానికి ఉండడము అనేదిలేదు. కాబట్టి అది, యథార్థములో ఉన్నవస్తువు కాదు. కాని ఒక పేరు, ఉండేకాలము మొదలైనవాటిని కలిగిఉన్నట్లు కనబడుచు ఒక భ్రాంతిని కలుగజేయుచున్నవి.

# ధ ర్మ ము లు

అదేవిధముగా, ధర్మములు, అనగా లోపల, బయట ఉండేవిషయములు మనకు చుట్టునున్నవై ఆత్మనుగాని, స్వతంత్ర స్వభావమునుగాని పొందనివై ఉన్నవి. కారణ మేమనగా, అధర్మములు కారణములమీదను ప్రాతీత్య సముత్పాదమును, ఇతర పరిస్థితులమీదను, ఆధారపడి ఉన్నవి.

తన స్వభావములోనే లేనటువంటి అది, ఇతర స్వభావములలో ఏలాగుఉండగలదు? కాబట్టి వస్తువు కనబడుచు నున్నప్పటికి యథార్థములో లేనివిగానే ఉన్నవి. భ్రాంతి వల్ల ఉన్నట్లు కనుబడుచున్నవి. దీనిపేరు ధర్మనిరాత్మ. ఈ విషయమై వాదప్రతివాదములు అనేకములుగా జరిగి యున్నవి.

తెలిసికొనేవాడుగాని తెలిసికొనబడే విషయముగాని వాస్తవములో లేకపోవుటచేత, జ్ఞానియైన వానికి కోరికలు ఉండుటకు అవకాశములేదు. ఇదేభావము, విజ్ఞానవాదుల లోను శూన్యవాదులలోను కూడ ఉన్నది. దీనిని ఆధారముచేసికొని బుద్ధుడు, "ఇదిఅంతా మనస్సే, కాని మరి యొకటికాదు." అని చెప్పినాడు. వేదాంతులు "ఇది

అంతా బ్రహ్మమేగాని, మఱియొకటి కాదు" అని చెప్పి యున్నారు. ఉభయులుకూడ జగత్తుఅంతా మిథ్య అని ఒప్పుకొనుచున్నారు. చిత్తము, బ్రహ్మము అనువాని యొక్క అర్థము ఒకటేయని పైన చర్చించి చూపి యున్నాము.

## బ్రహ్మ ప్రాప్తి

పాళీభాషలో పత్తి అంటే, పొందడము. బ్రహ్మ పత్తి అంటే బ్రహ్మను పొందడము. బ్రహ్మభూతమంటే, బ్రహ్మతో ఐక్యము. వేదాంతములో ఉపయోగించబడిన ఈ రెండుపదములును బౌద్ధసిద్ధాంతములోగూడ ఉపయోగించబడి యున్నవి. బుద్ధుడును, అర్హతుడును, బ్రహ్మ భూతుడు అని బౌద్ధగ్రంథములలో; అందులో ముఖ్య ముగా 'ఇతిఉత్తక' లో చెప్పబడిఉన్నది.

బౌద్ధులలో వైదికులు దీనికి వేఱు అర్థము చేయుటకు ప్రయత్నము చేసినారుగాని, అది సరికాదు.

విజ్ఞానవాదులవల్ల స్థిరపడినవిజ్ఞానము, లేక విజ్ఞాన మాత్రముప్రకారము బ్రహ్మభూతము బ్రహ్మప్రపత్తి అనే మాటలకు అర్థము వేదాంతములలో చెప్పబడిన అర్థమే గాని వేఱుగాదని స్పష్టపడుచున్నది.

## జంతు హింసలు

వేదములలో చెప్పబడిన జంతుహింసలతో గూడుకొన్న కర్మలను, బుద్ధుడు ఏలాగు నిరాకరించినాడో, అలాగే వేదములలోను, వేదాంతములలోను, ఆత్మవిషయమై అనగా పరమాత్మ అనే దేవునిగుఱించిన సిద్ధాంతమును గూడ, బుద్ధుడు నిరాకరించినాడు. అదేవిధముగా జీవితముయొక్క గొప్పఫలమును బొందుటకు వేదములలో చెప్పబడిన కర్మలు మొదలైన సిద్ధాంతములను, బుద్ధుడు నిరాకరించినాడు.

బుద్ధుడు యోగమును, ధ్యానమును, అంగీకరించినాడు. బ్రహ్మచర్యము, అన్నిటికంటె శ్రేష్ఠమైనదని, బోధించినాడు. తనభక్తులకు, బ్రహ్మచర్యమును గుఱించి బోధించుచు, ఇతరులకుగూడ, బ్రహ్మచర్యమును గుఱించియే బోధించమని చెప్పినాడు. (మహావగ్గ ౧. ౨. ౧.)

అనగా ధర్మమునుగుఱించి, బోధించునపుడు బ్రహ్మచర్యమును గుఱించి సంపూర్ణముగా, వివరముగా బోధించమని చెప్పియున్నాడు.

## బోధిసత్త్వుడు

బోధిసత్త్వుడు, బోధిచిత్తమును వృద్ధిచేయవలయును.

తాను తుదకు జ్ఞానమును (బోధిని) పొందుచున్నానని ప్రమాణము చేయవలయును. మఱియు జీవితకాలమంతయు, ప్రాణికోటికి సేవ చేయుచున్నాననీ వారికి నిర్వాణము లభించేలాగు చేయుచున్నాననీ ప్రమాణము చేయవలెను.

## నిర్వాణము

నిర్వాణ మనగా ప్రపంచ సంసారములోనుండి విముక్తుడగుట.

## పరామితలు

బోధి, చిత్తమును పొందినతరువాత, జన్మముతరువాత జన్మములో పరామితలను అభ్యసించవలయును. అనేక జన్మలగుండా, ఈ గుణములను, సంపాదించునప్పుడు బోధిసత్త్వుడు బోధిసత్త్వుడనియే పిలువబడుచున్నాడు. గృహస్థు బోధిసత్త్వుడుగా నుండవచ్చును. సన్యాసి, యతిగూడ బోధిసత్త్వుడుగా నుండవచ్చును.

## మహాయానము, హీనయానము

బౌద్ధమతము మహాయాన మనియు, హీనయాన మనియు రెండు భాగములుగా విభజింపబడి యున్నది.

హీనయానము చిట్టగాంగ్ (బెంగాల్) బర్మా, సిలోన్‌లలో వ్యాపించియున్నది.

మహాయానము, నీపాల్, టిబెట్, చైనా, జపాన్, మంగోలియాలలో, అవలంబించబడుచున్నది. ౧౯ వ శతాబ్దములోని బౌద్ధపండితులు, హీనయానమును దక్షిణ బౌద్ధమనీ మహాయానమును ఉత్తరబౌద్ధమనీ చెప్పిరి.

యథార్థములో మహాయానము దక్షిణబౌద్ధమనీ, హీనయానము ఉత్తరబౌద్ధమనీ చెప్పి ఉండవలెను.

ఆదిలో బౌద్ధులు హీనయానమును ఎఱుగరు. వారి పిటకములలో దీనినిగుఱించి చెప్పబడి ఉండలేదు. మొట్ట మొదట బౌద్ధ సంస్కృతగ్రంథములలో దీనినిగుఱించి చెప్పబడి యున్నది.

వీటి రెండింటికిని సాధారణమైన పేర్లు ౧. బుద్ధాయనము లేక తథాగతాయనము లేక మహాయానము, లేక బోధి సత్త్వ యానము.

౨. శ్రావకాయన అనీ, ప్రత్యేకబుద్ధాయన అనీ లేక వానాయన అనీ కూడా పేర్లున్నవి.

## యానము

యాన అనగా బండి, మహా అనగా గొప్ప, మహా

యాన అనగా గొప్పబండి, అన్నిటికంటె గొప్పదగును గమ్యస్థానమునకు తీసికొని పోయేబండి

ఆ గమ్యస్థానము ౧ బుద్ధుని లేక తథాగతుని యొక్క పదవి. ఈ స్థానము గౌతమసిద్ధార్థునివలన పొందబడి యున్నది.

౨. హీన, అంటే, హీనమైన తక్కువ తరగతికి చెందినది. ఈ బండి తక్కువగమ్యస్థానమునకు తీసికొని పోవునదియై ఉన్నది. ఇది, అర్హాత పదవికిమాత్రమే తీసికొని పోవును.

## హీ న యా న ము

హీనయానము, శ్రావకులకు మాత్రము అన్వయించును. అనగా వినుటవల్లమాత్రము నేర్చుకొనువారు తక్కువతరగతి మనుష్యులకు అన్వయించునది మహా యనముగుండా బుద్ధుడు కావచ్చును. హీనాయనముగుండా అర్హాతుడు కావచ్చును.

హీనాయనము, దుఃఖములను కష్టములను తొలగించి అర్హాతస్థానమును ఇచ్చుచున్నది.

దానివలన శుచిత్వము కలుగుచున్నది. ఇది సత్య

మును గుఱించి బోధించదు. జ్ఞేయవాసనలను తొలగించ లేదు.

క్లేశమును తొలగించుటచేత, పుద్గల శూన్యత మాత్ర ము లభించుచున్నది. (absence of individuality)

జ్ఞేయవాసనలను తొలగించుటచేత పుద్గల శూన్యత గూడ లభించుచున్నది.

అనగా ప్రపంచములోని అన్ని వస్తువులును ఉన్నట్లు కనుబడుచున్నప్పటికిని వాస్తవములో లేనివే సని బోధించుచున్నవి.

మహాయానము క్లేశవాసనలను జ్ఞేయవాసనలను గూడ తొలగించి సత్యమును కనబఱచుచున్నది.

సత్యము తెలిసినవెంటనే బుద్ధులు అగుచున్నారు. ఈ కారణముచేత మహాయానులు, అని పిలువ బడు చున్నారు.

## బౌద్ధమత ప్రారంభము

క్రీస్తుకు పూర్వము ౬వ శతాబ్దములో బౌద్ధమతము ప్రారంభించబడినది. 3 వ శతాబ్దములో అశోకుని ప్రభు త్వము వచ్చేవఱకు దీనికి అంత ప్రాముఖ్యత లేదు. చాల కాలమువఱకు బౌద్ధులను సన్యాసులనీ, మోక్షముకొఱకు

పాటుపడుచున్నారనీ, ఊరకే పని లేకుండా తిరిగే వారు అనీ తలచుచు నుండిరి.

బుద్ధుడు తన జీవితకాలములో విస్తారము మాట్లాడ కుండ మౌనమును ధరించి ముక్తసరిగా జవాబు చెప్పు చుండే వాడు. శిష్యులకు బోధించునపుడు ఈక్రింది విధ ముగా, "నేను చెప్పిన దానిని మీబుద్ధితో సత్యాసత్య ములను విచారించి విమర్శించి మీకు సత్యమని తోస్తే నమ్మండి లేనియెడల నిరాకరించండి" అని చెప్పేవారు.

## మౌనము

బుద్ధునికి పూర్వము చాలకాలము క్రిందట, ఉపనిషత్తు లలో పరమాత్మ మొదలైన విషయములను అడిగి నపుడు ఋషులు ఈ విధముగా చెప్పినారు.

"మాకు తెలియదు. దీనిని ఏలాగు బోధించవచ్చునో మాకు తెలియదు. అది తెలిసినదానికంటె వేఱైనది, మఱి యు, తెలియనిదానికంటె పైగా నున్నది. అని పెద్దలు చెప్పియున్నారు." బుద్ధుడు, అటువంటిప్రశ్నలు వేసినపుడు జవాబు చెప్పకుండా ఊరకుండువాడు. మౌనమే అన్నిటి కంటె గొప్ప సత్యము. బుద్ధుడు స్థిరబుద్ధికలవాడును

నృథమగు న్యాయమును కనిపెట్ట గలవాడును అయి యుండెను.

భగవద్గీతలో చెప్పినట్లు స్థితప్రజ్ఞుడు, మిక్కిలి దయతో కూడుకొన్న హృదయము కలవాడు. అసమాన భూతదయ కలవాడు. ఇతరుల బాధలు తన బాధలుగా చూచుకొని వారిబాధలను నివారణచేయుటకు పాటు పడువాడు. అందఱి బాధలు నివారించువఱకు తనకు కైవల్యమును కోరియుండలేదు. వేదములను, వేదాంగములను, వేదాంతమును బాగా తెలిసినవాడు.

బ్రహ్మచర్యమును పూర్తిగా అభ్యసించినవాడు. సంయుక్తనికాయ — ౧ - ౧౬౮.

వేదాంతులవలె· పూర్తి అయిన జ్ఞానమును పొందిన వెంటనే బయటికి కర్మలను విసర్జించి లోపలి కర్మలను మాత్రమే చేయుచుండెడివాడు.

"అది బయటికర్మ. అందుచేత దానినివదలిపెట్టి, నేను, లోననుండియే శాశ్వతముగామండేలాగు చేయుచున్నాను. దానిమీదనే నామనసు నిలువబడి యున్నది" అని, బుద్ధుడు ఒక బ్రాహ్మణునికి చెప్పియున్నాడు. మఱియు "ఈలోపలి యజ్ఞమునకు, నాలుక గరిటె అనీ హృదయము అగ్ని వేదిక" అనీ చెప్పినాడు.

## ప్రారంభస్థితి - బుద్ధవచనము

ఆదిబౌద్ధమతము పాలీశాసనములమీాద ఆధారపడి ఉండినది. పాలీశాసనము పుస్తకము కాదు. ఒకసారిగ పుట్టినది కాదు. అప్పుడప్పుడు స్థిరపఱచబడిన సిద్ధాంతములు అన్నియుచేరి పాలీశాసనము, అని పిలువబడెను. దీనికంతటికిని బుద్ధవచనమని పేరు. బుద్ధుని యొక్క మాట. దానికే పావచన (ప్రవచనము) అనే పేరుకూడ కలదు.

పావచనము అనగా, మాటలలో శ్రేష్ఠమైనది. దీనికే 'శుత్తశాసనము' అనియును పేరు. శుత్తశాసన మనగా గురువుగారి అధికారము. ఇదియే 'పరియాత్తి' అనబడెను.

పరియాత్తి అనగా బుద్ధుని శిష్యులకు అనుచరులకును చదువుకొనుటకు విధించబడిన ముఖ్యవిషయములు. ఇదియును ఇదివఱకుచెప్పబడిన అసలు గ్రంథమును ఒకటియే. దీనికంటె వేఱైనవి అర్థకథలు. అనగా వ్యాఖ్యానములు. పాలీభాష అనగా తంతిభాష.

బుద్ధఘోషు డనే గొప్ప పాలీవ్యాఖ్యానకర్త, 'బుద్ధుడు, తన సిద్ధాంతములను మాగధిభాషలో బోధించినాడు' అని వ్రాసియున్నాడు.

బుద్ధఘోషునికిని, ఇతర పాలీవ్యాఖ్యానకర్తలకును, మాగధిభాషకును, నిరుక్తి, అను పాలిశాసనముయొక్క శైలి (Diction) కానవగుచున్నది.

ఈ శైలినిగుఱించి కొంతమట్టుకు అశోకుని శిలాశాసనములలోని భాషవల్ల తెలిసికొనె ప్రయత్నము చేయ బడెను.

అశోకుని గిర్నార్ శాసనములో, పాలిభాష పోలికలు ఉన్నవని తెలియుచున్నది.

పాలిభాష ౫౦౦ సంవత్సరములు బాగా వ్యాపించి వృద్ధిలో నుండినది.

## సమాధి

బుద్ధునికి పూర్వము చాలాకాలమునుండి ఎనిమిది విధములైన సమాధులు యోగులవలన అభ్యసించ బడు చుండెను. సమాధులు 'సంపత్తులు' అని పిలువబడు చుండెడివి.

బుద్ధుడు ఈ ఎనిమిది సమాధులను అతిక్రమించి, 'సన్న వేదాయిత - నిరోధ' అనే తొమ్మిదవ సమాధిని

ప్రపంచములో ఇతరులు ఎవ్వరును ఎరుగని దానిని ఎరిగి యుండెను.

## తలంపులు

ప్రతిసిద్ధాంతము, జ్ఞానమును, అనుభవమును, ఆధార పఱచుకొని, స్థాపింప బడియుండెను.

ప్రతిసిద్ధాంతమును, పరీక్షించి చూడగా, ఏ ఏ మెట్ల మీద ఆధారపడి యుండేది, ఏ ఏ తలంపులమీద ఆధార పడి యుండేది, తెలిసికొని, ఆతలంపులు పూర్తి చేయబడే విధానములు కనిపెట్టబడి యుండెను. ఆఖరు విధానము నకు 'సమ్మ' అని పేరు ఉండెను.

సమ్మ అనగా తలంపు లన్నింటిని ఒకచోటికి జమ చేయుట. మధ్య అనగా, అన్ని తలంపులు జమగాబడు మధ్య నుండు చోటు. (మొన) ఈతలంపులన్నియును ఒకదానికి ఒకటి అడ్డమువచ్చి, ఒకపనికి మఱియొకపని అడ్డమువచ్చి, కలవరమును కలుగజేయునపుడు. వాటి నన్నిటిని చెదరి పోకుండ చేసి ఒక మధ్యచోట జమచేయుట. ఆచోటునకు మధ్య అనుపేరు.

చరిత్రపూర్వకముగ ఆలోచించినయెడల ఆది బౌద్ధము

ఎట్టి దనగా తలంపు లన్నియు పుట్టి పెరిగి, ఒకచోట జమ అయి సమ్మగా యేర్పడి మధ్య అనే భాగమును నింపుట ఇది ఆది బౌద్ధము.

ఆదిబౌద్ధమునకు మూలసూత్రము అనగా తలంపు లన్నియు క్రమేణ పెరిగి పెద్దవయి, ఒకచోట జమ అయి నిర్వహించుటకు తగినస్థితిలో నుండుటయే అయియున్నది.

కొన్ని వందల సంవత్సరములు, అభ్యాసము అయిన తర్వాత ఈస్థితికి రాగలిగి యుండిరి.

పైన చెప్పినదానిని, బాగుగ పరిశీలించి చూచిన యెడల, బౌద్ధమతము హిందూమతమే అనీ, ఆత్మవిషయములో భేదము వచ్చినంత మాత్రముచేత వేఱుమతము కాదనీ తెలియవలెను. ఆత్మవిషయములో అద్వైతమున కంటె వేరైన అభిప్రాయమును బోధించి, రామానుజ మతము, మధ్వాచార్యులవారి మతమువల్లభాచార్యులవారి మతము, ఏవిధముగా హిందూమతములోని భాగములై ఉన్నవో, అదేవిధముగా బౌద్ధమతముగూడ హిందూ మతములోని భాగముగానే గ్రహించవలయును.

౧౫౦౦ సంవత్సరములు ఈదేశములోనేగాక, ఇతర దేశములలో అవలంబించబడినటువంటియు, కృతయుగ పద్ధతులను మఱలస్థాపించుటకు, యత్నించినటువంటియు,

బౌద్ధమతమును, అజ్ఞానమువల్ల కోల్పోవుట, ఈ దేశము లోని ప్రజలయొక్క దురదృష్టము. దేశములో ప్రజా రాజ్యము స్థాపన అయినపిమ్మట కృతయుగ పద్ధతులను స్థాపించుటకు ప్రయత్నములు జరుగునుగాక.

యోగసూత్ర సిద్ధాంతములు మిగిలిన సిద్ధాంతము లతో పోల్చుచు సంగ్రహముగ వివరించినాము. ఈవివరణ మును బట్టి ఇది ఎట్టి యుత్కృష్ట గ్రంథమో పాఠకులు తెలిసికొని ఉందురు. జనసామాన్యము యోగసూత్ర రహస్యములు తెలిసికొనుటకు యోగసూత్రము పఠించి చరితార్థు లగుదురుగాక.

సంపూర్ణము

# ఆంధ్ర శిల్పి

సంపాదకులు

శ్రీ గణపతిశాస్త్రి

శ్రీ సాంబశివరావు

ఆంధ్రవాఙ్మయానికీ, కళలకూ, సంస్కృతికీ దోహద మిచ్చే సచిత్రాంధ్ర మాసపత్రిక. ఆంధ్రమాసపత్రిక లన్నిటిలోను, అత్యుత్తమ మని ప్రశంసలుపొంది దిగ్విజయంగా నడుస్తూంది. సాలుచందా ఆరు రూపాయలు. విడికాపీ అర్థరూపాయి.

వివరాలకు — మేనేజరు;

'ఆంధ్రశిల్పి'

౧౦. నరసింగపురం వీథి,

మౌంట్ రోడ్, మదరాసు.